శ్రీ

# రా మో ద య ము.

---

ఇది

శృంగారసారసంగ్రహాద్యనేక గ్రంథనిర్మాణధురీణ గానవిద్యానూన పాండితీస్థాన

రం గ య క వి

ప్రణీతంబు.

---

## ప్ర థ మ భా గ ము.

బాలకాండము, అయోధ్యాకాండము, అరణ్యకాండము,

కిష్కింధాకాండము & సుందరకాండము.





చెన్నపురి:

వైజయంతీ ముద్రాశాల

ముద్రితము.

V. కుప్పయ్యసెట్టి & Son వారిచే ప్రకటితము.

---

1908.



---

**PRICE, FOR VOL. I. EXCLUSIVE OF POSTAGE.**

| | |
|---|---|
| Calico, superior bound ... ... | Rs. 2-8-0. |
| Canvas ,, ,, ... ... ... | ,, 2-4-0. |
| Ordinary Marble ,, ... ... ... | ,, 2-0-0. |

# Introductory Note.

Speaking strictly, my connection with Ramodaya is ɪly that of a printer. But I could not, nevertheless, help ancing through the "proofs" from the inevitable curiosity one who is of known partiality to Telugu Poetry. In ɔing so, I was so greatly struck with its special features ıat I wished for an opportunity to point out and emphasise ɪem. That opportunity came to me unsought, when its ɔus and appreciative publisher, Mr. V. Coorathalwar etty, made me a request to record my opinion of it.

Of the author—as of many another inglorious Milton this land—little more is known for certain than what he as chosen to divulge about himself in the personal verses ɔund in the work itself. He tells us that, in his day, he was teemed a musician and that he belonged to and grew up in family of tuneful ancestors. This affords us a clue to the ıarkedly soft and equable flow of his versification which, ı this instance, imparts an added grace to a story which is ccepted, on all hands, as eminently elevating and sweet by s fascinating intrinsic worth. That such a story has fired assic ambition from the earliest times and that it has lled forth the best efforts of the poetic and the dramatic ι, is shown by the numerous renderings of it, now extıt in Sanscrit and Andhra Literature which we possess. ithout instituting a comparison of the present work with ɔse learned and ornate productions and without esti-

mating it by the application to it of the freezing and ext rigid canons of latter-day criticism which seldom, if ever, fluences the practical-minded general reader, I may saf predict for Ramodaya the widest acceptance by all class and grades of men and women—down even to the borde of the unlettered—on the score of its easy and flowing sty and of the unelaborated and sparing use in it of word-beau and flights and plays of fancy, which are usual and whi abound in many works, often to the detriment of perspicuit Ramodaya may be also said to bid fair to become a gener favourite by being almost as easy as plain and elegant pros with the advantage of lending itself to the prevailing tas of reading and reading out with that natural and spo taneous music which is resorted to, when a tolerably me dious voice is possessed or got at.

In heartily commending Ramodaya to every one wh has the means to go in for the pleasant and innocent ente tainment of reading, let me express the hope that its publi sher will not be long in ferretting out and rescuing, from th omnivorous moth and oblivion, the author's other wor which he has named and which, judging by the standar hereby supplied, must indeed be decidedly welcomed as a estimable treasure.

LAKESIDE, KILPAUK.
*1st November, 1903.*

P. ANANDA CHARLU.

శ్రీ

# రామోదయము.

## ఉపోద్ఘాతము.

సీ. "సంసారదావాగ్నిసంతప్తులకు సుధాస్తోమవర్షనియుక్తి రామభక్తి;
తాపత్రయామయతాపపీడితులకు రమ్యభేషజయుక్తి రామభక్తి;
పంచమహాపాపపటలసర్పములకు రచితగారుడశక్తి రామభక్తి;
భవవిపద్వారాశిపాతభీతులకును ప్రబలతరీయుక్తి రామభక్తి;
ప్రేమబోధితగురుసూక్తి రామభక్తి, కామితార్థజనాసక్తి రామభక్తి;
శ్రీమదురుసంపదనురక్తి రామభక్తి, సామరస్యోదితవిముక్తి రామభక్తి."

శ్రీరామచరితము ననేకులగు కవులు స్వమచమత్కృతి దేటపడఁ గావ్యములుగా రచించియున్నారు. అందుచుమించుగ నన్నియుఁ బ్రచురితంబులై యున్నవి. శ్రీరామభక్తిరసం బాస్వాదించి మీ రెల్లరుఁ గ్రోలుండని ప్రకృతిజనుల కుపదేశించినత్యాగరాజస్వాములవారు వాక్రొన్నవిధంబున సీతానాయకునిచరితామృతంబు శాశ్వతసుఖప్రదంబు.

"రాఘవే ।
శ్వరుచారిత్రము సెంత సెన్నిగతుల నవ్వర్ణించినం గ్రాలదే!"

యని యొకవిద్వత్కవి పలికినట్లు తచ్చరితం బెన్నితెఱంగుల రచింపఁబడినను గవులకు మనంబు తనివారకున్నది. అట్లె చదువువారలకును జర్వితచర్వణంబని తోఁచకున్నది. ఇదియె రామనామమహిమ.

ప్రకృతము మేము ముద్రింపించి ప్రకటించిన యీ రామోదయముయొక్క కృతికర్తంగూర్చి గ్రంథమునం గలకుంశములె తప్ప వేఱేమియు నెంతప్రయాసపడినను మాకుఁ దెలియరామికి శోచించెదము. అతఁడు చిన్నయ్యసూరిగారికాలమువాఁడనియు నతనిశిష్యగణమునం జేరినవాఁడై యుండఁదగు ననియుఁ గొందఱు పలికెదరు. ఇవి యూహలే గాని వేఱొండు గావు.

# ఉపోద్ఘాతము.

ఇక్కవి శైలి మనోహర మగుటచేతను, కథాసరణి హృద్యమగునట్లు గ్రంథము రచింపఁబడి యుండుటచేతను, ఈ రామాభ్యుదయమును మేము ప్రచురించితిమి. ఇందలి శైలి సులభము. బాలురకును స్త్రీలకును సైతము గ్రాహ్యము.

గీ. "సంగ్రహము గాక మిగులవిస్తరము గాక
 పుశమిఁ బండితపామరబోధకముగఁ
 బద్యఫణితిని శ్రీరామభద్రుకథన
 మెఱుఁగఁ బల్కుము మా పేర నింపుమీఱ."

అని యుత్తరరంగనాథుఁ డాజ్ఞాపించినట్లును దానాయానతిఁ గైకొని యీ గ్రంథము రచింపఁబూనినట్లును కవి వ్రాసికొనియున్నాఁడు.

మిక్కిలి వ్యయప్రయాసల కోర్చి మేమీగ్రంథమును బ్రచురింపఁబూనితిమి గానఁ జదువరులు మాయం దనుగ్రహించి సర్వవిధముల మా ప్రయత్నమును కొనసాగించి యింకయు నిట్టిగ్రంథముల ననేకములఁ బ్రకటింప మమ్ముఁ బ్రోత్సాహపఱతురు గాక! రెండవభాగ మచ్చులో నున్నది. శీఘ్రము ప్రచురింపఁబడును.

ఇట్లు:
విద్వజ్జనవిధేయేష్టులు,
V. కుప్పయ్యసెట్టి & Son,
*Stationers, &c., Bhadria Street, Madras.*

శ్రీ

# రామోదయము.

## విషయసూచిక.

### బాలకాండము—1-117.

## అయోధ్యాకాండము—118-192.



## అరణ్యకాండము—193-264.

## కిష్కింధాకాండము—265-315.

పుట.

## సుందరకాండము—316-366.







ఉ. "రావణుఁ డీజగంబులఁ బరాక్రమలీలల సంచరించుచు
న్దేవపురంబులం గలఁచి ధీరత నేఁచుట కోర్వలేమిచే
నీవగ నిర్జరాళి జగదీశ్వర నిన్శరణంబుజొచ్చి యెం
తే వినిపింపసాఁగె నరుదెంచి కృపం బొడగాంచి ప్రోవవే.
క. దీనజనోద్ధరణమునుం, దానవసంహరణమును సదా మునివర స
న్మానము నీపనిగా, దే నలినదళాక్ష, జలనిధిసుతాధ్యక్షా."
వ. అని యేకాగ్రచిత్తులై పలుదెఱంగుల వినుతించు నలినగర్భు నుద్దేశించి
యవ్వాసుదేవుండు మేఘగంభీరారావంబున నిట్లనియె.
క. "వనజాతాప్తాన్వయ పా, వనుఁ డగుదశరథనృపాలవర్యునకును నేఁ
దనయుఁడనై కుతలంబున, జనియింతున్ రావణుని వెస న్హరియింతున్."

రామోదయము పుట 30.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

శ్రీ

# రా మో ద య ము

## బా ల కాం డ ము.

---

శా. శ్రీవామామణిపాదసేవనమున న్నేమస్ఫుటారత్నసం
ఘావిర్భూతనిజాకృతుల్గనివరానంతావతారాత్తకాం
తావారంబొకొయంచు నెంచఁగఁదదేతద్రూపముల్నీ వెభా
మావేశేయని తెల్పు రంగపతి ప్రేమన్నమ్ము రక్షించుతన్. ౧.

చ. జలనిధినుద్భవించి బహుసంపదలన్ దగవిల్లి మీఁగు నే
నిలకును నీళకున్నమత నెట్లు చరింపుదునంచు నెంచి తా
జలజమునందునుండి వ్రతచర్యలొనర్చి మురారి పేరుర
స్థ్సలి వెలుఁగొందు భార్గవి ముదంబున మాకు శుభంబులిచ్చుతన్. ౨.

గీ. పగలు సోలించు భాస్కరు పగలు దెలువ
రాజు గానెంచి మోముఁ జేరంగవచ్చు
నల్లగలువలొయనను ల్లసిల్లు కనులఁ
జూచి మమ్మిందిరాదేవి బ్రోచుఁగాత. ౩.

చ. హరికివిలొక నంబయి సహస్రకరుండనమించి వైరి చే
నుకుతర దంతభంగమునకొర్చెన హార్పతి భీతిశేముపిం
గరము కుదార నేనహిత కాండములంగని సైఁపనంచు శ్రీ
ధరు కరమందు నిల్చిన సుదర్శనరాజము మమ్ముఁ బ్రోవుతన్. ౪.

ఉ. బాలున కైరమాధవుఁడు పంచజనున్ వధియించి నన్నుఁ దా
లీలను గైకొనె న్నను నిలింపసమూహములార దైత్యాలం

దో లెదమీఁదలుల్లములఁదూలకుఁడంచువచించుమాఁడ్కి నా
భీలరవంబొనర్చునరిభీమముశంఖమునాశ్రయించెదన్. ౫.

చ. అనవరతంబుసర్వభువనావళిమోసెడుతన్నుఁగూర్మిమై
తనదగుమూఁపునందిడినతామరసాక్షుబుణంబుఁదీర్పఁగా
మనమునఁగోరితల్పముగమక్కువచేవిలసిల్లునట్టియ
త్యనఘునసంతసద్గుణగణాఢ్యుననంతుభజింతునామదిన్. ౬.

ఉ. పంతమునంబనుల్గొనెడుపన్నగసంఘముపైనిరోషమం
తంతకుఁబెంచినాలుకలనయ్యెడవ్రయ్యలొనర్చిపుచ్చి శ్రీ
కాంతునిఁజేరికేతనముగాఁదగిసద్యశమందునాగరు
త్మంతుఁదలంతునమ్మహితుమన్ననఁగాంతునిరంతరంబొగిన్. ౭.

మ. కరివక్త్రాద్యతిఘోరపారిషదులేకాలంబుఁదన్గొల్వఁగా
వరబాహాబలశౌర్యజృంభణములన్వైకుంఠసైన్యేశుఁడై
యనులందోఁచుతఁజేరమాధవుఁడొకోయంచున్సురారుల్వడి
న్బరువుల్వాఱఁగఁజేయునట్టిఘనువిష్వక్సేనుఁబ్రార్థించెదన్. ౮.

చ. నలుమొగముల్వెలుంగభువనంబులఁగాంచుటయెంతవింతనా
యలరెడువీణయేకముఖమైపలుగానమయప్రపంచముం
గలుగఁగఁజేయుటేయరుదుగాదెయటంచనువాణిఁజూచిన
వ్వొలయఁగఁగాఁగిలించువిధియొప్పఁగమాకొసఁగుంజిరాయువుల్. ౯.

గీ. తమ్మిగద్దియఁగొలువుండుకొమ్మవాణి
భవ్యవీణానినాదప్రపంచచారి
సరసనంగీతసాహిత్యచతురనలువ
వెలఁదిమాయింటనెప్పుడువెలయుఁగాత. ౧౦.

సీ. వనరాశిఁబిల్లకాల్వనుగాఁగనెవ్వాఁడు
నూటిగానీటుగాదాఁటిచనియె

జానకీశోకంబుమాన్చె నెవ్వాఁడు
సద్రామభద్రోర్మిముద్రనొసఁగి
రక్షోగణంబులశిక్షించె నెవ్వాఁడు
ధీరుఁడై శూరుఁడై చేరఁబిలిచి
లీలచే నోషధి శైలంబు నెవ్వాఁడు
వింతకైబంతిగా సంతరించె
భరతహృత్తాప మెవ్వాఁడు పరిహరించెఁ
జిరతరాయుష్య మెవ్వాఁడు చెందిమనియె
నట్టిధీమంతునతిశాంతునరికృతాంతు
నమితబలవంతు హనుమంతు నభినుతింతు. ౧౧.

చ. ఘనదురితాంధకారపరిఘట్టనభాస్కరదీప్యమానమై
తనరఁగ ద్రావిడాగమముఁ దాఘటియించితదాగమంబు స
జ్జనులుపఠించునంతట నెసద్గతిఁ జెందఁగఁ జేసి వెల్గున
య్యనఘునిదుష్కృతాటవికుఠారిశఠారి నెదందలంచెదన్. ౧౨.

సీ. ధరఁ బ్రతివాదిమత్తగజకుంభంబుల
నిజసూక్తులను గోళ్ల నిల్పి చీల్చి
యుభయవేదాంతమహోద్ధతనాదంబు
లమితగర్జితములై యమరఁ జేసి
పొంకంబుగా నిష్కళంకభావంబున
మొనసి సాత్త్వికమార్గమునఁ జరించి
నిర్భరత్వము మదినిండియుండిన తెఱఁ
గున విశిష్టాద్వైతగుహను వెలసి
కలుషసంఘంబులనెడుమృగములనడఁచి
సాటిలేని ప్రభావిశేషమ్ము వహించి

నట్టి శ్రీభాష్యకారసింహామునుగోరి
జన్మసాఫల్యమును జెందసంస్మరింతు. ౧౩.

క. కందాళదొడ్డయార్యుల
సుందరపదపంకజములసుస్థిరభక్తిన్
డెందమున నిల్పిపరమా
నందంబునఁగొల్తునను దినంబేమఱకన్. ౧౪.

సీ. వరకవితాఫణివల్మీకు వాల్మీకుఁ
గ్రమకళావాసుఁ గాళిదాసు
బహుళశాస్త్రార్థసంభవభూతిభవభూతి
ముదితసన్మానసాంభోజు భోజుఁ
గవితాప్రపంచరక్షణము రారిమురారి
నవ్యాంధ్రఘటనార్యు నన్నపార్యు
ఘనవచఃకుండలీంద్రునిఁ గుండలీంద్రుని
శమదమాధికభాసుశంభుదాసు
మహితగుణసాంద్రుఁ బెద్దనామాత్యచంద్రుఁ
బ్రకటచాతుర్యుఁ బాండురంగకవివర్యు
స్వాంతమున నిల్పి భక్తిలతాంతములను
సంతతముఁ బూజ గావింతు సంతసమున. ౧౫.

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబు నాచార్యవందనంబును సత్కవీంద్ర సన్నుతియునుం గావించి యొద్ది యేనియు నొక్క పురాణపుణ్యకథం బ్రబంధంబుగ రచింపం గుతూహలాయత్తచిత్తుండనై యున్న యవసరంబున నస్మదీయస్వప్నంబునం దొక్కనాఁడు. ౧౬.

తే. ధరణిపై క్షీరవాహినీదక్షిణమున
నొప్పుబీజాచలమ్మునకుత్తరమున

గురుతరంబగుశ్రీపల్లికొండయనఁగ
వెలయునగరంబుఁగంటివిప్రోటియందు. ౧౭.

మ. వరజాంబూనదరత్నసంఘటితమైవర్తిల్లుప్రాకారగో
పురవారంబునుచిత్రమండపశతంబుల్ఘంటికారావవి
స్ఫురితంబౌగరుడధ్వజంబునుమహాపుణ్యాంబుభృత్పంకజా
కరముంగల్గినదేవగేహమొకఁడున్నప్పట్టినత్యున్నతిన్. ౧౮.

వ. అది మఱియు నభం బంటి ఘోషించునుభయవేదాంతనాదంబును, నిత్యసూరిజనోపమాను లగుపరమభాగవతజనశతంబులును, జయవిజయవిష్వక్సేనాము లగునగణ్యపారిషదులును, నిరంతరసరససంగీతమంగళవాద్యారావంబులును, జితంతేపుండరీకాక్షా యని మృదుమధురరసధార లొలుకఁ బలుకుశుకశారికానికరంబులును, వాసుదేవాత్పరంనాస్తి యని పేరెలుంగున న్సంభాషించుచుఁ బక్షంబులు విచ్చి నటనం బొనర్చుమయూరవారంబులుం గలిగి మర్త్యలోకవైకుంఠం బనం బరఁగి వేదశృంగంబును బ్రణవాకారంబు నగుతప్తకాంచనదివ్యవిమానంబు దోఁచె నవ్విమానాంతరంబునందు. ౧౯.

సీ. అంబుజాహితసహస్రంబులోయనవేయు
ఫణములభోగితల్పముగమెఱయ
శ్రుతిచతుష్కంబునుద్ధతిఁబల్కుచునువిధి
నాభీసరోజంబునన్వెలుంగఁ
బరమయోగీంద్రహృద్భవశోభితపాద
పద్మంబులబ్ధిజపట్టుచుండ
భక్తజనాభయప్రదమగుమృదుబాహు
హస్తంబులవతలయంపిగాఁగ

మకుటకుండలహారాదిమణివిభూష
 ణాళిదిశలెల్ల సత్కాంతులందఁ జేయ
మంగళకరాంగుఁ డుత్తరరంగధాముఁ
 డంచితంబుగఁ దాఁ బవ్వళించియుండె. ౨౦.

క. ఏనమ్మహానుభావుని
 దానవగర్వాపహుని త్రిదశవందితు నిం
గానంజనిభయ భక్తిం
 బూని నమస్కృతులొనర్చి పొగడఁగ నపుడున్. ౨౧.

క. అమ్మాధవుండు ప్రేమర
 సమ్మొలుకఁగ నన్నుఁ గాంచి సంభ్రమ మొప్పన్
రమ్మని పమ్మిన దయాదర
 ణమ్మున మృదుమధురభాషణమ్ముల ననియెన్. ౨౨.

గీ. జగతి వైష్ణవకులవార్ధిచంద్రుఁ డగుచు
 రమణ జనియించి యస్మద్వరమునఁ జేసి
సరసకవితావిరచనలసలిపెదార
 క్రమమున నురంగయాఖ్య సుకవివరేణ్య. ౨౩.

సీ. పటుభక్తి మాపేరఁ బ్రహ్లాదచరితంబు
 ఘటియించితివి యక్షగానముగను
బద్యంబులై యొప్పఁ బన్నితౌ శృంగార
 సారసంగ్రహము నస్మత్పరముగఁ
బొందించితివి వేడ్కఁ గందవృత్తంబుల
 శతకమ్ము మత్పదాంకితముగాఁగఁ
బదకీర్తనంబులుఁ బరఁగ మాకర్పించి
 స్తుతిఁ గాంచినాఁడ వీక్షితితలమున

సంతతముమదీయచింతనారతుఁడవై
    మెలఁగుచుండునిన్ను మెచ్చవచ్చు
నింకనొక్కకోర్కియింపొందఁగల్గెడు
    నదియునిర్వహింపుమనఘయిపుడు. ౨౪.

గీ. ధరనరాంకితమగు రామచరితచయము
    గలవుపారాయణోపయోగములుగాక
యఖిలజనముల కాహ్లాదమమరనీవు
    తచ్చరిత్రంబుఘటియింపఁదగునుమఱియు. ౨౫.

గీ. సంగ్రహముగాక మిగులవిస్తరముగాక
    పుష్టమిఁబండితపామరబోధకముగఁ
బద్యఫణితినిశ్రీరామభద్రుకథన
    మెఱుఁగఁబల్కుముమాపేరనింపుమీఱ. ౨౬.

వ. అని యప్పురాణపురుషుండును, శేషశయనుండు నైనయుత్తరరంగ నాథుం డానతిచ్చుటయు నానందబాష్పపరిపూరితలోచనుండ నై సంతసం బంది, యంతట న్మేల్కాంచి యద్దేవదేవునిదివ్యచారిత్రం బగు శ్రీమద్రామాయణంబు రామోదయం బనుపేర ఘటియించి జన్మసాఫల్యంబు నొందెద నని మనంబున నుప్పొంగి మదీయవంశావతారం బభివర్ణింపఁ దొడంగితి నెట్లనిన. ౨౭.

సీ. ఏమహాత్మునిగర్భమిల్లుగాఁగైకొని
    బ్రహ్మాండకోటులుబలిసియుండు
నేపరంధామునాభీపద్మమునఁబుట్టి
    విధిసృష్టికర్తయైవెలయునెప్పు
డేదయాపరునిశ్రీపాదజయగుగంగ
    సమరఁగపర్దిశీర్షమునవిలిచె

నేధీరకనుఁగవలినచంద్రులననొప్పి
    దినములుగడపుచుఁ దేజరిల్లు
నెవ్వఁడీవిశ్వమెల్లఁదానేపుమీఱఁ
    గరుణఁగలిగించురక్షించుఁగడకుద్రుంచు
నెవ్వఁడచ్యుతుఁడవ్యయుండెన్న నాతఁ
    డాదివిష్ణుండునారాయణాహ్వయుండు. ౨౮.
గీ. అమ్మహావిష్ణుదేవనిజాంశమునను
    వైష్ణవాన్వయమనఁగల్గివన్నెకెక్కె-
నందుబహుజన్మకృతపుణ్యమలవరించి
    వైష్ణవులనంగఁబొడమిరివసుధలోన. ౨౯.
సీ. దేవతాంతరములఁదెగువమైనిరసించి
    మంత్రాంతరంబులమమతరోసి
యష్టాక్షరీమంత్రమమరననుష్ఠించి
    తత్త్వత్రయాదులుదప్పకరసి
వైరాగ్యవిభవంబువరుసతోడఘటించి
    నిర్భరత్వంబునునిగుడఁజేసి
ద్రవిడాగమంబుసంతతమునుబఠియించి
    భగవదర్చనములభక్తిమెఱసి
హరికిభుజయుగ్మమొనఁగితదరిదరములఁ
    దాముఁగైకొనిసద్గుణధాములగుచు
విష్ణుసంబంధులనసదావినుతికెక్కి-
    వైష్ణవోత్తములుందురువదలకెందు. ౩౦.
గీ. అట్టివైష్ణవవంశదుగ్ధార్ణవమున
    నంబిఖారాతిగతినుద్భవంబునొందె

నమలయశుఁడుకుమారరామానుజార్యుఁ
డఖిలజననుతుఁడగుచు నెయ్యంబు దనర.

సీ. సర్వశాస్త్రవిచారసంపన్నుఁడనుచు సం
తసమునఁ బండితోత్తములు పొగడ
మానితగానవిద్యానిధి యని మెచ్చి
గాయకశ్రేణులు గణన సేయ
ద్రవిడవేదానుసంధానపరుండని
పరమభాగవతులు ప్రస్తుతింప
నిఖిలరహస్యార్థనిపుణుఁ డీతండని
కోరి ప్రపన్నాళి కుతుకమంద
బాంధవజ్ఞాతివర్గసంభావ్యతఁ గని
శాంతశమదమముఖ్యసుస్వాంతుఁ డగుచు
నలరుచుండు కుమార రామానుజార్య
ఘనత మది నెంచికొనియాడఁ గాఁదరంబె. 3౨.

చ. అతనితనూభవుండు సుగుణాంబుధి వేంకటకృష్ణయాహ్వయుం
డతులితశాస్త్రసంపదల నన్నిటమించి మహాభిమగ్వగుం
డితఁడను కీర్తినొందుటయు నేర్పడఁగన్గని యశ్వినీసుతు
ల్గితిఁ దమ రాకమానిబలు సిగ్గున వేఁజని రభ్రసీమకున్. 33.

గీ. ఆభిమగ్వర్యునిజసూనుఁ డమితయశుఁడు
భూరితరగానవిద్యావిశారదుండు
నల్లరామానుజాభిఖ్యుఁ డుల్లమలరఁ
దనరు మానవలోకగంధర్వుఁ డనఁగ. 3౪.

క. అలగాననిధికిసుతుఁడై
వలనొప్పఁగ నుద్భవిల్లి వైశికుఁడగుచుం

ఎపల్లి దేశిక
చెలువముఁబొగడంగఁదరమె శేషునకైనన్. 3౫.

క. ఆసరసశిఖామణికి
న్భాసురముగసుతుఁడుగ లైబలిసూదనస
ద్దాసుఁడు ద్రావిడనిగమా
భ్యాసుఁడు రామానుజుఁడనభవ్యాహ్వయుఁడై. 3౬.

సీ. భావనిర్మలినతఁ బరికింపమహితులౌ
సనకాదులకుసాటియనఁగవచ్చు
వైరాగ్యగరిమంబు వర్ణించిచూచినఁ
బ్రహ్లాదునకుసరిపన్నవచ్చు
సత్యవాక్యప్రౌఢిచర్చసేయఁగహరి
శ్చంద్రునకెనచేసిచాటవచ్చు
నతిశాంతగుణములనరసివిమర్శింప
శేషునకీడుగాఁజెప్పవచ్చు
ననుచుసుజనులుగొనియాడననుదినంబు
హరిచరణసంస్మరణముననతిశయిల్లి
పరమభాగవతోత్తమప్రభృతితోడ
నమరియుండునురామానుజాహ్వయుండు. 3౭.

క. ఆమహనీయునికులసతి
యామహితచరిత్రనారణాంబకుసుతులై
యేముజననమందితిమిధ
రామండలిశ్రీనివాసరంగాఖ్యులన్. 3౮.

## బాలకాండము

### షష్ఠ్యంతములు.

క. అంభోరుహాక్షునకుమద
కుంభీంద్రసురక్షణునకుఁగుటిలరిపువధా
రంభునకుశ్రీహృదంబుజ
బంభరునకుభక్తలోకపరిపాలునకున్. ౩౯.

క. చక్రధరునకునిశాచర
చక్రవిదారునకునీలజలదాంగునకు
న్శక్రాదిసురనుతునకుఁద్రి
విక్రమరూపునకుభువనవిఖ్యాతునకున్. ౪౦.

క. ఫణిరాజశయనునకుదిన
మణిశతకోటిప్రకాశమానునకుమహా
రణరంగవిజయునకుముని
గణసేవితచరణునకునిగమవేద్యునకున్. ౪౧.

క. భవపంకజభవముఖసం
భవకారణభూతునకుఁబ్రభావయుతునకు
న్భవభయహారునకుగంగో
ద్భవపాదునకఖిలవిశ్వభారభరునకున్. ౪౨.

క. మృగమదతిలకనిటలునకు
ఖగరాడ్గమనునకుఁదప్తకాంచనరత్న
స్థగితఘనభూషణునకు
న్నగధరునకుఁబల్లికొండనగరీశునకున్. ౪౩.

వ. సమర్పణంబుగా నా యొనర్పం బూనినశ్రీమద్రామోదయం బను
మహాపురాణంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. ౪౪.

## కథాప్రారంభము.

క. అతులతపస్స్వాధ్యాయని
రతుఁడగునారదమునిఁ గాంచి రయమున నోకనాఁ
డతిధీరత వాల్మీకివి
హితభావము దోఁపఁ బలికె నిట్లనుచుఁ దగన్. ౭౫.

సీ. అఖలప్రపంచసృష్ట్యాత్మకుం డెవ్వాఁడు
ప్రకటధైర్యస్థైర్యభావుఁ డెవ్వఁ
డాదిదేవుండన నభవంద్యుఁ డెవ్వాఁడు
వేదగోచరుఁడునై వెలయు నెవ్వఁ
డార్తరక్షణకృపాయత చిత్తుఁ డెవ్వాఁడు
మూర్తిత్రయంబున ముఖ్యుఁ డెవ్వఁ
డమితతేజోనిధియై యొప్పు నెవ్వాఁడు
సద్గుణాలంకారచతురుఁ డెవ్వ
డట్టిమహనీయుఁ డిలఁ బుట్టి యరిగెనొక్కొ
పుట్టియున్నాఁడొ యిఁకను దాఁ బుట్టఁగలఁడొ
రమణ మీఱ మదీయాంతరంగ మలరఁ
దత్క్రమం బెఱిఁగింపు మో తాపసేంద్ర. ౭౬.

వ. అనిన నారదుండు వాల్మీకిమహర్షిం గని యిట్లనియె. ౭౭.

మ. ఇనవంశాబ్ధిసుధాంశుఁ డా దశరథోర్వీశేద్యసన్మౌళికిం
దనయుండై జనియించి రాముఁడనఁగా దామోదరుండగ్గిదై
త్యనికాయంబులతోడ రావణునినంతంబొందఁగాఁ జేయుఁబో
మ్మని తానబ్జజు వీటికిం జనియె నత్యానందముప్పొంగఁగాన్. ౭౮.

వ. ఇట్లు కలహాశనుం డరిగిన యనంతరంబ ప్రాచేతసుండు దమసాన
దికి శిష్యసహితంబుగా నరిగి యనుష్ఠానం బొనర్చుచుండ నయ్యెటి

దరియందుఁ గ్రౌంచపక్షిమిథునంబు గ్రీడింప నం దొక్కటి నొక్క
కిరాతుండు ద్రుంచుటం జేసి, మఱియొక్క క్రౌంచంబు విలపించు
టయుం గాంచి, పరమదయాళుం డగువాల్మీకి యక్కిరాతుం గని
కోపావేశంబున ని ట్లనియె. ౪౯.

క. ఓరినిషాదుఁడ క్రౌంచము
లీరీతింగ్రీడసల్పుటెఱిఁగియునొకటిన్
గోరికఁదునుమందగునే
చేరదెయిప్పాపచయముచెదరకనిన్నున్ ౫౦.

గీ. పక్షినడచినట్టిపాపంబుచేనీవు
ఘోరనరకమునను గూలుమనుచు
శాపమొసఁగెనంతశాపాక్షరంబులు
పద్యముగనుదోఁచెభావమలర. ౫౧.

క. అదిగనియాశ్చర్యంబున
మదినుబ్బిమునీంద్రుఁడాశ్రమముసేరశుభ
ప్రదుఁడగుపంకజభవుఁడిం
పొదవఁగఁబొడసూపెనచటనుగుతరకాంతిన్. ౫౨.

గీ. అమ్మహానుభావునర్చించివాల్మీకి
శాపవిషయవాక్యజనితపద్య
మొప్పఁజనువవినియునప్పద్మసంభవుఁ
డాదరమునఁబల్కెనతనితోడ. ౫౩.

గీ. వినుముమౌనివర్యవివరింతుననఘుఁడా
నీదుజిహ్వయందునిలిచెవాణి
కాననీవుపల్కుఘనవాక్యవర్ణము
ల్పద్యరచనగాఁగఁబరిఢవిల్లె. ౫౪.

గీ. నారదుండుమున్ను నయరీతినీతోడ
సంగ్రహముగఁ దెల్పిచనినరామ
చరితమిప్పుడీవుసాంగంబొనర్పుము
కలతెఱంగుమదికిఁ దెలియునీకు. ౫౫.

క. అనియానతిచ్చివిధిచాఁ
జనుఁడున్వాల్మీకియదియసంకల్పమునం
గొనివాగ్దేవికృపందోఁ
చినటులరామాయణంబుఁ జెప్పఁదొడంగెన్. ౫౬.

వ. అదియు నయోధ్యాపురవర్ణనంబును దశరథోత్కర్షమును బుత్ర
కామేష్ట్యాచరణంబును రామలక్ష్మణభరతశత్రుఘ్నులజననంబును
విశ్వామిత్రసమాగమంబును దాటకవధయును యజ్ఞసంరక్షణంబు
నహల్యాశాపమోక్షణంబును మిథిలానగరప్రవేశంబును హరధను
ర్భంగంబును సీతావివాహంబును భృగురామబలాపహరణంబు నభి
షేకవిఘ్నంబు నరణ్యయాత్రయును దశరథుమరణంబును భరతు
నకు రాఘవుండు పాదుక లొసంగుటయును దండకారణ్యసంచరణం
బును గుంభసంభవదర్శనంబును ధనురాదిదివ్యాయుధలాభంబును
బంచవటీతీరనివాసంబును శూర్పణఖాకర్ణనాసికావిచ్ఛేదనంబును ఖర
దూషణాదిదనుజమర్దనంబును మారీచవిదారణంబును సీతాపహర
ణంబును జటాయుర్మరణంబును శబరీసంపూజనంబును సుగ్రీవసుస్నే
హంబును వాలిసంహారంబును సీతాన్వేషణంబును సేతుబంధనం
బును రావణకుంభకర్ణేంద్రజిత్ప్రభృతి సకలరాక్షస నిరవశేషంబును
విభీషణాభిషేకంబును బుష్పకారూఢంబు నయోధ్యాపురప్రవేశం
బును రామసామ్రాజ్యాభిషేకంబు ననుకథల నొప్పి యిరువదినాల్గు
వేల శ్లోకంబు లేనూఱు సర్గలు నాఱుకాండంబులుగా రచియించి

యనంతరం బశ్వమేధప్రముఖ మహాయాగంబు లొనర్చి యేకాదశ సహస్రవర్షంబులు సకలమహీభారధౌరేయుం డగుచు దుష్టనిగ్రహ శిష్టపరిపాలనంబుల మించి భూభారంబు నివారించి రాఘవుండు నిజనివాసంబగు వైకుంఠధామంబున కరుగుట యాదిగాఁగల కథల నుత్తరకాండంబుగా ఘటియించి వాల్మీకి గృతార్థుం డయ్యె. అమ్మహా పురాణంబు ద్రిభువనంబులఁ బ్రసిద్ధినొందె. తత్కథావిధానం బాంధ్ర రూపంబున సాంగంబుగా నెఱింగించెద. ౫౭.

అయోధ్యాపురవర్ణనము.

క. శ్రీకరమైనిర్మలినవి
భాకరకులజాతభూపపరిపాలితమై
భూకాంతకుఁదొడవైయన
సాకేతపురంబువెలయుసరయుపాంతన్. ౫౮.

వ. అందు. ౫౯.

సీ. కనకమణిప్రభాకలితవప్రంబులుఁ
బటువిద్రుమద్వారబంధములును
నంబరచుంబితంబగుగోపురంబులు
మహనీయతరచిత్రమండపములు
హాటకమయరమ్యహర్మ్యతలంబులు
నందమౌకేళికామందిరములుఁ
బసమించిమెఱుఁగారుభర్మసోపానము
ల్భాసిల్లుప్రాసాదభవనములును
వజ్రవైడూర్యఖచితకవాటములును
దోరమైనట్టిమౌక్తికతోరణములుఁ

గలిగిసిరులొందినుతులందిఘనతకెక్కి
ధరణినొప్పారెనయ్యయోధ్యాపురంబు. ౬౦.

క. అన్నగరికొత్తళంబులు
గన్నెదురుగఁదోఁపనమరకన్యలుగుములై
చెన్నలరనాటలాడుచు
నెన్నఁడువిహరింతురచటనింపుదలిర్పన్. ౬౧.

క. అనిశక్రన్మనినాకం
బునకున్బ్రత్యర్థిజనులఁబొమ్మనుభంగిన్
ఘనవాతూలచలితమై
కనుపట్టుధ్వజములన్నగరమధ్యమునన్. ౬౨.

చ. నిగమచతుష్టయంబెపుడునీరజగర్భునినాల్గుమోముల
న్నగడునుదచ్ఛ్రితుల్వరుసనిత్యమునొక్కటఁబల్కుచుందురీ
యగణితవైభవుల్సరసిజాసనుకంటెమహాత్ములంచుని
జ్జగతిజనుల్నుతింపఁగయశంబునుగాంతురువిప్రులప్పురిన్. ౬౩.

క. సురపతివైభవమునుఖే
చరపతితేజమునుమృగవిసరపతిశౌర్య
స్ఫురణముమరుసుందరతను
బరిహాసమొనర్తురచటిపార్థివముఖ్యుల్. ౬౪.

క. తనకునవనిధులుగలుగఁగ
ధనపతియనుపేరుఁగొనియెధనదుండహహా
యనియతనినగుదురూరుజు
లనిశముఁదామధికనిధులకధిపతులగుటన్. ౬౫.

క. గిరులురుధైర్యమునమృగే
శ్వరులుపరాక్రమమునంబ్రశాంతగుణముచే

సురగేంద్రులరిహారణమున
    సురసేనాధీశులచటిశూద్రజనంబుల్. ౬౬.
సీ. ఈచెలులమొగంబులిలఁగాంచికదసిగ్గు
    చేశీతకరుఁడభ్రసీమఁజేరె
నీయొఁగనలకన్నుదోయికోడియెకదా
    పాఱిమృగంబులుపూరిఁగఱచె
నీచేడెలనడలకీడుగాకయెకదా
    దిగ్గజేంద్రములధోదిశనుజెందె
నీరామలమృదూక్తికెనరామినేకదా
    చిలుకలువెఱచిదిక్కులకుఁబఱచె
నౌరయీముద్దుగుమ్మలయంద మొందఁ
    గలుగదనుచునురసికులుగణనసేయ
విటులవలపించిసొలపించివెలసిబలసి
    వెలవెలందుకలుందురవీఁటియందు. ౬౭.
క. ఆపురిగజశాబకముల
    మూఁపులపైనెక్కినిక్కిమొనసివియద్గం
గాపగనంబుజములుగొన
    దాఁపగుచోఁగరులపొడవుఁదలపందరమే. ౬౮.
క. సురపురినిశుభ్రఘోటక
    మరుదుగనొక్కటియెవెలయునవనినయోధ్యా
పురవరమునఁబాండురమగు
    వరహయములువేనవేలువఱలుచునుండున్. ౬౯.
ఉ. సాలలవంగలుంగఘనసారకపిత్థరసాలకేతకీ
తాలతమాలచందనకదంబకురంటకకోవిదారహిం

తాలమతల్లికాక్రముకదాడిమచంపకముఖ్యభూజము
ల్చాలవెలుంగునప్పురివిశాలవనంబుల నెల్ల కాలమున్. ౨౦.

క. కమలములకాలయము లై
క్రమమునరాయంచగములబ్రతుకు తెఱఁగు లై
భ్రమరములకందలము లై
యమరుంబద్మాకరంబులప్పురి చెంతన్. ౨౧.

వ. అది మఱియును నిరంతరస్వరంతరరఘురీజృంభద్ధ్వజపటపరంపరోద్భూతవాతజాతధూత దైతేయారాతివిమానంబును ధర్మమయనిర్మలనర్మహర్మ్యతలనటన్నటీజనానూనగానామృతపానమత్తవైమానికవితానంబును, సతతగతాగతశతాంగమాతంగతురంగపదాతిజనాతినాదవదావదకులధరాధరంబులును నిందితసంక్రందననందనవనచందననగబృందప్రమదవనతుందిలంబును నశ్రాంతశ్రుతిశ్రావ్యమంగళవాద్యాశ్రయంబు నగుచు రాజశేఖరపరిపాలితం బై కైలాసనగంబునుం బోలి, శ్రీధామశోభితం బై వైకుంఠపట్టణంబు భాతి, శతానందాస్పదం బై సత్యలోకంబుచాడ్పునఁ, బ్రశస్తాప్సరశ్శతకోటి గురువిబుధరాజం బై నగరిపునగరంబుభంగి, మహాపద్మపద్మశంఖమకరకచ్ఛపాదియుతం బై యలకాపుటభేదనంబు తెఱంగున వెలుంగు మహాపరిఘయుం గలిగి కోసలదేశంబునకు నాయకరత్నంబువడువున, మార్తాండవంశసంభూతసర్వభూనాయకపరంపరాభివృద్ధిప్రదాయకం బై ద్వాదశయోజనాయతంబును బంచయోజనవిస్తృతంబును నై యొప్పు నయ్యయోధ్యాపురవరంబునందు. ౨౨.

నాయకోత్కర్ష.

సీ. తనకీర్తిపాండిమంబున సప్తపాథోధు
లేకరూపంబు లై యెసక మెసఁగఁ

దనప్రతాపానలంబున వైరిభూవరా
  రణ్యసంఘము భస్మరాశి గాఁగఁ
దనకృపామృతవృష్టిధారాళి సకలార్థి
  హితసస్యసమితి వర్ధితము గాఁగఁ
దనభుజాబలఘాతమునకు నిల్వఁగ లేక
  దనుజవర్గము పలాయనము గాఁగఁ
దనసుభోగవిలాససంతతులఁ గాంచి
  శక్రముఖదిగధీశు లాశ్చర్యమంద
వనధివలయితవసుధపాలన మొనర్చు
  చుండు దశరథ మేదినీమండలుండు. ౨౩.

ఉ. వారిజబాంధవాన్వయుఁడ వారితశౌర్యవిజృంభణుండ జ
క్ష్మారమణాత్మజుండు వరశారదనీరదనారదాబ్జమం
దారసురాపగాహసదుదారయశోవిభవాధికుండు మ
త్తారివిదారి యా దశరథాధిపుఁ డెన్నఁగ రాజమాత్రుఁడే. ౨౪.

సీ. మునులమహాధ్వరములను మెప్పించి భూ
  శతమన్యుఁ డనఁగ సన్నుతుల మించె
జనులకానందంబు సంఘటిల్లఁగఁ జేసి
  రాజచంద్రఖ్యాతి రహిని గాంచె
మత్తారివర్గంబుఁ దుత్తుమురొనరించి
  పురుషసింహాభిఖ్యఁ బుడమి నించె
దానాంబువుల సముద్రములను నిండించి
  ఘనుఁడని యెడి సమాఖ్యను వహించె.
నారయ విబుధజను లెన్న నన్యరాజ
  మకుటతటఘటితస్వచ్ఛమణిగణప్ర

భాంచితాంఘ్రిద్వయుండయియవనినేలె
సాధుతరకీర్తిదశరథచక్రవర్తి. ౨౧.

వ. అమ్మహాసార్వభౌముం డగణ్యవిద్రుమస్తంభసంభృతం బగు మణిమండపాభ్యంతరంబున ఘటనాఘటనకార్యనిర్వాహచమత్కారధీమంతు లగుసుమంత్రజయంతసిద్ధార్థార్థసాధకనీతితీర్థాశోకదృష్టివిజయాదిసచివాష్టకవర్గంబును, సత్యవచనకమలజగద్బంధువు లగుబంధువులును, సగయులగు సుహృదయులును, వేదవేదాంతాభిప్రాయప్రబోధనాధురీణు లగువసిష్ఠవామదేవగౌతమాంగీరసకణ్వభరద్వాజప్రభృతిమహర్షిసంఘంబును, నకళంకజ్యోతిష్కళామహితు లగుపురోహితులును, శబ్దశాస్త్రతర్కకర్కశవాణీమండితు లగుపండితులును, సరసమృదుమధురవచనచణకావ్యగణరచనానిస్తంద్రు లగుకవిచంద్రులును, సకలపురాణేతిహాసకథనపారీణు లగుపౌరాణికులును, గగ్రృజన్యజనితరాగద్వావింశచ్ఛ్రుతిభేదజ్ఞాతృప్రవీణు లగువైణికులును, ఘననయదేశీయస్వరమూర్ఛనగ్రామజాతీయసంధాయకు లగుగాయకులును, జతుర్విధాభినయవినయాగణ్యసాగుణ్యలావణ్యవిజితరంభాదిసురరంభోరుబృంద లగువారసుందరులును, నిస్తులబలపరిహాసితప్రతిభటు లగువీరభటులును, వందిమాగధబృందంబులునుం గొలువ సుధర్మాస్థానమధ్యంబున భద్రాసనాసీనుండయి యున్న పురందరు చందంబున రత్నసింహాసనంబునం బేరోలగం బుండి యొక్కనాఁడు.

క. తనయులలేమిసినెంతయు
దనమదిఁదలపోసిచింతఁదలకొనియపుడ
య్యినకులభవుఁడగుదశరథ
జనపతివలికెన్వసిష్ఠసంయమితోడన్. ౨౨.

సీ. వరమునిచంద్ర యిక్ష్వాకులవంశంబున
జనియించి సకలారిజయముఁ గాంచి
యఱువదివేలయేండ్లవనీభరముఁ బూని
కరముదారనిష్కంటకముగ
నధ్వరంబులొనర్చి యమరులఁ దనియించి
దీనులసంతోషమూనఁ జేసి
శరణాగతులనెల్ల నరసి సంరక్షించి
బంధుమిత్రామాత్యపటలి మనిచి
సంతతంబు దిగంతవిశ్రాంతకీర్తు
లంది మునివర్గములకు నాహ్లాదమెసఁగ
నింతకాలంబు నడిపితి నేకరీతి
ననఘ భవదీయమగు సహాయంబు కతన. ౭౮.

క. ఏమిటఁ గొదువను జెందక
భూమండలమెల్ల నేలి భోగసమృద్ధ
శ్రీమోదంబుల నొందితి
నో మునివర సుతుల కలిమి యొక్కటి దక్కన్. ౭౯.

క. వినవినఁ గర్ణానందం
బొనరింపుచు మధురసంబు లొలుకఁ బలుకు సూ
నుని వచనములకు వీణా
నినదము సరియగునె తలఁపనిక్కం బనఘా. ౮౦.

గీ. పుత్రహీనుఁడైనఁ బుణ్యలోకంబులు
గలుగ నేరదనుచుఁ బలుకు శ్రుతులు
గాన సత్సుతుండు గలమనుజేశుండు
ధన్యుఁడనఁగ నొప్పు ధరణిలోన. ౮౧.

ఉ. ఎంతటిధైర్యసంపదలు నెంతయు వార్యపరాక్రమక్రమం
బెంతటి రాజ్యభోగములు నెంతటిబంధుహితాళిగల్గినం
జింతదొలంగు నేకులముశీలమువంశమువృద్ధినొందు నే
సంతతిలేకయున్న బుధసత్తమ యేమనివిన్నవించెదన్. ౧౨.

క. కావునధరణీభారం
బేవగనైననుభరింపనిఁక నోపఁగ లే
నోవిమలాత్మక వేగమె
భావింపుముసుతునిఁబడయభావములోనన్. ౧3.

వ. అని యిట్లు విన్నవించిన వసిష్ఠుం డాత్మగతంబున నూహించి యమ్మనుజేంద్రున కిట్లనియె. ౧౪.

క. జగతీనాయక నీమది
వగవంగా నేలసకలవసుధాతలముం
దగఁబాలన మొనరింపం
దగుసత్పుత్రులనుబడ సెదవునిక్కముగాన్. ౧౫.

గీ. పుత్రులనుగోరువారలిపుడ మిలోనఁ
బుత్రకామేష్టిఁజేయఁగాఁబొందవచ్చు
ననుచునిగమార్థములుపల్కునట్టియధ్వ
రంబొనర్పుమునీకాంక్షితంబుగలుగు. ౧౬.

వ. అని వసిష్ఠుండు పల్కుచున్నంత సూతుండు దశరథుం గాంచి యిట్లనియె. ౧౭.

ఋశ్యశృంగముని చరిత్రము.

సీ. రాజేంద్రవినుమంగరాష్ట్రాధినాథుఁడా
రోమపాదుండుదద్భూమి నెచట

వానలులేమిచేవర్షహాయనంబులు
పలుమఱుసేయించిపడయరామిఁ
జింతనొందుటయుభూకాంతునిఁబొడగాంచి
యచటిసన్మానులిట్లనిరి తెలియ
నధిపవిభాండకుండనుమునితనయుండు
చిరతపోనిధిఋశ్యశృంగుఁడలరు
నాతఁడుజనించినదిమొదలడవులందుఁ
దపమొనర్చుచుఁగడునిష్ఠఁదవిలివెలయు
భావనిర్మలినుండుప్రభావశీలుఁ
డెపుడుఁబురములనతివలనెఱుఁగఁడరయ. ౮౮.

క. అమ్మునిచంద్రుఁడుమనరా
జ్యమ్మునకరుదెంచినన్నిజమ్ముగనతివ
ర్షమ్ములుగురియుసుధరస
స్యమ్ములుఫలియించుఁబ్రజకుసౌఖ్యంబెసఁగున్. ౮౯.

వ. కావున. ౯౦.

క. జననాథాగ్రణివినుమా
ఘనమునివరుఁదోడితేరఁగణికాసతులం
బనుపుమననాతఁడలరుచు
మనసిజతంత్రజ్ఞలైనమగువలననిచెన్. ౯౧.

గీ. ఆపాలంతులాత్మలలరంగఁగైసేసి
వింతభక్ష్యములనుసంతరించి
నిజపురంబువెడలినిర్మానుషంబగు
విపినమునకుఁజనిరితపసిసరయ. ౯౨.

వ. ఇవ్విధంబున నయ్యిందుముఖులు సందడించుచు మందగమనంబున నందియలు గదలి రొదలు సలుపఁ బదంబు లిడుచుఁ, గనకరత్న ప్రభాభాసితం బగుభూషణంబుల ధళధళత్కాంతు లెల్లెడలం బిక్కటిల్లం జేయుచు, వీరమోహినీదేవతలకైవడి వనంబున నెల్లెడలం గ్రుమ్మరి మెల్లమెల్లన ఋశ్యశృంగు నాశ్రమంబుఁ జేరం జనుదెంచుటయు నమ్మౌనీంద్రుండు వారలం గాంచి దేవస్త్రు లనుతలంపునం బ్రత్యుత్థానం బొనర్చి యాతిథ్యం బొసంగి తోడ్తెచ్చి యుచితాసనంబుల నునిచి తానుం దత్సమీపంబున నివసించి వారల సుకుమార లావణ్యవిలాసవైభవంబులకు విభ్రమం బంది డెందంబున నిట్లని తలపోసె. ౯౩.

క. కనివినియెన్నండెఱుఁగము
మునిముఖ్యులలోననిట్టిమూర్తులువీర
ల్ఘనతాపసాకృతులుగొని
వనమునఁజరియించుత్రిదశవర్యులుసుమ్మీ. ౯౪.

క. అనిమదినెంచివిభాండక
తనయుండవ్వారసతులఁదాపసులనుచు
న్వినయమునఁదత్కుచంబులఁ
దనకరముననంటిపలికెఁదానిట్లనుచున్. ౯౫.

క. కొమ్మొకటిగలసుమాకుశి
రమ్ముననతికఠినముగనురమ్ములమీకుం
గొమ్ములురెండైమృదులత
రమ్ముగఁగనుపట్టెనేవరమహిమయొకో. ౯౬.

శా. మీశాపాయములాత్మకింపెసఁగఁగామించెన్విచిత్రంబులై
యీకాంతారమునందుఁగల్గుమునులందేపట్టునంగానమీ

యాకారంబులునీతనుమ్యతులునీయుడంబుతోపేరుల
ప్లీకానవ్వసియుంచియుండునురుమాకంతేఁగృపందెల్పరే. ౯౭.

వ. అనిన నత్తలోదరు లమ్మునివరుం గాంచి మృదుమధురధార లొలుకు నిస్వనంబున ని ట్లనిరి. ౯౮.

క. మునివరవినుమీచేరువ
వనముననెల్లప్పుడునునివాసంబుగమే
మనువొందుచుందుమియ్యెడ
నినుఁగనఁజనుదెంచితిమివినింద్యచరిత్రా. ౯౯.

క. మాయాశ్రమముననిరతముఁ
బాయకఫలియించుదివ్యఫలములివిగోబో
సేయుముదీనిమహిమచేఁ
గాయజునింగెలువనగునుగ్రమముననఘా. ౧౦౦.

వ. అని పల్కి యా కల్కిమిటారులు తమచే నున్న లడ్వంబులు జాలరులు జలంబుల నున్న మీనంబులకు వల వేయుచందంబున నవ్వనవాసినిం జేకొనుట కిదియె మూలం బని తలంచి యొసంగుటయు నతం డవి మహాప్రియంబునం గైకొని భుజియించుచుఁ దన్మాధుర్యంబునకు నానందం బంది యమ్మందయానలతో ని ట్లనియె. ౧౦౧.

క. మావనమునఫలములయం
దీవిధమగురుచియెటుంగమెన్నండహహా
శ్రీవరునకర్పితంబౌ
మీవంటికృతార్థులెన్న మేదినిఁగలరే. ౧౦౨.

క. అనిపల్కుమహాసింద్రుఁడు
దనమదినిర్మించియుండసంబునభూోత్తఁగన

వ్వనజముఖులతోస్నేహం
బొనరించుచు మెలఁగుచుండె నెం డెఱుఁగమిచేఁ. ౧౦౩.

వ. అంత. ౧౦౪.

సీ. ఒక లేమ కుచముల నురమున నాటఁగీ
లించి బిగ్గరఁ గౌఁగలించి విడుచు
నొకకొమ్మ జిగిమోవి నొసర నానఁగ నిచ్చి
రుచిఁ దెల్పుమని వేఁడు రూఢిమీఱ
నొకతలోదరి చెక్కు లొయ్యన నొక్కుచు
ముదము దీపింపఁగా ముద్దు వెట్టు
నొక వధూరత్నంబు ప్రకటితచాతుర్య
మంజు భాషణముల మరులుగొల్పు
నింతులిబ్బంగి నమ్మునికాంతుఁ గొంత
వింత సరసంపుఁ జెయ్వుల విస్తరించి
మమతఁ గల్పించి చెల రేగి మరలి వత్తు
మనుచు వచియించి చని రాత్మ లలర నపుడు. ౧౦౫.

వ. ఇట్లమ్మానినీమణులచ్చోటు వాసి యచ్చేరువ నొక్క వనాంతరంబున నివసించియుండి రంత ఋశ్యశృంగుండు. ౧౦౬.

ఉ. వారిమనోహరాకృతులు వారి మృదుత్వవచోవిలాసము
ల్వారి నిజాంగసద్రుచులు వారికటాక్షవిచక్షణత్వము
ల్వారి దయాంతరంగములు వారక నెంచుచు నాటి రేకడ
న్గూరుకురాక తా మదినిఁ గుందుచుఁ జింతిలఁ జొచ్చె నెంతయున్. ౧౦౭.

ఉ. తాపసు లెంచఁ బోయిరొకొ తప్పక వెంబడి నేగనైతి నం
తాపముఁ జెందనయ్యె మది దారుణ మావనమందు నొంటిమైఁ

ప్రాపుఁదొఱంగియున్నయెడఁబాపవుదైవముగూర్చివారలం
బాపుటెఱుంగనైతినిఁకఁబాయనిచింతభరింపనేర్తునే. ౧౦౮.

క. ఎన్నఁడుచూడంగల్గును
గన్నులకఱవెల్లఁదీఱఁగానమ్మునులన్
సన్నుతమతులగువారలు
నన్నెదలోమఱచియేవనమునకుఁజనిరో. ౧౦౯.

వ. అని యివ్విధంబున నవ్విభాండకసుతుం డంతరంగంబున నంతంతం జింతించుచు నుండయు నమ్మఱునాఁటి రేపకడ నగ్గణికాభామలెప్పటియట్లం గైచేసి హంసయానంబులం దదాశ్రమంబుఁ జేర నరుదేరం గాంచి పెన్నిధిఁ గన్న పేదయుంబోలె నెదురు చని యానంద బాష్పంబు లొలుకఁ బలుకుచుం దోడ్తెచ్చి యాసీనులం జేసి వారలతో ని ట్లనియె. ౧౧౦.

గీ. నిన్నరేయెల్లమదిఁబూనినిలుపరాని
తాపమునఁగుందివెతలఁదత్తఱమునొంది
పరమమునులారనాతపఃఫలముకతన
మిమ్మునఱలఁగనుంగొంటిమేలుఁగంటి. ౧౧౧.

క. అనివినయంబొనరించుచు
మునిముఖ్యుఁడువారిఁగలసిముదముదలిర్పం
బెనఁగుచునుండఁగనాతనిఁ
గొనిపోవందలఁచిచేరఁగొనిపలికిరొగిన్. ౧౧౨.

క. మునివరమాయాశ్రమముల
ననువొందఁగఁగాంచిమముఁగృతార్థులఁజేయం
జనుఁగావనటకునీవిఁక
ననఘాచనుదేరవలయుననురాగమునన్. ౧౧౩.

ఉ. అచ్చటిపర్ణశాలలుమహాత్మమహారజతప్రయుక్తము
లచ్చనలంచునెంచకుముతాపసులున్నముఁబోలువారలా
ముచ్చటలెన్ననామనునిమూర్ఖతనమ్ములఁబాఱఁదోలఁగా
వచ్చునిఁకేమిదెల్పనగువారకనీవునెఱంగదాసుమీ. ౧౧౪.

వ. అని యనేకవిధంబుల నవ్వేలందు లమ్మహానుభావు నొడంబఱచి యమానుషం బగువనంబు నుండి మదకరీంద్రంబునుం గొనివచ్చు కరిణీసముదయంబునుంబోలెఁ దదాశ్రమం బశ్రమంబునం బాపి విభాండకు దెసభయంబున నలుదిక్కులం గాంచుచు నరణ్యం బతిక్రమించి జనపదంబునకుఁ దోడ్తెచ్చి రంత. ౧౧౫.

క. వానలుగురిసెనమితమై
మానుగసస్యములువండెమహినెల్లెడలం
బూనినకఱవెడఁబాసెను
దాననవావృష్టిదోషతతియుఁదొలంగెన్. ౧౧౬.

గీ. అంతరోమపాదుఁడమ్మునికెదురేగి
వినయముననుదెచ్చితనతనూజ
శాంతనొసఁగినిజగృహాంతరంబుననుంచి
యున్నవాఁడుసద్యశోన్నతముగ. ౧౧౭.

క. కావుననమ్మునిబుత్త్రిజుఁ
గావేఁడియుఁదెచ్చిపుత్రకామేష్టిఁదగం
గావింపసుతులునల్వురు
భూవరగల్గుదురునీకుఁబూర్ణమహిమచేన్. ౧౧౮.

సీ. ఈతెఱఁగుమున్నునాతోడనెఱుఁగఁబల్కె
నిందువేడ్కసనత్కుమారుండుగాన

నటులొనర్పుమటంచుఁదెల్పుటయుసూతుఁ
దగినభంగులఁగొనియాడిదశరథుండు. ౧౧౯.

చ. కనకరథంబునెక్కి భటకాండముతోఁ జతనేగి కోమపా
దనరవరాగ్రగణ్యుఁగని తత్సదనంబుననున్న ఋశ్యశృం
గునకతిభక్తి మ్రొక్కి మదిఁగూరిమిఁ బెంపుచుశాంతతోడనా
ఘనునటు తెచ్చి ఋత్విజునిఁగా వరియించి యయోధ్యఁ జేరఁగాన్.

గీ. అట్లయోధ్యఁజేరి యమ్మునినాథుని
శాంతతోడ నిజనిశాంతమునను
నిలిపి ప్రియము దోఁప నిత్యపూజనములఁ
దనియఁజేయుచుండె దశరథుండు. ౧౨౧.

వ. అంతఁ బూర్వకాలంబునందు. ౧౨౨.

మ. దశకంఠుండతి ఘోరవిక్రమకళాధౌరేయుఁడై మించి దై
త్యశతంబుల్దనుఁగొల్వ లోకములనంతం గెల్చి బాధింపదు
ర్దశ చేత న్విబుధాళి వేఁజని మహార్త్యాన్పాలయాస్మాన్విజే
శశతానందయుటంచు వేఁడికొన భాషానాథుఁడత్యాదృతిన్. ౧౨౩.

గీ. వారిఁదోడ్కొని చని దుగ్ధవార్ధిఁ జేరి
యక్కజంబుగ నొక్కచోఁ జక్క నిలిచి
వాసుదేవుని నిజమనోవారిజమున
నెంచి భయభక్తులొనర నుతించె నిట్లు ౧౨౪.

బ్రహ్మేంద్రాది దేవతలు శ్రీమన్నారాయణుని భూమి నవతరింపం బ్రార్థించుట.

సీ. శ్రీరమావక్ష యాశ్రితమానిజనపక్ష
నిఖిలజగద్రక్ష నీరజాక్ష
క్షీరాబ్ధిశయన నిర్జితదితినందన
శారదాబ్జాననస్వర్ణవసన

కౌస్తుభమణిభూషఖండితకలిదోష
కమనీయతరవేషకమ్రభాష
త్రిదశవందనపాత్రదివ్యకోమలగాత్ర
పరమపవిత్రశుభదచరిత్ర
భక్తహృత్పంకజనివేశభవవినాశ
కాలజీమూతసదృశాంగఖగతురంగ
కమలహితతేజదీనాళికల్పభూజ
యవధరింపుము దేవమహానుభావ. ౧౨౫.

ఉ. రావణుఁడీజగంబులఁబరాక్రమలీలలసంచరించుచు
న్దేవపురంబులంగలఁచిధీరతనేఁచుటకోర్వలేమిచే
నీవగనిర్జరాళిజగదీశ్వరనిన్నరణంబుజొచ్చియెం
తేవినిపింపసాఁగెనరుదెంచికృపంబొడగాంచిఁబ్రోవవే. ౧౨౬.

క. దీనజనోద్ధరణమునుం
దానవసంహరణమును సదామునివరస
న్మానమునున్నీపనిగా
దేనలినదళాక్షజలనిధిసుతాధ్యక్షా. ౧౨౭.

వ. అని యేకాగ్రచిత్తుండై పలుదెఱంగుల వినుతించు నలినగర్భు నుద్దేశించి యవ్వాసుదేవుండు మేఘగంభీరారావంబున నిట్లనియె.

క. వనజాతాప్తాన్వయపా
వనుఁడగుదశరథనృపాలవర్యునకును నేఁ
దనయుఁడనైక్షితలంబున
జనియింతుఁ రావణునివెసన్హరియింతుఁ. ౧౨౮.

గీ. అవనిపైమీఁదమతమయంశములన
హీనభుజవిక్రమాటోపమెనఁగునట్టి

కపివరులఁ గల్గఁ జేయుఁడు క్రమముతోడ
నరిహరణమున సమత్సహాయంబు కొఱకు. ౧౩౦.

వ. అని యప్పురాణపురుషుం డానతిచ్చినఁ గమలభవుం డమరులం గని
యిట్లనియె. ౧౩౧.

హరిదశరథాత్మజుండై
ధరణిం జనియించి కూల్చు దశకంధరుని
న్సురమునకుఁ దోడుగా వన
చరులం బుట్టింపుఁ డధికసంతోషమునన్. ౧౩౨.

వ. మున్న నే నావలించుటయు మద్వదనగహ్వరంబునం దుండి జాంబ
వంతుం డను నొక భల్లూకవిభుండు గల్గి దీర్ఘాయుష్మంతుండై ప్రసిద్ధి
నొందియున్నవాఁ డనిన నింద్రార్కగంధవహవిశ్వకర్మాద్యఖిలామ
రోత్తములు వాలిసుగ్రీవాంజనేయనలప్రముఖవలీముఖులం గల్పించిన
వారును మహాబలపరాక్రమాన్వితులై కొందఱు వాలినిఁ గొందఱు
సుగ్రీవునిం గొలిచి కిష్కింధానగరంబున మతంగ ఋశ్యమూకమాల్య
వదాదినగంబుల మహారణ్యంబుల వసియించియుండి రంతఁ గొంత
కాలంబునకు నయోధ్యాపురవరంబునందు ౧౩౩.

క. దిననాథకులుఁడు దశరథ
జననాథుం డొక్కనాఁడు సచివులచేత
మ్మునిముఖ్యులగు వసిష్ఠా
ద్యనఘులఁ బిలిపించి పలికె నతిహర్షమునన్. ౧౩౪.

గీ. యతికులాధ్యక్షులార మహాత్ములార
సుతులఁ బడయంగఁ గోరి యే నతులితముగఁ
బుత్రకామేష్టి నొనరింతుఁ బూనఁగ మీరుఁ
దత్క్రతువు నిర్వహింపఁగాఁ దలఁపుఁ డిపుడు. ౧౩౫.

చ. అనుటయునమ్మునుల్బలికిరబ్జహితాన్వయవార్ధిచంద్రనీ
మనమునఁగోరుకోర్కి యనుమానము లేకఫలింపనౌనుభూ
మినినృపతుల్నుతింపహయమేధము సేయుముమున్ననంతరం
బునసుదనూజులంబడయఁబూనియొనర్పుముతన్మఖంబొగిన్. ౧౩౬.

క. ఇదిమధుమాసంబగుట
న్నదినెంచిసులగ్నమునసుమఖయోగ్యంబై
పొదలుతురంగమునువిడువు
మెసఁగెందునులేక నొక్కయేఁడుచరింపన్. ౧౩౭.

దశరథుఁ డశ్వమేధయాగము సేయుట.

క. అనిమునివర్యులుదెలిపిన
వినిదశరథుఁడాత్మనలరివిడిచెహయంబుం
దనబిరుదుపట్టికయునుమ
టనుగ్రాలఁగఁగాచుటకుభటచయముజనఁగాన్. ౧౩౮.

వ. అంత నయ్యశ్వం బొక్కసంవత్సరంబు చతుస్సాగరావేష్టితం బగు భూమండలం బంతయు నిజేచ్ఛం గ్రుమ్మరి జయంబుఁ గాంచి యొప్పటి యట్ల మధుమాసం బేతేర మఱల వచ్చుసమయంబున. ౧౩౯.

సీ. దశరథాధీశుండు దగుశిల్పవరులచే
సరయువుచెంతవిశాలముగను
బ్రవిమలాధ్వరశాలబాగొప్పనిర్మించి
వలయుసంభారముల్వరుసఁగూర్చి
శ్రౌతధర్మక్రియాచారతత్పరవిప్ర
సత్తమసంఘమాయత్తపఱిచి
కాశిరాజేంద్రకేకయజనకాంగభూ
పాలముఖ్యులఁబిల్వఁబంచిమఱియు

బంధుహితకోటి రావించి పౌరజనుల
నెల్ల నే వేళలందుండ నేర్పఱించి
ధనకనకవస్తువాహనతతుల మర్చి
తానుఁ గృతకృత్యుఁడై యున్న తరుణమునను. ౧౮౦.

క. ఘోటకమరుదెంచిన నిరా
ఘాటంబుగ సవనశాలఁ గనియటఁ జొరన
మ్మేటి నృపాలుం డధ్వర
వాటికిఁ జని యజ్ఞదీక్ష వాంఛ వహించెఁ. ౧౮౧.

సీ. అంతట సుముహూర్తమరుగుదేర వసిష్ఠ
ఋశ్యశృంగ సుయజ్ఞకశ్యపాది
మునులు ఋత్విజులుగా మునుకొని సవనకుం
డము ప్రజ్వరిలఁ జేసి క్రమము మీఱ
జలచర వనచర సర్పవిహంగాది
పశుశతత్రయ మొక్క పటుహయంబు
యూపాగ్రబద్ధమై యొప్పఁ దత్పలలము
ల్వేదమంత్రంబుల వ్రేల్చుచుండ
ననలుఁడయ్యెడ సప్తజిహ్వల వెలింగె
నలఘుతరముగ నాజ్యాహుతులు సెలంగె
నంబరము గప్పె హోమధూమంబు సవల
యాగభాగములొసఁగి రయ్యమరులకును. ౧౮౨.

వ. అంత. ౧౮౩.

గీ. నేఁడుగడ రావణుని బారి నిర్వహించి
కో[illegible]పారసన్నంబు గుడువఁ గలిగె

ననిహవిర్భాగములుగొనియమితముగను
సంతసిల్లిరివేల్పులాసమయమునను. ౧౪౪.

క. జనవరుఁడధ్వర్యులకుం
దనివారఁగఁగోట్లకొలఁదిధనములొసఁగితా
మనమలరవిప్రులకుమణి
కనకాభరణములఁదృప్తిఁగావించితగన్. ౧౪౫.

గీ. పౌరజనులకుభటపరిచారకులకు
విమలవస్త్రాభరణములువేడ్కనొసఁగి
క్రతుసమాప్తినిఁగావించిక్షితితలేశుఁ
డవభృథంబాడిమదిఁగుతూహలమునొందె. ౧౪౬.

వ. ఇట్లమ్మనుజవల్లభుం డగు దశరథుం డశ్వమేధంబు నిర్విఘ్నంబుగా నొనర్చి యనంతరంబ జ్యోతిష్టోమవిశ్వజిదాదియాగంబులఁ జేసి పుత్రకామేష్టి నుపక్రమింపం దలంచి ఋశ్యశృంగమునీంద్రునిం బ్రార్థించి ఋత్విక్కుఁగా వరియించి సుమంత్రునిం గాంచి సర్వసంభారంబుల నొనఁగూర్ప నియమించుటయును. ౧౪౭.

సీ. మనుజేంద్రునాజ్ఞసుమంత్రుండుయాగసా
మగ్రులనెల్లసమగ్రముగను
సంతరింపఁగనుదశరథుండుఋశ్యశృం
గాదిమౌనులఁగూడిమోదమలరఁ
బుత్రకామేష్టియద్భుతముగాఁగావించి
ధరణీసురాళికిధనములొసఁగి
బర్హిర్ముఖులహవిర్భాగంబులనుదన్పి
హరిచరణధ్యాననిరతుఁడగుచు

నుండుతత్రిహోమకుండమునుండియజ్ఞ
    పురుషుఁడొక్కపైఁడిపళ్లెరంబునను బాయ
సంబునిడికొని తెచ్చియొసంగిచనిన
    హర్షమందుచుఁగైకొనియవనివిభుఁడు. ౧౪౮.

క. సగమొసఁగెఁగౌసల్యకు
    సగమునసగమునరఁగొనియొసఁగెఁగైకకునా
సగమునసగమున్నతియును
    మిగిలినసగమునొసఁగెసుమిత్రకునంతన్. ౧౪౯.

గీ. వారలప్పాయసాన్నంబునారగించి
    గర్భములుదాల్చిరంతభూకాంతుఁడలరి
యిష్టదేవతలకునుసంతుష్టిగలుగ
    నటులుపూజించుచుండెనయ్యవసరమున. ౧౫౦.

శా. మేనుల్వింతగుకాంతిఁజెందెఁదెలిడాల్మించెన్ముఖాబ్జంబుల
న్నానాటన్నలుపెక్కెఁజూచుకములున్మధ్యంబులున్శ్రోణులుం
బీనత్వంబువహించెనూర్పులెసఁగెంబెంపొందెఁగోర్కుల్దగ
న్నానాచ్యపదార్థసంగమరుచిన్బ్రాపించెసబ్బోట్లకున్. ౧౫౧.

క. అడుగులిడునెడనుదడఁబడెఁ
    దొడవులుగడుభరములగుచుఁదోఁచెమృదాశ
ల్విడువకతొడరెనుజెమ్మట
    లొడలందొడియందొడంగెనుడుపముఖులకున్. ౧౫౨.

వ. అందు. ౧౫౩.

క. అంబుజనాభుఁడునిజగర్భం
    బునవెలుఁగొందుకతనఁబటుతరరూపా

దంబరమైకౌసల్యా
బింబోష్ఠి సెలంగెఁజూడఁ బ్రియముదలిర్పన్. ౧౫౪.

శ్రీరామభరతలక్ష్మణశత్రుఘ్నుల జననము.

వ. అంత. ౧౫౫.

సీ. నెలలుపండ్రెండునునిండఁగాఁ జైత్రశు
ద్ధనవమినీసౌమ్యదినమునందు
నదితితారకనుమధ్యాహ్నకాలంబున
గ్రహపంచకంబుచ్చగృహములందు
రాజిల్ల గురుఁడు రేరాజుతోఁగూడఁగ
ర్కటకలగ్నంబునఁగలుషభీము
రఘుకులాంభోనిధిరాకాసుధాధాము
దివ్యలక్షణకళాభవ్యధాము
శుభగుణారాముభీకరాసురవిరాము
నంబుదశ్యాముసకలలోకాభిరాము
శ్రీవధూమణిలసదురస్సీమురాముఁ
గనియెఁగౌసల్యదివిజులమనములలర. ౧౫౬.

క. అకలంకమైనపుష్య
ర్క్షకలితగురువాసరమునఝషరాశినిఁజ
క్రకళావిఖ్యాతునిడిం
భకునింగైకేయిగనియెభరతుశుభరతున్. ౧౫౭.

క. ఫణితారకమునసద్గుణ
గణయుతకర్కటకరాశిఁగవిదివసమున
న్ఫణిపతిశంఖాంశులల
క్ష్మణశత్రుఘ్నులసుమిత్రగనియెస్వేచ్ఛన్. ౧౫౮.

వ. అయ్యవసరంబున. ౧౫౯.

సీ. తరగలతోడ సాగరసప్తకము పొంగ
    నభమున దేవదుందుభులు మ్రోసె
నమరులు గురియించి రలరుల సోనల
    నాడి రచ్చరలేమ లతిశయమున
గంధర్వముఖ్యులు గానము ల్సల్పిరి
    గంధానిలంబు నల్గడల వీఁచె
బ్రహ్మరుద్రాదులు పరితోషమందిరి
    మంగళవాద్యము ల్మహిఁ జెలంగె
నెల్లజనములు సంతసము ల్లసిల్ల
    నుత్సవంబులొనర్చి రొండొరులఁ గూడి
గరుడగమనుండు సాకేతపురవరమున
    నబ్జబాంధవకులజుఁడై యవతరింప. ౧౬౦.

వ. అంత దశరథుం డంతకంతకు నంతరంగంబున నత్యంతసంతోషం బంది మంతనంబున వసిష్ఠాదిమహర్షుల రావించి నేత్రోత్సవంబుగాఁ బుత్రోత్సవంబు గావించి భూసురుల కనంతం బగుధనంబు లొసంగె. అనంతరంబున జాతాశౌచం బతిక్రమించుటయు వసిష్ఠుండు పుణ్యాహవాచనస్వాహామాదివిధు లాచరించి కౌసల్యానందనునకు రామచంద్రుం డనియును గైకేయీతనూభవునకు భరతుం డనియును సుమిత్రాత్మజు లగుకవలకు లక్ష్మణశత్రుఘ్ను లనియును నామకరణంబు గావించిన. ౧౬౧.

క. గోభూహిరణ్యముఖ్యమ
    హాభూరిధనరాశిక మితంబుగనా

భూభర్తయొసఁగిమిక్కిలి
వైభవమునవెలసెరాజవర్యులుపొగడఁగ. ౧౬౨.

వ. అంత. ౧౬౩.

సీ. తల్లులుదాములుదమునర్థిఁబెంపఁగ
బ్బాలుగనల్వురుబాల్యమునను
కల్లరిసగవులఁగనములుద్రిప్పుచు
నల్లనల్లనఁదప్పటడుగులిడుచుఁ
దడఁబడునుడువులునుడువుచునాఁటపా
టలఁబ్రొద్దుపుచ్చుచుఁజెలువమునర
ముద్దులుగుల్కుచుమోహనాకారులై
మానుగానందమమరులుగొల్వ
దినదినంబభివృద్ధిచేఁదేజరిల్లి
యవలఁజౌలోపనయనంబులందితోఁడి
బాలకులఁగూడియాఁడుచుఁబార్థివునకు
నింపువేడుకలొనరించుచుండిరపుడు. ౧౬౪.

క. రామునిజతగాలక్ష్మణుఁ
డేమారకకొలుచుచుండునిలశత్రుఘ్నుం
డామాడ్కిభరతునుద్దిగ
సామోదంబుగఁజరించుసహజముగాఁగన్. ౧౬౫.

వ. ఇట్లు కూడి యాడుతఱి నొక్కనాఁడు సమానవయస్కులతోడ రామచంద్రుండు గందుకక్రీడ సల్పుసమయంబునఁ గైకేయిదాసి మంథరయనునాతి యడ్డంబు రా రాముండు సేతికోలఁ గాలు విఱుగ వ్రేసిన నది యాత్మగతంబునఁ గ్రోధం బుంచి చనియె. ఇవ్విధంబున

దినదినప్రవర్ధమాను లగు రామలక్ష్మణభరతశత్రుఘ్నులఁ జదివింప నుద్దేశించి దశరథుండు వసిష్ఠమౌనీంద్రుఁ రావించి యొప్పించిన.

ఉ. అమ్మనుజేంద్రసూనులపుడమ్మునినాథుని చేసమస్తవే
దమ్ములుసత్పురాణములుఁదప్పకయన్నియునభ్యసించిహా
ర్దమ్మునసస్త్రశస్త్రవిధిసాంగముగాఁగ్రహించిబాహుశౌ
ర్యమ్మునవన్నెకెక్కిరభియాతిజనమ్ములకాత్తదూలఁగాన్. ౧౬౭.

వ. మఱియు రథగజతురగాగోహణంబులఁ బ్రసిద్ధి నొంది సంగరరంగం బున వైరుల గెల్చుతెఱంగు సాంగంబుగా నెఱింగి సామభేదాది చతురోపాయంబులఁ దెలిసి సకలసద్గుణంబులఁ దేరి జగన్మోహనా కారు లై వెలింగెడికుమారులం గని దశరథుం డానందాంబుధినిఁ దేలుచున్నంత నొక్కనాఁడు. ౧౬.౮.

విశ్వామిత్రాగమనము.

క. ప్రకటతపోవిభవాతిశ
యకరుఁడు త్రైలోక్యవినుతయశుఁడసదృశుఁడ
త్యకలంకచరితుఁడగుకౌ
శికుఁడరుదెంచెన్నృపాలశేఖరుకడకున్. ౧౬౯.

క. వచ్చినమునివర్యునకు
నెచ్చెరనెదురేగివార్ష చేతస్కుండై
మచ్చికతో దశరథుఁడా
సచ్చరితునిఁదోడితెచ్చిసరగుననంతన్. ౧౭౦.

గీ. అర్ఘ్యపాద్యాదులొసఁగియర్హాసనమున
నునిచిభయభక్తిఁబూజింపమునివరుండు
దత్సభికులవసిష్ఠాదితాపసులను
గాంచికుశలంబడిగినృపుఁగాంచిపలికె. ౧౭౧.

క. కుశలమె నరవర నీకుం
గుశలమె భూప్రజకు బంధుకోటికి నెల్లం
గుశలమె నీకులసతులకుఁ
గుశలమె వంశకరులైన కూర్మిసుతులకున్. ౧౭౨.

వ. అనిన దశరథుం డిట్లనియె. ౧౭౩.

క. మునివర్య భవదనుగ్రహ
మున సర్వశుభంబు మాకు మునుకొను మీర
ల్లను దెంచినట్టి కార్యం
బనఘా యెఱిఁగింపుఁ డెద్దియైన నొనర్తున్. ౧౭౪.

వ. అనిన విశ్వామిత్రుం డిట్లనియె. ౧౭౫.

చ. నరవర యే నొనర్చు సవనంబునకుం గడువిఘ్నకారులై
పరువడి మాంసరక్తముల పారముగాఁ గురియించుచున్న శా
చరులు చరింతురిద్దఱనసాధ్యులు గావున నస్ధరాత్ములం
బొరిఁగొన రామచంద్రు నతిపుణ్యునిఁ బంపుము తెంపు మీఱఁగాన్.

వ. అనినఁ దద్వచనంబు లతి కఠోరంబు లగు నారసంబుల భంగిఁ గర్ణ యుగ్మంబున నాటుటయు మూర్ఛిల్లి కొంతతడవునకుం దెలివొంది దశరథుండు విశ్వామిత్రుం గనుంగొని ముకుళితకరకమలుండై మెల్ల మెల్లన నిట్లనియె. ౧౭౭.

క. మునివర బహువత్సరములు
తనయులు లేమికి నివగచి తగు యజ్ఞంబే
నొనరించి కంటి వీరలు
గనుమ ఱుఁగై యున్నఁ దాళఁగా వశమగునే. ౧౭౮.

క. అతిబాలకుండు రాఘవుఁ
డతులితశస్త్రాస్త్రవంతు లసురులు వారి

స్తత్త మొనరింపఁగ నేర్చునె
మతినీయెడ నిట్టితలఁపు మానుముకృపచేన్. ౧౭౯.

ఉ. తాపసవంశవర్య విను తావకయజ్ఞము నాదరింపఁగా
నేపున సేనలంగొని యునిప్పుడె నీవెనువెంట వచ్చి యా
పాపపుదైత్యజాలములఁ బట్టి వధించి మఖంబుఁ గాచెద
న్బాపఁడు రాఘవుండ తనిఁ బంపఁగఁ జాలకె మింపు మిత్తఱిన్. ౧౮౦.

చ. అనవిని కౌశికుండని యెసర్కను లేశ మదీయవాంఛితం
బొనరఘటింతునంటి విపుడో జెద నాత్మజుఁ బంపుమన్నచో
మనుమనువంశజాతనృపముఖ్యులు నీక్రియఁ బల్కి బొంకిరే
దనుజుల జేయు లోకతనఁ దావకసూనుఁ జెత్రుంచువారలన్. ౧౮౧.

క. రాముఁడు దక్కనొరులచే
నామనుజాశనుల ద్రుంగ రటుగా పునసీ
పీమాట్కిఁ గొదవ లెన్నక
యామోదంబున ననుబంపన గునా వెంటన్. ౧౮౨.

వ. అదియునుంగాక. ౧౮౩.

మత్తకోకిల. రాముఁ డాత్మజుఁ డంచు నెంచకు రాజసత్తమ చిత్తమం
దీమహాత్ముఁడు విష్ణుఁ డవ్యయుఁ డిందిరారమణీశుఁడు
ద్ధామసత్యుఁ డనంతుఁ డాఘ్యుఁడు దారసద్గుణధాముఁడా
సోమశేఖరవంద్యుఁడైతగు సుస్మునమ్మ ధరాధిపా. ౧౮౪.

మత్తకోకిల. దేవకంటకులైన దైత్యులఁ ద్రెంచఁగోరి వసుంధర
న్దేవదేవుఁ డుమానవాకృతిఁ దేజరిల్ల జనించినాఁ
డీవిధం బిపుడే నెఱుంగుదు నీవసిష్ఠుఁ డెఱుంగు నీ
భావమందనుమానమందక పంపఁగాఁదగు రామునిన్. ౧౮౫.

క. అనిగాధేయుఁడు దెల్పిన
మనుజాధిపుఁడవ్వసిష్ఠమౌనీంద్రునిఁగ
న్గొనుటయు నయ్యఘదూరుం
డనియె న్దశరథునిఁ గాంచి హర్షము మీఱన్. ౧౮౬

క. అడిగిన దానఁ గొదననుచు
న్నడయక యిమ్మునికిఁ బలికి తప్పఁగనౌనే
నుడివిన నుడువులు లేదనఁ
బుడమిని నపయశము గాదె భూపవరేణ్యా. ౧౮౭

క. అదిగాక యరక్కరులజాల
సదమలమగు కీర్తులెల్ల సమయుట కాదే
మదిననుమానమునూనక
ముదమున రాఘవునిఁ బనుపుము నిపతి వెంటన్. ౧౮౮

గీ. అఖిలశస్త్రాస్త్రసంపన్నుఁ డరయ నీతఁ
డసురుల నుద్రుంపఁ జాలఁడే యాహవమున
నీతనూజు నిరణరంగ నిపుణుఁ జేయఁ
దలఁచి పిల్చుట గానిష్ఠ తలఁపు మధిప. ౧౮౯

క. అనుచు వసిష్ఠుఁడు దెల్పిన
జననాథుం డూఱడిల్లి సత్వర మొప్ప
న్దనముద్దతనయుఁ డగు రా
మునిఁ బిల్వం బనుప నతఁడు ముదమలరారన్. ౧౯౦

క. తమ్ముఁడుఁ దానుం దల్లుల
నమ్మతిఁ గైచేసి మిగుల శస్త్రాస్త్రముల
య్యమ్ములపొదలుం గోదం
డమ్ములుఁ గొని మందిరము వెడలిరున్నతులై. ౧౯౧

చ. హరిహరయుగ్మమో తలఁపన ర్కసుధాంశుయుగంబొ యంచుఁ జూ
పఱులు భ్రమింపదీధితివిభాసితకోమలదేహయుక్తులై
సరసిజపత్రనేత్రములఁ జల్లనిచూపు లెసంగఁ జూచుచుం
జిరమతులై ధరాధిపునిఁ జేరఁగ వచ్చిరి ముద్దుగుల్కుచున్. ౧౯౨.

వ. ఇట్లు చనుదెంచి రామలక్ష్మణులు వసిష్ఠవిశ్వామిత్రాదిమహర్షులకు వందనంబు గావించి తండ్రిమ్రోల నిలువంబడినఁ గుమారులం గని యానందబాష్పంబు లొలుక నాలింగనం బొనర్చి చెక్కిలి ముద్దిడి చుంచు దువ్వి చెంతం గూర్చుండ నియోగించి రామభద్రు నీక్షించి దశరథుం డిట్లనియె. ౧౯౩.

క. అన్నా రాఘవ కౌశికు
  జన్నంబున నసురబాధ సంఘటితముగా
నన్నరభోజులఁ దునుమ
  న్నిన్నుం గొనిపోవ వచ్చె నేఁ డయ్యెడకున్. ౧౯౪.

ఉ. కావున నమ్మహాధ్వరముఁ గాచుటకిమ్మునినాథుతోడుత
న్నీవును లక్ష్మణుండుఁ జని నేర్పున దైత్యులను క్కడంచి యెం
తే విభవంబు నన్మఖముఁ దెంపున సాంగముగా నొనర్చి యీ
భూవలయంబునన్ వినుతిఁ బొందుము చెందుమభీష్టసిద్ధులన్. ౧౯౫.

రామలక్ష్మణులు విశ్వామిత్రుని వెంట నరుగుట.

వ. అని పల్కి పుణ్యాహవాచనం బొనరించి శుభరక్షలిడి భూసురుల కనేకదానంబు లొసంగి మంగళతూర్యనినాదంబులు సెలంగఁ గౌసల్యాదికాంతాజనంబుల కత్తెఱం గెఱింగించి తదనుజ్ఞాతుండై దశరథుండు శుభలగ్నంబున రామలక్ష్మణుల విశ్వామిత్రునకొప్పించిన వారలం దోడ్కొని సభాసదుల వీడ్కొని చని సరయూనదీతీరంబున నాఁటిరాత్రి విశ్రమించి యమ్మఱునాఁ డరుణోదయంబున నిత్య

కర్మానుష్ఠానంబుల నెరవేర్చినయనంతరంబు గాధేయుండు బలాతి
బల లనుమంత్రంబు లా రాకొమారుల కుపదేశం బొనర్చుటయు
వారలు సమ్మంత్రశక్తిచే నాఁకలి నీరువట్టు మొదలగురుజల వర్జించి
మహాబలతేజోవిక్రమంబుల విలసిల్లుచు సవ్వాలం జని చని. ౧౯౬.

క. బలుమృగకోలాహలములు
కలకలమనిరొదలొనర్చుఖగనివహంబు
ల్ఫలసుమభరితానోకహ
ములలరఁగ రాఘవుఁడుగాంచెమునివనమెనుటన్. ౧౯౭.

వ. ఇట్లు పొడగని యిమ్మహాపుణ్యాశ్రమం బే మహాత్ముని యధీనం బై
యొప్పు నెఱింగింపు మనిన విశ్వామిత్రుం డిట్లనియె. ౧౯౮.

మ. ఇనవంశోత్తమ తెల్పెదన్వినుముమున్నీశానుఁడీయాశ్రమం
బుననిష్ఠందపమాచరించుటయు వేఁబుష్పాస్త్రుఁడేతెంచి క్రొ
న్ననతూపుల్నిగిడించుచుండఁగనుమానాథుండుఁగ్రోధాగ్నిచేఁ
గనలంజూచినభస్మమైపడియెనక్కాలంబునందీయెడన్. ౧౯౯.

గీ. అంగజనిజాంగమిబ్భంగిఁద్రుంగుకతన
ధరణినంగాశ్రమంబనఁదనరెనిచట
మునిజనంబులునిర్విఘ్నముగఁదపంబుఁ
గోరియొనరించుచుందురుకువలయేశ. ౨౦౦.

వ. అని యిట్లు గాధేయుం డెఱింగించుచున్నంత నయ్యాశ్రమవాసు
లగు తాపసోత్తము లేతెంచి వారలం దోడ్కొని చని యుచితోప
చారంబులఁ దృప్తి నొందించుటయు నా రాత్రి యచ్చో విశ్రమించి
మఱునాఁటిప్రభాతంబునందు. ౨౦౧.

క. అంగాశ్రమంబుఁగడచియ
నంగనిభాంగులగుకొమరులమ్మునితోడ

న్గంగాసరయూద్వయమున్
సంగతమగుచోటుదాఁటిచనుచో నెదుటన్. ౨౦౨.

రాముఁడు తాటకను సంహరించుట.

క. ఘోరాకారంబునని
ద్ధారుణిగంపింపమానితతిభీతిల్లం
జేరన్వచ్చునిశాచరి
నారసిరఘువరుఁడువలికె నమ్మునితోడన్. ౨౦౩.

క. ఇయ్యంతియెవతె తలఁప
న్వెయ్యేనుఁగులంతలావువిపులోన్నతమై
యియ్యెడఁగన్పడుచున్నది
చయ్యనఁ దెల్పంగదయ్య సన్మునివర్యా. ౨౦౪.

వ. అనినం గౌశికుం డిట్లనియె. ౨౦౫.

సీ. అవనీశ వినుకేతుఁడనుయక్షపతిసుత
తాటకాభిఖ్యచేఁదనరునిదియు
సుందునిభార్యయైసుదతిమారీచసు
బాహులన్పుత్రులఁబడసిపిదపఁ
బతివియోగముఁ జెందసుతులును దానును
గస్త్యాశ్రమముఁ జేరిగర్వితముగ
మునులబాధింపనమ్మునిగోపమునశాప
మొసఁగినఘోరరాక్షసులుగాఁగ
వారలిద్దఱుమద్వ్యసవాటియందు
సవనమునమాంసరక్తముల్చల్లుచుందు
రివ్వనితయువ్వనంబుననివ్వటిల్లి
ప్రజలఁగారించునెప్పుడుఁబాపమనక. ౨౦౬.

క. కావున నిది వెలఁదియనం
గావలదనుమానము డిగి ఘనమగు శరము
న్వేవేగఁ దొడఁగి వేయుము
భూవర సత్కీర్తి యెంతయుఁ బొందుదు వనిన్. ౨౦౬.

వ. అనిన రాఘవుం డట్టహాసం బొనర్చి ధను వెక్కిడి గుణధ్వనిఁ గావించి ప్రత్యాలీఢపాదుండై నిలువంబడిన నా రక్కసియు నాకసంబు పగుల గర్జించుచు నాగ్రహోదగ్రయై యిరుకరంబుల శిలల నువ్వెచ్చుం బఱతేరఁ జండకాండద్వయంబునఁ దద్బాహుద్వయంబు రాముండు ఖండించుటయును. ౨౦౭.

గీ. లక్ష్మణుఁడు ఖడ్గమంకించి లావు మెఱసి
దనుజసతిముక్కు చెవులు ఖండనమొనర్చె
దశముఖుని సోదరిని బట్టి తడయకిటుల
చేయుదు నను చుసూచన చేసెననఁగ. ౨౦౮.

వ. అంత నా రక్కసి. ౨౧౦.

ఉ. మాయలఁ బన్ని రాముపయి మార్గణముల్గురియింప నాతఁడ
మ్మాయల సాయకంబులను మాయ మొనర్పఁగఁ గాంచియంత గా
థేయుఁడి దేల జాలమిఁక ధీరవరాగ్రణి సంధ్యలంమదై
తేయుల జేయుల ట్లగుట దీని వధింపుము ప్రొద్దు గ్రుంకెడిన్. ౨౧౧.

వ. అని యెఱింగించుటయును. ౨౧౨.

క. ధాటిగ రఘుకులవర్యుఁడు
హాటకగర్భోపమానుఁ డగు ముని యనున
మ్మాటకు జవదాటక యా
తాటకని లంగూల్చె ఘోరతర బాణమునన్. ౨౧౩.

వ. ఇట్లు దారుణం బగు రామభీమాస్త్రంబునఁ గులిశహతిం గూలుకుంభినీధరంబుభంగి మహాబీభత్సంబునం బడిన రక్కసిం గాంచి దేవేంద్రప్రభృతు లానందించి రంత. ౨౧౪.

గీ. ఇంతచిన్నబుడుతఁ డీ ఘోరరాక్షసి
నొక్కసాయకమున నుక్కడంచె
ననుచు మెచ్చికొనుచు నలరులసోనలు
గురిసి రమరవరులు గూర్మిమీఱ. ౨౧౫.

వ. ఆ సమయంబున. ౨౧౬.

క. నగవైరి దేవగంధ
ర్వగణంబులు గొల్వ వచ్చి వసుధాస్థలినా
జగతీశుని శ్రీరామునిఁ
దగుగతిఁ బూజించి గాధితనయున కనియెన్. ౨౧౭.

మ. మము రక్షించి సురాత్ములౌ దనుజులన్ మర్దించు పూనిక్కన్ త్రివి
క్రముఁడ రాకాన్వయదుగ్ధవార్ధిశశియై కన్పట్టె నీదివ్యమూ
ర్తి మనుష్యాకృతిఁ గానఁ గనిల్ల తనికిన్ ధీయుక్తిమై శస్త్రశ
స్త్రముల న్సాంగముగా నొసంగుము ప్రశస్తం బొప్ప మౌనీశ్వరా. ౨౧౮.

వ. అని బిడౌజుం డెఱింగించి చనియె. అంత నక్కౌశికుం డమితహర్షాంతరంగుండై రామలక్ష్మణులం గూడి యా రాత్రి యచ్చేరువనున్న తాపసాశ్రమంబున విశ్రమించి యమ్మఱునాఁడు శుచిస్నాతుండై యున్న రామభద్రుం గాంచి కరుణాయత్తచిత్తుండై. ౨౧౯.

సీ. అఖిలదివ్యాస్త్రశస్త్రావళిత సుసం
హారణముల్ తత్ప్రయోగాదివిధులు
తన్మంత్రసిద్ధులుఁ దప్పక నొసఁగిన
నన్నిటఁ బరిపూర్ణుఁ డగుచు నెదుట

నావిర్భవించునస్త్రాధిదేవతలను
    బనిగల్గిదలఁపరమ్మనుచుఁబనిచి
తానుసౌమిత్రియుఁదగుభక్తిమునిఁగొల్చి
    యవ్వలనొకకొంతదవ్వుచనియుఁ
జందనాగరుమందారసరళపనస
    చూతపున్నాగముఖధరాజాతములను
మధుగళితఫలసుమములమలయువనముఁ
    గాంచిరాముఁడుగాధేయుఁగాంచిపలికె. ౨౨౦.

క. సురపాదపములక్రియభా
    సురమగుతరుషండములనుజోద్యంబుగన
గ్గిరిచెంతఁదోఁచువనమె
    వ్వరియాశ్రమమెఱుఁగఁబల్కవలయుమహాత్మా. ౨౨౧.

క. అనిరాఘవుండువేఁడిన
    వినిగాధిసుతుండుమదినివేడ్కలొదవరా
మునిచెక్కునొక్కికౌఁగిటఁ
    గొనిదరహాసంబుతోడఁగూరిమిఁబలికెన్. ౨౨౨.

క. అనఘాత్మనీవెఱిఁగియెఱుఁ
    గనిక్రియనన్నడుగనేలక్రమ్మఱనాచే
వినఁగోరిగాదయైన
    న్వినిపించెదవినుముపూర్వవృత్తాంతంబున్. ౨౨౩.

వామన చరిత్రము.

సీ. బలిదానవుండుప్రబలదైత్యబలముతో
    బలభేదిముఖ్యదిక్పతులనోంచి

త్రైలోక్యసామ్రాజ్యతతులఁదాఁగైకొని
వాఱఁదోలఁగసురల్భయమునొంది
శౌరిఁగాంచిశరణన్ననతఁడదితికశ్య
పులకువామనుఁడనఁబుట్టిపెరిఁగి
బలిదైత్యుఁజేరిభూస్థలినిమూఁడడుగుల
నడిగిలోకత్రయమాక్రమించి
యమరనాథునకొసఁగిపొమ్మనుచుఁబనిచి
తానిచటబహుయుగములుతపమొనర్చెఁ
గ్రమమునసుగానవామనాశ్రమమనంగ
నొప్పునిప్పుణ్యవనమిటమెప్పుదనర. ౨౨౪.

క. సిద్ధముగనిందుఁదపములు
సిద్ధించుటవలననిదియుఁజిరకాలముగా
సిద్ధాశ్రమంబనంగఁబ్ర
సిద్ధంబైయొప్పునధికశివకరమగుచున్. ౨౨౫.

గీ. వామనుండైజనించినవనజనాభుఁ
డీవెకదనిక్కముగనిప్పుడెంచిచూడ
నినకులంబునశ్రీరాముఁడనఁగఁబుట్టి
మునులఁబాలింపవచ్చితివనఘచరిత. ౨౨౬.

క. నాఁడున్నీవనమిదిమఱి
నేఁడున్నీదయ్యెనటులనేనిచ్చోటం
గోడిమిమీఱఁగమునులం
గూడివసింతున్నృపాలకుంజరవింటే. ౨౨౭.

వ. అని విన్నవించి రామలక్ష్మణులం దోడ్కొని విశ్వామిత్రుండు స్వకీయం
బగు వామనాశ్రమంబుఁ జేరి యచ్చటిమునిజనంబులుం దాను నా

రాజకుమారులం బూజించి యుచితోపచారంబులం దృప్తి నొందించి పుణ్యకథావిశేషంబుల నా రాత్రి పుణ్యరాత్రిగా నొనర్చి రంత.

### విశ్వామిత్రుఁడు యాగ మొనర్చుట.

క. అమ్మఱునాఁడమ్మునివరుఁ
డమ్మనుజేంద్రుఁడగు రామునానతిఁగొనియ
జ్ఞమ్మొగిఁ జేయఁదొడంగెను
సమ్మదమున సకలమౌనిజనపరివృతుఁడై. ౨౨౯.

వ. ఇట్లు విశ్వామిత్రుండు సర్వసన్నాహంబున యజ్ఞదీక్ష వహించి శుభలగ్నంబున. ౨౩౦.

గీ. పవనకుండంబునందగ్ని సంఘటించి
క్రమమునను యాగపశుపలలములఁగొనియు
వేదమంత్రంబులను మునుల్వేల్చుటయును
ననలుఁడయ్యెడ సప్తార్చులను వెలింగె. ౨౩౧.

వ. అట్టి యవసరంబునందు. ౨౩౨.

ఉ. చండతరాసురాళిబలసంపదలం గొని మౌనియాగము
న్దండిగ నిర్వహింతుమని దాశరథుల్భుజదర్పమొప్పఁగో
దండము లెక్కుడింపక యతద్వనవాటిని రేవగుల్లహో
ద్దండతఁ గాచి రెంతయును దప్పక కంటికి ఱెప్పకైవడిన్. ౨౩౩.

వ. అంత దినదినప్రవర్ధమానంబై యాగంబు చెల్లుచుండుటయును.

క. ధీరత నాఱవనాఁడు మ
హారవముల దిశలు గలఁగ నసురభటులతో
మారీచసుబాహులతి
క్రూరులు చనుదెంచి మించి కోపస్ఫూర్తిన్. ౨౩౪.

గీ. ఆకసమునందునిల్చి మేఘార్భటులను
మాయచేయజ్ఞవాటినిమాంసరక్త
ములనుగురియింపనచ్చటిమునులుగలఁగి
రామరామాయనుచునార్తరవములిడఁగ. ౧౩౬.

క. అంబరమువగులగుణరా
వంబుజెలంగఁగనుదైత్యవర్యులమాయా
డంబరములణఁపఘోరశ
రంబులునిగిడించిరౌద్రరసముప్పొంగన్. ౧౩౭.

వ. మఱియును. ౧౩౮.

క. ఘనతరనాయవ్యశరం
బనఘుఁడురాఘవుఁడువంపనయ్యస్త్రముచ
య్యనమారీచునిశతయో
జనములుగొనిచనియులవణజలనిధివైచెన్. ౧౩౯.

వ. అప్పుడు. ౧౪౦.

మ. ఒకభంగిన్దరిఁజేరిరాత్రిచరుఁడో హో రాఘవుం డెన్న నిం
చుకబాలుండితఁడెంత బాహుబలుఁడీశూరుండ జేయుండునా
కిఁకనేలాబలవద్విరోధమనితా నెంతేవిరక్తింబమో
ధికడందాపసవృత్తిఁబూనినిలిచెన్ధీమంతుఁడైయంతటన్. ౧౪౧.

మ. అనలాస్త్రంబరివ్రాసికోపయుతతాబ్రహ్మాస్త్రంబులున్బ్రజ్వరి
ల్లనభోమార్గముఁగాంచిదైత్యునిపయిన్లక్ష్యంబుసంధించిచ
య్యనసయ్యర్కకులుండువ్రేయుటయుఘోరాకారమైమండిత
ద్ఘనబాణంబుమిడుంగురుల్సెదరవక్షంబుచ్చిపోఁదాఁకఁగన్. ౧౪౨.

క. ఖ్యాతంబగురామశరా
ఘాతంబుననోర్వలేకగతజీవుండై

భూతలము ద్రువఁగనశనిని
పాతముక్రియఁ గూలె నాసుబాహుఁడు రువడిన్. ౨౪౩.

క. తక్కినదనుజబలంబుల
నొక్కమొగి న్లక్ష్మణుండు నుగ్రాశుగము
ల్పెక్కడరించి హరించె
న్జక్కటిమునిజనములెల్ల సంతసమందన్. ౨౪౪.

వ. అయ్యవసరంబున. ౨౪౫.

క. అమరులు సుమవర్షంబుల
నమితంబుగఁ గురియఁ దోడఁ గిరమ్యోడఁ గలసం
యములుఁ బ్రియమలరఁగా రా
క్షామనులఁ గొనియాడి రంతగుసుసత్త్వలుగాన్. ౨౪౬.

వ. అంత. ౨౪౭.

గీ. విశదకీర్తులమఖమునిర్విఘ్నముగనొ
నర్చియవభృథమందియానరవరులను
దగుతెఱంగులఁబూజించి దయఁదలంచి
తేజరిల్లుచునుండెగాధేయుఁడపుడు. ౨౪౮.

వ. అంత రామభద్రుండు ముకుళితకరకమలుండై పని యెయ్యది యాన తిమ్మనిన విశ్వామిత్రుం డిట్లనియె. ౨౪౯.

గీ. జనకభూపాలుఁడొనరించుజన్నమునకు
మనముఁబోఁదగునదిగాక మారహరుని
ధనువుపూజార్హమగుచు నాతనిగృహమునఁ
దనరు నెక్కిడ నెవరికిఁ దరముగాక. ౨౫౦.

వ. అమ్మహాకోదండం బెక్కిడఁ జాలక దేవగంధర్వ నృపాలగణంబులు విఫలప్రయత్నులై చని రది గాన మీరలుం గనుంగొనవలయునని

పల్కి గాధేయుండు రామలక్ష్మణులం దోడ్కొని మునిగణపరి
వృతుండై మిథిలానగరమార్గంబుఁ బట్టి చని చని. ౨౫౧.

క. శోణనదీతీరమునఁబు
రాణశ్రవణములనాఁటిరాత్రిఁ గడపి యా
క్షోణీశసుతులు మునులుఁ బ్ర
యాణంబై మఱుదినమునన న్వేలఁ జనుచుం. ౨౫౨.

మ. కనిరంభోధిసమానవైఖరినసంఖ్యాతాండజశ్రేణితో
ఘనసారామ్లకపిత్థముఖ్యకుజసంఘాతాత్తతీరంబుతో
వనజాతోత్పలగంధచారిమధులిడ్వారావస్ఫూర్తితో
ఘనఫేనద్యుతితో వెలుంగు సురగంగన్వ్యాపథంగం దగన్. ౨౫౩.

గీ. కనితదీయమహత్త్వవైఖరికి మెచ్చి
యందఱుచ్చోటవిడిసి మాధ్యాహ్నికంబు
సలిపి భోజ్యాళిఁ దృప్తులై వెలయ నపుడు
గాధితనయుండు రామునిఁ గాంచి పలికె. ౨౫౪.

గీ. రామ రవికులజుండు భగీరథుండు మున్ను
కమలజుని వేఁడి హరిపాదకమలజాత
యైనయీగంగ నవనికి నమరఁ దెచ్చె
నగుట భాగీరథియనంగ నమరుచుండు. ౨౫౫.

క. అనవిని రాఘవుఁ డిట్లను
ననఘ భగీరథుఁడు పూర్వమబ్జజుఁ జేసి
జనపావనియగు గంగం
గొని దేరం గార్యమేమొకో తెల్పఁ దగున్. ౨౫౬.

వ. అనినఁ గౌశికుండు రాఘవున కిట్లనియె. ౨౫౭.

విశ్వామిత్త్రుండు రామునకు గంగామాహాత్మ్యంబు సెప్పుట.

సీ. వసుమతీనాథయిక్ష్వాకువంశంబున
  నమితతేజోనిధియైనయట్టి
సగరమహీపతిజన్నంబొనర్పఁగా
  మించిసైంధవముఁబూజించివిడిచి
తత్పాలనమునకై తనసుతులఱువది
  వేవురుసగరులవెనుకఁబనుప
వారినంచి యయ్యాసన్రుఁడశ్వంబుఁ
  గొనిచనిపాతాళకుహరమునను
గపిలమునివెనుకనుదాఁచికదలిచనఁగఁ
  బోగిలితురగంబుగానమిసగరసుతులు
ధరణిపైనెల్లదిశలనుదప్పకరసి
  మఱిరసాతలమునకేగమదిఁదలంచి. ౨౫౮.

చ. ఒకరొకయోజనాయతమునొప్పఁగభూస్థలినాల్గుదిక్కులం
బ్రకటభుజాబలంబెసఁగ బాగుగఁద్రవ్వుచునంతఁగల్గుమ్రొ
క్కనశనంబుగాఁగొనియుదీర్ణతనేగిరసాతలంబున
న్సకలముఁగాంచుచుండమునిసత్తముఁడొకపిలుండుదోఁచినన్. ౨౫౯.

క. అందఱుఁజనియస్థానిపి
  జుందద్దురగంబుఁజూచికోసిమనహాయం
బిందేలఁదెచ్చెమ్రుచ్చిలి
  పందతనంబునను వీఁడుభయవిరహితుఁడై. ౨౬౦

క. అనిపల్కుచుఁగ్రోధంబున
  జననాథాత్మజులుగపిలసంయమిఁగదియు

స్మునికులపతివారలఁదన
కనుఁగొనలందగ్నులొలుకఁగానవ్వేళన్. ౨౬౧.

క. చుఱచుఱఁజూచుడుభగ్గున
మఱిమఱిమండుచునుసగరమహీపతనయుల
త్తెఱఁగుననిలిచినయట్లనె
యఱువదివేవురునుభస్మమైకూలిరిలన్. ౨౬౨.

వ. అంత సగరమహీపాలుం డశ్వంబు రాకకుం దడ వగుటయు నిజాగ్ర తనయుం డగునసమంజసునినందనుం డంశుమంతుం డనువానిం జీరి ధరణీతలంబున నెల్లడలం బరికించి యశ్వంబునుం దత్పాలకులగు నఱువదివేలసగరులం దోడ్తెమ్మని పంచిన. ౨౬౩.

క. చతురంగబలములనుగొని
మతిమంతుండైనయంశుమంతుఁడుసనియీ
క్షితిపైనిసగరతనయులఁ
గతిపయదినములనువెదకికానఁగలేమిన్. ౨౬౪.

క. సగరులుద్రవ్వినజాడం
దగనెఱిఁగియుసంయుఁజొచ్చితన్మార్గమున
న్నిగిపాతాళంబునని
మ్ముగఁదురగముతోడఁగపిలమునివరుఁగనియెన్. ౨౬౫.

వ. ఇట్లు కపిలునిం గని తత్సమీపస్థంబగు నఱువదివేలసగరులభస్మ రాసుల నాలోకించి యంశుమంతుండు వార లమ్మహామునికోపానలం బున నట్లగుటగా నెఱింగి దుఃఖించుచు వారల కుదకప్రదానం బొసంగం దలంచి యచ్చో జలంబులుం గానమికి నత్యంతచింతా కులితస్వాంతుండై యుండుతఱి నయ్యెడకు వైనతేయుం డరుదెంచి సాక్షాత్కరించుటయు రాజనందనుం డతనికి సాష్టాంగనమస్కృతు

లొనర్చి బద్ధాంజలియై నిలువంబడిన నా భూపకుమారువినయవిధే
యంబులకు సంతసిల్లి యగ్గరుడుం డిట్లనియె. ౨౬౬.

క. జనవరసూనభవన్నిజ
జనకులుమునికోపవహ్నిసమిధలై లో
కనివాసంబొనరించెద
రనఘాతురగంబుఁగొనుచునరుగుముపురికిన్. ౨౬౭.

క. అనవినిసగరమహీపతి
మనుమఁడునిట్లనియెనయ్యమజ్జనకులకే
యనువుననాకపథముగ
గ్గునుదద్విధమానతిమ్ముకుతుకంబలరన్. ౨౬౮.

వ. అనిన సుపర్ణుం డిట్లనియె. ౨౬౯.

క. హిమవన్నగేంద్రసుతలై
క్రమమునజన్మించిరమలగంగయుగౌరీ
రమణియునందగ్రజన
య్యమరులుగొనిచనిరిదివికినధ్వరమునకై. ౨౭౦.

గీ. అమరులనువేడియాగంగనబ్జభవుఁడు
నిజకమండలమునఁబ్రేమనిల్పెనంత
హరిత్రివిక్రముఁడైకొ చరణమెలమి
సత్యలోకంబుదాఁకఁగాఁజూచుటయును. ౨౭౧.

గీ. పద్మభవుఁడుశౌరిపాదంబుఁదనకమం
డలుజలమునఁగడుగనలజలంబు
విష్ణుపాదమహిమవిలసిల్లెమందాకి
నియననాదితేయనిలయమునను. ౨౭౨.

వ. కావున. ౨౭౩.

గీ. అంబుజోద్భవుఁగూర్చితపంబొనర్చి
తత్కరుణనాకపథమునఁదనరుగంగ
నిటకుఁగొనివచ్చిభస్మంబులెల్లఁదడుప
నప్పుడరిగెదరరయవీరమరపురికి. ౨౭౪.

వ. కావున నట్లొనర్పం జను మనుటయు నంశుమంతుం డమ్మహాత్ముం డగు గరుడునకు వలగొని మ్రొక్కి వీడ్కొని యశ్వంబుఁ జేకొని సగరమహీపాలునికడకుం జని తద్వృత్తాంతం బంతయు విన్నవించిన నతండు నిజపుత్రసందోహవినిహతంబునకుఁ జింతిల్లి హయమేధంబు సాంగం బొనర్చి వనంబుఁ జేరి కమలభవు నుద్దేశించి త్రింశత్సహస్రాబ్దంబు లతిఘోరతపం బొనర్చి కాలంబు సన్నిహితం బగుటయు మృతుం డయ్యె నంత. ౨౭౫.

గీ. అతనిపౌత్రుఁడుసుగుణుఁడయ్యంశుమంతుఁ
డతులితంబగునిష్ఠచేసజునిఁగూర్చి
విపినముననిల్చిముప్పదివేలవత్స
రంబులుదపంబొనర్చినాకంబుఁజెందె. ౧౭౬.

క. అప్పార్థివసూనుండై
యొప్పుదిలీపావనీశుఁడొగిఁబరమేష్ఠిం
దప్పకమదినిడితపము
న్ముప్పదివేలేండ్లుసలిపిముక్తిఁజెందెన్. ౨౭౭.

భగీరథుండు గంగను దెచ్చుట.

గీ. అలదిలీపతనూభవుండమితసుగుణ
శాలియైనభగీరథక్ష్మావరుండు

గోరిపదివేలవర్షముల్ఘోరతపము
    సలుపనంభోజభవుఁడుసాక్షాత్కరించె. ౨౪౮.

మ. చతురాస్యుం డెదుటంగనంబడ నిజస్వాంతంబునం బొంగి సం
స్తుతిఁ గావించి భగీరథుండనియె నోసుశ్లోక వాణీశ మా
పితరుల్నాకపథంబునొందుటకునై ప్రీతింద్వదీయాజ్ఞవ
ర్థితయాగంగనొసంగిప్రోవుమిపుడేధీరాత్మనిన్వేఁడెదన్. ౨౪౯.

చ. అనుచుభగీరథుండడుగ సత్యనురాగమునన్పితామహుం
డనియెనృపాత్మజన్మవినుమద్భుతవిక్రముఁడైనయాత్రిలో
చనుఁడొకఁడీమహాకలుషసంఘవినాశనియైవెలుంగుగం
గనుభరియింపశక్తుఁడగుఁగావుననాతనివేఁడిచెచ్చెరన్. ౨౫౦.

క. జడదారిదారిగావెం
    బడిఁగొనిచనుమనుచుఁదెల్పిపద్మభవుండ
య్యెడమందాకినితోడ
    న్పుడమీశునికోర్కిఁదీర్పఁబొమ్మనిమత్రియున్. ౨౫౧.

గీ. అలభగీరథభూపాలుఁడడిగినట్టి
    తనయులనొసంగిపుచ్చివిధాతయంత
నిజనివాసంబుఁజేరెనానృపవరుండు
    భవునిమదినెంచిఘోరతపంబొనర్చె. ౨౫౨.

ఉ. ఆకుతలేశుఁడట్లుతపమద్భుతభంగినొనర్పశూలిమం
దాకినిఁదెమ్ముపొమ్ముప్రమదమ్ములదారభరింతునంచన
న్యాకటభక్తిఁదత్పదముఫాలముసోఁకనమస్కరించివి
న్వాఁకనెదందలంచినృపవర్యుఁడువేఁడఁగనాక్షణంబునన్. ౨౫3.

గీ. పద్మభవుఁడువంపఁబాతాళమునకేగ
    సకలదిశలుసెదరజగములదర

నభమువగులఘోషణములనుప్పొంగుచు
దివమువెడలివచ్చెదివిజగంగ. ౨౮౪.

చ. బలురభసంబుతోఁ గగనభాగమునుండి ప్రవాహమిట్లు రా
నలిగియుమాధవుండు జడలంబరమెల్లను గప్పి తన్నది
న్వలువిడిఁ గట్టివైచుట యుభర్గజటాటవియందుఁ బాయకే
మెలఁగుమృగంబు పోయనఁగ మిన్నక కన్పడఁ గాంచియుంతటన్. ౨౮౫.

క. అచ్చెరువందిభగీరథుఁడ
చ్చేరువకరిగిమారహరుఁ బ్రార్థింప
న్మెచ్చియతఁడప్పుడొకజడ
విచ్చియువిడిచెన్నప్రాలు వెనుజనుమనుచున్. ౨౮౬.

వ. ఇవ్విధంబున ఖండపరశుజటామండలంబు వెడలి నిజదివ్యదృష్టిఁ బా
తాళంబున నిల్పి కపిలమహర్షికి వెఱచుచుఁ బఱతెంచు నవ్వాహిని
యందు. ౨౮౭.

క. సకలజ్ఞుండగునిన్నుఁ జె
నకినఖలులఁ బ్రోవఁబూనునాపైఁ గోపిం
పకుమనిమునికింగరములు
ముకుళించెననంగఁ బద్మముకుళములొప్పెన్. ౨౮౮.

క. మముఁ బాఱఁదోలునిఁకనీ
యమరాపగయెంచుఁ బోనుమని సగరులపా
పములభవు వేడఁజనెనన
భ్రమరములభ్రమునకెగసెఁ బటురయమమరన్. ౨౮౯.

క. కడుఁగోపికపిలుఁడాతనిఁ
బొసఁగానఁగ నచటికెట్లుపోదుననుచుఁదా

సుడివడితిరుగఁదొడఁగెనా
సుడులొప్పెన్దోయములనుసురుచిరభంగిన్. ౨౯౦.

గీ. మృదునిజడలవిడువఁబడిపుడమికివేగు
గంగకర్కతీక్ష్ణకరముసోఁకు
ననుచుఁగొడుగులమరులందందనిడిరొకో
యనఁగనంచలెగిరియాడఁదొడఁగె. ౨౯౧.

క. ఇలఁబుణ్యాత్ములసత్కీ
ర్తులకున్సరియగుచుఁబరనదులనపయశము
ల్గలయఁగనుంగొనిమఱికల
కలనగుడిండీరమాలికలువిలసిల్లెన్. ౨౯౨.

క. బలుకనులతోడధరణీ
తలమెల్లన్వెదకఁగాంచుతలఁపొందెనన
స్ఫులసితఘుస్కనమెఱయుచు
జలములయందమితమీనజాలములమరెన్. ౨౯౩.

వ. ఇట్లొప్పిదం బగునప్పుణ్యవాహిని యప్పటప్పటికిం బెనుఘోషణం
బుల నుప్పొంగుచు బ్రహ్మాండభాండంబు బ్రద్దలువాఱఁ బెల్లుబ్బుచుం
బఱతెంచి బిందుసరంబను సరసిం జొచ్చి సప్తప్రవాహంబులై పాఱె.
అందుఁ బావనియు హ్లాదినియు నలినియు ననుత్రయంబును బూర్వ
దిశకుం జనియె. శీతలయుఁ జక్షువును సింధువు నను ముయ్యేఱులు
పడమటిదిశ కరిగె. తక్కిన యొక్కటియు శరదభ్రవిభ్రమంబు దోఁప
భగీరథుని వెన్నాడి భూతలంబునకుం డిగి మహోర్పాటంబున వాటం
బగు నగంబుల నిరాఘాటంబున భేదించుచుం జనుచుండ నాత్రోవ
యందు. ౨౯౪.

క. మునిపతిజహ్నుఁడొనర్చిన
వనమునసంభారమెల్లవఱదంబోవ
ఘనకోపమెత్తియాపో
శనముగఁదన్నదినిఁగ్రోలెఁజయ్యననతఁడున్. ౨౯౫.

క. అంతభగీరథుఁడడిగని
యెంతటిపెనుభూతమొక్కొ యుట్టిప్రవాహం
బింతైనఁగాదవలేకయ
పంతంబునఁద్రావెనీతపసియేమందున్. ౨౯౬.

గీ. అనుచుఁజింతించిమదినిధైర్యంబుఁబెంచి
యంజలిఘటించిసాష్టాంగమాచరించి
బహువిధంబులఁబూజించిప్రస్తుతించి
పలికెనమ్మానివర్యుతోభక్తిదోఁప. ౨౯౭.

శా. అయ్యామౌనికులాగ్రగణ్యవినుమేనంభోజసంభూతుచే
నెయ్యంబొప్పఁగనీవియచ్చరనదిన్నిక్కంబుగైకొంటినా
కుయ్యాలించిరసాతలంబునకువేఁగొంపోవఁగానమ్మిక
న్నయ్యేలాశరణాగతుండనగునన్వీక్షించిరక్షింపవే. ౨౯౮.

వ. అని యనేకవిధంబుల స్తవం బొనర్చుచున్న యప్పుడు. ౨౯౯.

క. ఉమిసినఎంగిలనిధరా
రమణునిమన్నించికర్ణరంధ్రంబునన
య్యమరనదివిడిచిపుచ్చె
న్గ్రమమునజహ్నుండుమౌనిగణములుపొగడన్. 300.

వ. ఇట్లమ్మహానుభావుం డగుజహ్నుమునివర్యుగర్భంబునం జొచ్చి వెడలుటం జేసి జాహ్నవి యను పేరం బరఁగి య ప్పుణ్యవాహిని మహీతలం బ్రదువ ఘోరనిర్ఘోషణంబులు సెలంగించుచుం జను నెడ

నష్టద్రవ్యలాభంబు నొందినతెఱంగున నంతరంగంబున నుప్పొం
గుచు దివ్యరథారూఢుండై భగీరథుండు మున్నరుగుచుండ దేవ
గంధర్వసిద్ధవిద్యాధరాదులు గాంచనమణిస్థగితవైమానికులై తద్వై
భవంబున కానందించుచుఁ బఱతేరం జని చని సాగరంబుఁ జొచ్చి
రసాతలంబునం గ్రుమ్మరి యా ప్రవాహంబు సగరనందనులభస్మ
రాసులం దడిపె నా సమయంబున. ౩౦౧.

మ. దివిజాధీశముఖాష్టదిగ్వరులు ప్రీతిం గొల్వ వేదోక్తసం
స్తవముల్ సేయుచుఁ గానిసంఘములు పిఱుందన్వారులై రాఁగ వై
భవము పొంగఁగ నంచ నెక్కి బుధసంభావ్యుండు నీరేజసం
భవుఁడే తెంచె నృపాలుపాలికి సుహృద్భావంబు దోఁపంబుగాన్. ౩౦౨.

వ. ఇట్లు సాక్షాత్కరించుటయును. ౩౦౩.

క. నిటలతటఘటితకరుఁడై
పటుభక్తి భగీరథుండు పద్మభవుని సం
స్ఫుటవాక్యంబుల నుతియిం
చుటయు నతం డా దిలీపసూనున కనియెన్. ౩౦౪.

గీ. సగరుఁ డంశుమంతజననాథుఁడు దిలీపుఁ
డమరఁ దప మొనర్చియు మరగంగఁ
బడయఁజాలరైరి పటుశక్తిఁ గైకొంటి
వరయ నీదుకీర్తు లవని నించె ౩౦౫.

క. ఇప్పుణ్యనదిని దడిసిన
యప్పుడె భవదీయపితరు లఘుదూరులుగా
నొప్పి సుగతికే గెదరది
చెప్పెడిదే మొఱిఁగెదీవె సిద్ధము గాఁగన్. ౩౦౬.

క. ఇదిమొదలుగనీగంగా
నదిభాగీరథియటంచునరులునుతింప
న్నదమలకీర్తిస్ఫూర్తిం
బొదలుంగలుషఘ్నయగుచుభువనములందున్. ౩౦౭.

క. పంచమహాపాతకములు
సంచితకర్మంబులల్పసాంగత్యకృతో
దంచితదురితచయములో
క్కించుకమిగులంగఁగలదెయున్నదిఁగ్రుంకన్. ౩౦౮.

ఉ. భాసురలీలయీభువనపావనియౌసురగంగనింపుగా
స్నానమొనర్చిమీపితృగణంబులకెల్లఁదిలోదకంబులం
బూనియొసంగిమోదమునఁబొమ్మపురంబునకంచుఁదెల్పియున్
దానరిగెన్బితామహుఁడుదాపసవర్గములెల్లఁగొల్వఁగన్. ౩౦౯.

వ. అంత భగీరథుండు భాగీరథియందుఁ గృతస్నానుండై పితృగణంబులకుఁ దిలోదకాదివిధు లాచరించుటయుఁ దత్పితరు లఱువదివేవురు దివ్యవిమానారూఢులై యాశీర్వదించి త్రిదివంబున కరిగి రయ్యవనీశ్వరుండును సఫలమనోరథుండై నిజరాజధానియగు సాకేతపురంబునకుం జని సుఖంబుండె నని చెప్పినఁ గౌశికుం గాంచి రామభద్రుం డిట్లనియె. ౩౧౦.

క. మునినాథభవదనుగ్రహ
ముననీగంగావతారమునెఱింగినయం
తనెపాసెనిఖిలదురితము
లనఘుండైయెప్పెఁజూడనస్మత్కులమున్. ౩౧౧.

క. అనిరాఘవుండునచ్చటి
మునులుంగౌశికునిఁబొగడిముదమునఁదద్వా

హీని చెంతనాటి రేయె
    ల్లను వేడ్కన్ విశ్రమించి రవి పొడముటయు౯. ౩౧౨.

గీ. జాహ్నవిని గ్రుంకి సంధ్యాదిసత్క్రియలను
    క్రమమున నొనర్చి యందఱుఁ గదలి యవల
నల విశాలపురంబునకతిదూర
    మునను రాఁ గౌశికాగమమును నెఱింగి. ౩౧౩.

ఉ. ఆనగరీశుఁడౌ సుమతి హర్షము చే నెదురేగి యమ్మహా
మౌని బిడౌజముఖ్యులను మన్ననఁ గాంచి నమస్కరించి యా
భానుకులప్రసూతుల ప్రభావములన్నియు మెచ్చి యందఱ
న్వాని నిజాలయంబునకుఁ బొందుగఁ దోడ్కొనిపోయి యచ్చట౯.

గీ. తగు తెఱంగులఁ బూజింపఁ దద్గృహమునఁ
    గూర్మి నా రాత్రిఁ గడపి వేకువను లేచి
యమ్మహీపాలు వీడ్కొని యతఁడువనుపఁ
    గౌశికాదులు నచ్చోటు గదలి యపుడు. ౩౧౪.

అహల్యాశాపవిమోచనము.

సీ. వనములు నదులును వరనగేంద్రంబులు
    పుణ్యాశ్రమంబులు పుణ్యభూము
లలవడఁ గాదాఁటి యరుగుచో గౌతమా
    శ్రమమున నొక్క పాషాణమపుడు
రాముని నిజపాదరాజీవసంస్పర్శ
    నంబున నత్యద్భుతంబుగాఁగ
మేఘనిర్ముక్తమౌ మెఱుఁగుతీఁగెయుఁబోలె
    నాతియై నిల్వ నన్నరవరుండు

నచ్చెరువునొందిపదిమెచ్చియందె నిలిచి
కౌశికునిఁగాంచిపల్కెనోఘనమునీంద్ర
యిమ్మహాశిలమగువయైయిచటఁదోఁపఁ
గారణం బేమి తెల్పుము కరుణతోడ. ౩౧౬.

వ. అనిన విశ్వామిత్రుం డిట్లనియె. ౩౧౭.

సీ. గౌతమమునివర్యునాతియహల్యయీ
కాంతయేకాంతయైసంతసమున
నింద్రుఁగూడఁగఁదాపసేంద్రుఁడు దెలిసిపా
షాణంబవగుమనిశాపమొసఁగె
నంతమెయ్యేదియనియడల శ్రీరాముని
యడుగుసోఁకఁగఁదీఱునను చుఁబల్కె
నారీతిఘోరశిలారూపమునునుండి
నేఁడుభవత్పాదనీరజమునఁ
దద్విమోచనమైయొప్పెఁదరుణిగాఁగ
ననుచుఁదెలుపంగ గౌతముఁడరుగుదెంచి
రాముఁబూజించిసుదతీలలామయౌన
హల్యఁదోడ్కొనిచనియెనుహర్షమొప్ప. ౩౧౮.

వ. ఇట్లు రామభద్రుం డహల్యాశాపవిమోచనం బొనరించుటయుఁ దన్మహానుభావం బగ్గించుచు విశ్వామిత్రాదిమహర్షిసంఘంబు లమ్మనుజాధీశసూనులం దోడ్కొని యవ్వలం జని. ౩౧౯.

విశ్వామిత్రుండు రామలక్ష్మణసహితంబుగా మిథిలాపురప్రవేశం బొనర్చుట.

లయగ్రాహి. ఖమ్మొఱయునప్రములుఁగొమ్మలునుగొత్తళము
లిమ్మొనవుమేడలుఁదిరమ్ముగుగృహమ్ము

ల్గుర్విమ్ములురథమ్ములుగజమ్ములుహయమ్ములుసి
డెమ్ములుసమమ్ములుగ నెమ్మిగనుపేట
ఘ్లమ్మనుచువాసిలుసుమమ్ములవనమ్ములమి
తమ్ముగసదా వెలయుతమ్ములకొలంకు
ల్గ్రిమ్ముమిథిలాపురవరమ్ముఁబొడఁగాంచిరి
ముదమ్ములరసమ్ములుసమ్మునకు లేశుల్. ౩౨౦.

వ. ఇట్లు పొడగని యానందించుచు. ౩౨౧.

శా. నానాబంగరునృపాలసంఘములతో నానాసుహృత్పఙ్క్తితో
నానాదేశనివాసభూసురులతో నానామునీంద్రాళితో
నానావేదనితాంత ఘోషములతో సవ్యాహుతిశ్రేణితో
నానాదంబగుయజ్ఞవాటికటుడాయం బోవఁగానప్పుడున్. ౩౨౨.

క. జనకధరాధిపుఁడెదురుగఁ
జనుదెంచి జోహారొనర్చి సంభ్రమ మొప్ప
న్మునివరులఁదోడుకొనిచని
వినయంబున నర్ఘ్యపాద్యవిధిఁబూజించెన్. ౩౨౩.

వ. ఇట్లర్ఘ్యాసనంబుల నునిచి యుచితసత్కారంబు లొనర్చి కుశల ప్రశ్నంబు లడిగి య మ్మునిమండలాధిపుఁ డగువిశ్వామిత్రునండ నుండు వేదండతుండోపమానదోర్దండమండితకోదండు లగురాజ కుమారులం గని జనకుం డి ట్లనియె. ౩౨౪.

మ. రవిజైవాతృకులంబరస్థలమునన్రక్షోభయభ్రాంతులై
భవదాధీనముఁగోరి చేరిరొ యనన్భాసిల్లుచున్నట్టి యీ
భువనాధీశ్వరులీధనుర్ధరులు సీఫుల్లాబ్జపత్రేక్షణు
ల్భువినేరాజకుమారవర్యులెఱుఁగన్బ్రహ్మాత్మ తెల్పంగదే. ౩౨౫.

వ. అనిన విశ్వామిత్రుం డి ట్లనియె. ౩౨౬.

సీ. ధరణీశ వినుమయోధ్యాపురాధీశుఁడౌ
దశరథుతనయులీ ధన్యమతులు
రామలక్ష్మణులను నామధేయులు వీరు
మత్ప్రార్థనీయులై మఖముఁ గనఁగఁ
జనుదెంచి తాటకిఁ జమయించి మారీచుఁ
బాఱఁద్రోలి యనుసుబాహు నణఁచి
యస్మత్కృతంబగు హవనంబు రక్షించి
యుష్మద్గృహంబున నున్న యట్టి
హరశరాసనంబున్ద్రిలిఁ బొడఁగాన
వచ్చువోట రాము వసుమతీశ
పాదరజము సోఁకి పాషాణభావంబు
మాని యా యహల్య మగువ యయ్యె. 3౨౭.

క. ఈ రాఘవుని ప్రభావం
బేరీతిం బొగడ నేర్తు నిల్పైనితఁడా
ఘోరాసురారి యగు శ్రీ
నారాయణుఁడనఁగ నొప్పు నరవర వింటే. 3౨౮.

వ. అని యిట్లు విశ్వామిత్రుం డెఱింగించుచున్న యవసరంబున జనక రాజపురోహితుండు నహల్యానందనుండు నగు శతానందుం డమితా నందంబున్నై హర్షాశ్రుకణంబు లొలుక నమ్మునివరుం డగుగాధేయున కిట్లనియె. 3౨౯.

మ. మునినాథాగ్రణి యీ రఘూద్వహుని సమ్మోదంబునం దెచ్చి మ
జ్జననీశాపముఁ బాపి గౌతమునకున్ సంప్రీతిఁ గావించితో
వనఘాత్ముండవు నీకృతంబునను నేఁ డస్మత్కులం బెల్లఁ బా
వనమయ్యెన్ రఘురాము పాదయుగసేవం ధన్యతం జెందితిన్. 330.

వ. అని యగ్గించి రామభద్రు నుద్దేశించి శతానందుం డిట్లనియె.

క. కాకుత్స్థాన్వయజలనిధి
రాకాకోకనదచంద్ర రామనరేంద్రా
యీకౌశికుండుగురుఁడట
యేకరణిన్నీదుభాగ్యమెన్నందరమే. 33౨.

క. క్షితితలమునందునీయతి
పతిచారిత్రంబుమిగులభావింపఁగన
ద్భుతకరముగానదియు
న్హితమతినెఱిఁగింతుఁదెలియుమినకులతిలకా. 333.

విశ్వామిత్రుని చరిత్రము.

క. పంకజభవునకుసుతుఁడై
శంకరనిభుఁడగుచుఁగుశుఁడుజనసంబందె
న్బ్యాంకముగవినుముశత్రుభ
యంకరకుశనాభుఁడతనికాత్మజుఁడయ్యెన్. 33౪.

క. అలకుశనాభనృపాలున
కలరారఁగగాధిపుట్టెనమ్మహితునకు
న్దలిరులవిల్తునికైవడి
నిలవిశ్వామిత్రుఁడనఁగనితఁడుదయించెన్. 33౫.

ఉ. ఈకుశవంశపావనుఁడహీనపరాక్రమమొప్పభూస్థలిం
బాకవిరోధిభంగిఁదగఁబాలనచేయుచునుండియొక్కనాఁ
డేకమనంబునన్వనికినేగఁదలంచిరథాధిరూఢుఁడై
మూకలుగట్టికాల్బలముముందటఁగొల్వఁగఁబోయియంతటన్. 33౬.

క. వనమునఁబడివేటాడుచుఁ
బనివడిమృగగణముఁగూల్చిబడలికతోడ

స్మునివర్యుఁడగువసిష్ఠుని
    ఘనమగునాశ్రమముఁ జేరికమభక్తి మెయిన్. ౩౩౭.

క. అమ్మునివర్యునిపదప
    ద్మమ్ములకుం బ్రియముతో నితఁడు ప్రణమిల్ల
న్నమ్మునియర్ఘ్యాసనముల
    సమ్మతిఁ గూర్చుండఁబనిచి యయ్యనఘుఁడున్. ౩౩౮.

గీ. మధురసస్వాదుభరితమామంచిఫలము
    లొసఁగఁగైకొని సంతోష మెసఁగ నితఁ
డమ్మహామునివర్యునియానసంబుఁ
    గాంచి వినయంబుతను విన్నవించె నిట్లు. ౩౩౯.

క. అనఘ మీతపంబులగ్ని హోత్రంబులు
    జరుగుచున్న యవియె సకలమౌని
సంఘములకు శిష్యసమితికి సర్వసౌ
    ఖ్యంబులబ్బునే ముదంబులొంద. ౩౪౦.

ఉ. నా విని మౌని బల్కె నరనాయక నీకృప నెల్ల సౌఖ్యము
ల్వేవిధ మొప్పఁగాఁ గలదు వీరులు నీ సుతనూజులు న్హితు
ల్నీవును బాంధవుల్భటులు నెమ్మది నుందురె రాజ్యతంత్రము
ల్భావమునందు నిల్పి పరిపాలన చేయుదె నీతితో డుతన్. ౩౪౧.

వ. అనిన నిక్ష్వాకు శిఖుం డమ్మునివరుం గాంచి మహాత్మా! భవదనుగ్రహం బునం జేసి సర్వశుభంబులుం గల వనుటయు, నతండు రాజేంద్రా! యుష్మద్దర్శనం బలభ్యంబు గావున నేఁడు మదీయాశ్రమంబున విందారగించి విచ్చేయునది యని పల్కి హోమధేనువుం బిలిచి విశ్వామిత్రప్రముఖనిఖిలబలంబుల కెల్లఁ దృప్తికరం బగునట్లు భోజనంబు వెట్టు మని యాజ్ఞాపించుటయు నల్లేయని యా ధేను వప్పుడు.

సీ. పరమాన్నములుమంచిశాకములుభక్ష్యము
    లక్కలవంటకములూరుగాయలమిత
ఫలవిశేషంబులుపాయసములుజీని
    చక్కెరలుక్కెరలెక్కువైన
సద్యోఘృతంబులుచారులంబళ్లను
    మద్యవిశేషముల్మాంసతతులు
మొదలుగానింతైనఁగొదవలేకయమర్చ
    నాధేనుమహిమకుఁగాధిసూనుఁ
డచ్చెరువునొందినైజభటాళిఁగూడి
    యలరుచునుదృప్తిమీఱవిందారగించి
మెన్ని తెఱఁగులనీధేనువేనుగొందు
    ననుచుమదినెంచిమునిఁగనియనియెనిట్లు. ౩౮౩.

క. మునివరలక్షలకొలఁదిం
    ధనములధేనువులనిచ్చెదనునాకీగో
వునొసంగవలయుననవిని
    తనమదివగపొందియతఁడితనికిట్లనియెన్. ౩౮౪.

గీ. క్షితితలాధీశయిదియెనాజీవనంబు
    హవ్యకవ్యప్రవర్తనకాస్పదంబు
మొనసియతిథులఁబూజింపమూలధనము
    గాననొసఁగంగఁజాలనీధేనువిపుడు. ౩౮౫.

చ. అనవినిగాధిసూనుఁడమితాగ్రహుఁడై మునివర్యునేలవేఁ
డననుచునావుఁబట్టుకదడంబులఁగూడుకపోవఁబోవలే
కనిమిరిధేనువప్పుడనఘవ్రతనిష్ఠువసిష్ఠుఁగాంచియి
ట్లనియెమహాత్మనన్నితనికర్పణసేయఁగనేలనావుడున్. ౩౮౬.

ఏనేలనినన్నొసంగుడు
భూనాథుండధికబలుఁడుపూనికమీఱం
దానేకొనిచనియెడునటు
గానన్నీబలిమిఁగొలఁదిఁగావింపఁదగున్. ౩౮౨.

వ. అని వసిష్ఠుండు వల్కిన నత్యంతాగ్రహావగ్రహయై హుంకరణం బొనర్చ నక్కామధేనువు ముఖపృష్ఠశృంగఖురకర్ణనేత్రరోమకూప ప్రముఖసర్వాంగంబులయందును కైరాతకపల్లవకాంభోజయవనాద్యనేకవీరభటు లుద్భవిల్లి గదాఖడ్గకుంతప్రాసభిండివాలశూలముసలముఖాయుధాఢ్యులై రథగజతురగపదాతివర్గంబుల నిర్మూలం బొనర్చుటయును గాధేయాత్మజులు నూఱ్వురుం జెలరేఁగి వసిష్ఠునిపై నానావిధశస్త్రాస్త్రంబులు గురియించి యతనికోపాటోపంబున నిరవశేషంబుగా భస్మం బగుటయు విశ్వామిత్రుండు నిఖిలబలంబులుం దనూజులుం గూలుటం గాంచి శోకించి పురంబునకుం జని నిజరాజ్యంబునం దొక్కతనయునిం బూన్చి పత్నీయుతంబుగా హిమాచలంబున కరిగి చలంబున జలంబున న్నిలిచి మృత్యుంజయుంగూర్చి ఘోరతపం బొనర్చుటయు నమ్మహానుభావుం డగుభవుండు సాక్షాత్కరించి యనర్గళం బగుశస్త్రాస్త్రంబు లొసంగి చనియె నంత.

క. శశధరునిచేతశస్త్రా
స్త్రశతములన్గొనివసిష్ఠసంయమివనము
న్గుశనాథపౌత్రుఁడాగ్నే
యశరంబులచేతఁగాల్పనతఁడుగ్రుండై. ౩౮౩.

క. దండధరుభంగిఁగేలం
దండముఁగొనివెడలియోరితాపసవనము

ద్దండతఁ గాల్పఁ దొడఁగు నీ
గండడఁ జెదఁ జూడు మిపుడు కౌశిక యనినన్. ౩౫౦.

శా. హుంకారంబున గాధిజుండ మితరోషోద్రేకవృత్తిన్ ధను
ష్టంకారం బొనరించి పాశుపత పైశాచానలాద్యస్త్రము
ల్పొంకం బొప్పఁగఁ బూన్చి వైవ నవలం బోక వసిష్ఠుండు ని
శ్శంకన్ ద్రుంచెను బ్రహ్మదండమున నా శస్త్రాస్త్రజాలంబులన్. ౩౫౧.

వ. అంత విశ్వామిత్రుండు. ౩౫౨.

మ. తనదివ్యాస్త్రము లెల్ల వమ్మగుటయున్ దర్పోద్ధతిన్ మించి హా
యని బ్రహ్మాస్త్రము సప్రయోగముగ వేయన్ సర్వగీర్వాణులు
న్దినునాథగ్రహచంద్రతారకలు భేదిల్లంగ ఘోరాకృతిం
దనన్సైరాఁగ నియవ్వసిష్ఠుఁడు వడిం దద్బాణమున్ మ్రింగఁగాన్. ౩౫౩.

సీ. బ్రహ్మతేజస్స్ఫూర్తిఁ బ్రజ్వరిల్లుచునుండ
నమ్మౌనియంగరోమాళియందు
ఘనవహ్ని రుచులచేఁ గాండజాలంబులు
వృషమి విశ్వామిత్రుఁ బోమవుటయును
నిజసత్వ మెడలంగ నిలిచి యొండేమియుఁ
జేయరామికి మదిఁ జింతనొంది
విప్రబలంబు భూవినుతమై యొప్పారె
కాల్పనేయీ రాజగర్వమెల్ల
ననుచుఁ దలపోసి రోసి రాజ్యమును బాసి
వనమునను జేరి బ్రహ్మర్షితనముఁ గోరి
పద్మభవుఁ గూర్చి స్వాంతమర్పణ మొనర్చి
తపము సేయుచునుండె నీధన్యుఁ డపుడు. ౩౫౪.

ఇట్లు తపస్సంపన్నుఁడై యుండుతఱి నిమ్మహానుభావుండు మధుత్యం దహవిష్యందదృఢనేత్రమహానాథు లను నల్వురుసుతులఁ బడసి పిద పం జలంబు డింపక యనేకదివ్యవర్షంబులు ఘోరతపంబు గావించు చున్నంత. ౩౫౫.

క. రాజీవభవుఁడు సన్ముని
రాజగణముగొల్వ హంసరాజము పైని
భ్రాజిలుచు వచ్చి గాధిత
నూజుని రాజర్షి వైతనుచుఁ బల్కి చనన్. ౩౫౬.

క. ఈకౌశికుఁడు మనంబున
నాకేల బ్రాజఋషితసంబను చుమహా
వ్యాకులత నుగ్రతపముం
జేకొని బహువత్సరములు సేయుచు నుండెన్. ౩౫౭.

వ. అంత నయోధ్యాపురవరంబున సం దొక్కనాఁడు. ౩౫౮.

క. పంకజమిత్రకులాబ్ధిశ
శాంకుఁడరాతిజనహృద్భయంకరుఁడు యశో
ల్బణంకషుఁడగుచుఁ జెలంగు త్రి
శంకనృపాలుఁడు వసిష్ఠసంయమిఁ గని యొన్. ౩౫౯.

మ. ఇనవంశంబున కెల్లనార్యుఁడవు మున్నిక్ష్వాకుముఖ్యుల్భవ
ద్ఘనసాహాయ్యముఁ జెందికాదె బహుయాగంబుల్ప్రగంజేసి మే
ల్గని దేవత్వము నన్నిరంతరము స్వర్గంబంది వెల్గొందుట
ల్మునివర్యాగ్రణి నన్ను నప్పగిది నామోదించి రక్షింపవే. ౩౬౦.

క. క్రమమున బహువర్షములు వ
సుమతిం బాలించినాఁడ సుస్థిరమతిగా

త్రముతోడ నిపుడు సురలో
కముఁ జేరం దగు సుఖంబుఁ గావింపఁగదే. ౩౬౧.

చ. అనుటయు నవ్వసిష్ఠుఁడు ధరాధిపము న్నెవ్వరైనఁ గాని భూ
జనములు మేనితోడ తనుస్వర్గముఁ జేరుటఁ గానమట్లు గా
వునఁ జనదీ సుఖంబు పదిఁ బూనకుమా యటంచుఁ బల్కెఁ ద
త్తనయుల చెంతకేగి వసుధావరుఁ డెంతయు భక్తినమ్రుఁడై. ౩౬౨.

గీ. తనువుతోడ స్వర్గధామంబుఁ జేరఁగాఁ
దగినపావన రాజమగణితముగఁ
జేయవలయు నని వసిష్ఠుని వేఁడిన
నతఁడు గూడదని యెహితవ్రమాని. ౩౬౩.

గీ. అనఘులార ఘోరమైన యయ్యజ్ఞంబుఁ
బొసఁగఁ జేసి నన్నుఁ బుచ్చుఁడనిన
విని వసిష్ఠమానితనయులు వల్కిరి
పొంకమలర నాత్రిశంకుఁ గాంచి. ౩౬౪.

క. ఘనుఁడు వసిష్ఠమునీంద్రుఁడు
మనమునఁ దలపోసి యిట్టి సుఖ మెవ్వరిలం
బనిపూని చేయరనుచోఁ
జను నే యొరులకు నొనర్ప జగతీనాథా. ౩౬౫.

వ. అట్లు గావున నష్టదాదు లయ్యజ్ఞం బొనర్పం గూడదనినఁ ద్రిశంకుండు కోపతామ్రాక్షుం డగుచు మీ వలనం గాదనినఁ జన్నం బొరులచేతఁ జేయించెద ననుటయు నవ్వాసిష్ఠు లతనిం గనుంగొని. ౩౬౬.

క. చండాలుండవు గమ్మని
చండతరక్రోధమునను శాపంబిడ మా

ర్తాండకులోద్భవుఁడగుభూ
మండలపతి తేఁడ మెల్లమలినంబయ్యెన్. ౩౬౭.

క. వాసిష్ఠులకోపాగ్నియు
భాసురముగ నృపతిమేనఁ బ్రజ్వరిలంగ
న్వాసి చెడి వికృతరూపం
బౌనన్నం బయ్యెఁ జూడ నద్భుతరీతిన్. ౩౬౮.

క. నవరత్నభూషణావళు
లవిరళముగ లోహమయము లైనె మొప్పారె
న్వివిధాంబరములు నీలివ
లువలక్రియ న్దోఁచె బౌరులు మదిఁ గలంగన్. ౩౬౯.

వ. ఇట్లమ్మహారాజేంద్రునకు నిజసౌందర్యసౌష్ఠవంబులు మాయంబులుగాఁ జండాలత్వంబు ప్రాపించుటయు బంధుభృత్యామాత్యవర్గంబులు పరిత్యజింప నొచ్చుచు జనపథంబుఁ బాసి వనంబునం గ్రుమ్మరి దైవయోగంబున నమ్మునిశ్రేష్ఠుం డగువిశ్వామిత్రుపాలి కరుదెంచి ప్రమొక్కి చింతాక్రాంతుండై యున్నం గాంచి కరుణాయత్తచిత్తుండై యిట్లనియె. ౩౭౦.

క. సాకేతపురీశుఁడవి
క్ష్వాకుకులుండ వ్రతిశంకుజనవరుఁడవు సీ
కేకరణి వికృతరూపము
సేకూరెం దెల్పుమని నక్షితిపతి వలికెన్. ౩౭౧.

చ. మునికులచంద్ర మావినుము మోదము మీఱ వసిష్ఠుపాలికిం
జని వినతుల్ ఘటించి తగు జన్నముఁ బ్రేమ నొనర్చి మేనితో
ననుఁ ద్రిదివంబుఁ జేర్పుఁ డనినన్ దగ దట్లొనరింప నన్న నా
తని తనయాళి వేఁడితి నిదద్దయు వారలు నట్లు పల్కఁగాన్. ౩౭౨.

క. వినిక్రోధంబునగురునం
దనులంగనియొకులవలనఁదన్నఖమేఁజే
తుననుచునుడివినాపై
ననలముక్రియమండిమాలవగుమననైశ్రీ. ౩౨౩.

క. ఈవికృతరూపమొందుట
భావమునందలఁచిశోకపరితప్తుఁడనై
తావకపదపంకజముల
సేవకునరుదెంచినాఁడసిద్ధచరిత్రా. ౩౨౪.

క. శరణాగతుఁడనునన్నుం
గరుణారసభరితహృదయగాత్రముతోడ
న్సురపురికనుపఁగఁజాలెదు
వరయజ్ఞమునాచరింపవలయుమహాత్మా. ౩౨౫.

వ. అని త్రిశంకుండు విన్నవించుటయు నత్యంతకృపాకలితహృదయుం
డగుచు విశ్వామిత్రుం డతని కిట్లనియె. ౩౨౬.

చ. క్షితిపతినీమనంబుననుజింతిలనేటికిమానుమింకని
న్నతులితమాతదధ్వరమునద్భుతభంగినొనర్చిమేనితో
సతతమునింద్రలోకసుఖసంపదలందఁగఁబుత్తునియ్యెడ
న్హితమతియజ్ఞదీక్షవహియింపుముపెంపుమునద్యశంబిలన్. ౩౨౭.

గీ. అనుచుఁదనశిష్యులనుజీరియఖిలమునుల
వేగమునఁద్రిశంకునియాగమునకుఁ
బిలువుఁడనవారలరిగిమానులనునటకుఁ
దోడితెచ్చియాకౌశికుతోడననిరి. ౩౨౮.

గీ. అయ్యసకలమానులరుదెంచిరలవసి
ష్ఠాత్మజులనుబిల్వనాగ్రహమున

రాకదగునెయనిని రాకరించియుఁగొన్ని
దిట్టిపుచ్చిరవియుఁదెలియవినుము ౩౬౯.

క. రాజరులుండధ్వరమున
యాజకుఁడఁటకర్తమాలఁడఁటమునిగణము
లోభజనమేక్రియఁజేయఁగ
వేఁజనిసురలందుకోహవిర్భాగంబుల్. ౩౭౦.

క. మేలుగనీకౌశికపరి
పాలితుఁడౌనరుఁడునాకపథమునకేటుఁపోఁ
జాలునొ దేహముతోనిది
చాలన్విస్మయముచూడఁజనుననిరఘూ. ౩౭౧.

క. అనవినికౌశికుఁడింతం
తనరానిమహాగ్రహమునవాసిష్ఠు
ల్మనకనరమాంసములఁదిని
దనుజులగైయుందురనుచుఁదాశపియించెన్. ౩౭౨.

చ. ఇటుపటుశాపవాక్యములనించుకసైరణమానిపల్కియు
చ్చటికరుదెంచియున్నమునిసత్తములంగనియాత్రిశంకునిం
దటుకునబొందితోడసురధామముఁజేర్చుమహాధ్వరంబుమీ
రిటనొనరింపఁబూనుఁడనసనిచ్చఁజెలంగుచువారలప్పుడున్. ౩౭౩.

క. తగునిగమమంత్రములవ్రే
ల్వఁగనిగనిగమనుచునగ్నివడిఁదిరిగివెలుం
గఁగఁగౌశికుండుయాజకుఁ
డగుచుంజన్నంబొనర్చెనచ్చెరువడరన్. ౩౭౪.

వ. ఇట్లమ్మహాధ్వరంబు సాంగంబుగా నొనర్చి విశ్వామిత్రుండు హవి
ర్భాగంబుల కమరులం జీరిన వార లచ్చోటికి వచ్చుటం గూడ దని

పల్కి యత్యంతకోపానలాక్షుండై కరంబునం గుశపవిత్రంబుఁ బూని స్రువం బెత్తి త్రిశంకుం గాంచి యేను జిరకాలంబు నియమంబు దప్పక తపం బాచరించితినేని నీ విమ్మేనితోడ స్వర్గంబున కేగు మనిన నతం డట్ల పోవుటయు నింద్రుం డాగ్రహోదగ్రుండై యప్పుడు.

క. మాలం డెన్నఁగ నీనర
పాలుండి చోటనుండఁ బాడియె యనుచు
న్గూలంద్రోయఁ ద్రిశంకుఁడు
చాలన్ భీతిల్లి మఱలి సత్వర మొప్పన్. ౩౮౬

క. తలక్రిందైనచ్చుచుఁ గృప
గలకౌశిక నన్నుఁ గావు కావుమనఁగ రా
వలదం దెయుండుమని యితఁ
డలుక న్వేరొక్కస్వర్గమచట నొనర్చెన్. ౩౮౭

వ. మఱియును. ౩౮౮

గీ. తారకల సప్తఋషుల నుదగ సృజించి
ప్రతిబిడౌజుని గురుని నున్నతి నొనర్పఁ
దలఁచుటయు సర్వనిర్జరుల్తాపసులును
గూడి చను దెంచి గాధేయుతోడ ననిరి. ౩౮౯

క. గురుశాపదగ్ధుఁ డీనర
వరుఁడు త్రిశంకుండు త్రిదశవర్యులలోకాం
తరమున నెటులుండఁ దగు
స్వరవహానిమ్ముగాంక తెలియవలదే మదిలోన్. ౩౯౦

వ. అనిన విశ్వామిత్రుం డిట్లనియె. ౩౯౧

సీ. సురవరులార భాసురయశస్కరు నీత్రి
శంకు నీదనువుతో స్వర్గమునకుఁ

బని చెవనంటనా ప్రతిన చెల్లఁగను నేఁ
డేనొనర్చిన నాకమైన నిత్తు
నప్సరోవీథిపైనటదక్షిణంబున
నమరెడు నీ తారకములనడుమ
బృందారకస్ఫూర్తిఁ బెంపొంది శీర్షంబు
క్రిందై మెలంగుచుఁ గీర్తివడసి
భువనములు వెల్గునందాఁకఁ బుణ్యశీలుఁ
డగుచునుండెడు మని పల్కె నను మతించి
కౌశికుని మెచ్చికొనియాడి క్రమ్మరంగఁ
జనిరి నిజలోకమునకు నిర్జరులు మునులు. ౩౯౨.

ఉ. అంతటఁ గౌశికుండు చిటవర్త్మముగా మతపంబు సేయుసం
చెంతయు హృత్ప్రసోదమున నెంచి నిజాశ్రమవాసులొమును
ల్పొంతనె రావిశాలకడఁ బుష్కరతీర్థము జూసి యొక్కచో
వింతవనంబు కన్గవల విందొనరింపఁగఁ గాంచి యయ్యెడన్. ౩౯౩.

క. అంబుఫలాహారుండై
యంబుజసంభవుని మానసాలయమునఁ బ్రే
మంబు చెలువార నిల్పి త
పంబొనరించుచును వెలసె బహువత్సరముల్. ౩౯౪.

అంబరీషుని యాగము.

సీ. అంతనయోధ్యాపురాధీశుఁ డంబరీ
షుం డధ్వరముఁ జేయుచుండు తఱిని
బలరిపు చేయజ్ఞపశువుఁ గోల్పడి పఁడి
వెఱచి ప్రాయశ్చిత్తవిధికి మఱియు

సరపశువునకుఁ గానసములఁ గ్రుమ్మఱి
　　మునిరుచికునిఁ గాంచి మ్రొక్కి నిలిచి
గోవుల నొకలక్షఁ గొని నీసుతులలోన
　　నొక్కనిఁ బశువుగా నొసఁగుమనిన
నగ్రతనయుండు మత్ప్రియుండనుచు నతని
　　సతి కనిష్ఠునిఁ బంపఁగా జాలననియె
మధ్యముఁడు దల్లిదండ్రుల మమత లెఱిఁగి
　　పార్థివోత్తముఁ గనుఁగొని పలికె నిట్లు. ౩౯౪.
క. తన పెద్దకొడుకు దండ్రికిఁ
　　దనముకనిష్ఠాత్మజుండు దల్లికిఁ బ్రియులై
తనరారిరే నెవచ్చెద
　　జననాయక నన్నుఁ గొనుము జన్నముకొఱకున్. ౩౯౫.
వ. అని తన్మధ్యమసుతుండగు శునశ్శేఫుండు వల్కుటయు నంబరీషుం డత్యంతోత్సాహసమన్వితుండై యతనిఁ దనరథం బెక్కించుకొని గోసహస్రంబులు ఋచికున కొసంగి చని చని యా రాత్రి పుష్కరాశ్రమభూమిం జేరె. అంత నా శునశ్శేఫుం డచ్చోటఁ దపోనిష్ఠుండై యున్న మాతులుండగు విశ్వామిత్రుం గాంచి వినయసంభ్రమంబులు రెట్టింప నమస్కరించి యిట్లనియె. ౩౯౬.
క. జననీజనకులు నన్నీ
　　జనవరునకొసంగి రిపుడు సవనపశువుఁగా
మునినాథ నామప్రాణం
　　బు నృపుఁడొనరించు యజ్ఞమును గావఁగదే. ౩౯౭.
గీ. తల్లిదండ్రిగురువు దైవంబుఁ దలపోయ
　　నీవె గానఁ బూని నీపదముల

మఱుఁగుఁ జొచ్చినాఁడ మన్ననతోడుతఁ
బ్రాణదాన మొసఁగు భవ్యచరిత. ౩౯౯.

క. అని వేఁడు శునశ్శేఫునిఁ
గని కరుణాయత్తుఁ డగుచు గాధేయుం డా
తనిని నూఱడిల్లుమని తన
తనయుల నల్వురను జీరి తా నిట్లనియెన్. ౪౦౦.

క. పరలోకసుఖముఁ బడయఁగ
వరసుతులం గాంచు టెల్ల వసుమతిజనకు
ల్పరలోక మిది యెనాకీ
శరణార్థి నిఁ బ్రోవుఁ డిపుడు సమ్మద మొదవన్. ౪౦౧.

క. ఈతఁడు నా మేనల్లుం
డీతని కై ప్రాణ మొసఁగుఁ డెవ రేని నొకం
డో తనయులార యన నా
రీతులఁ బొప్పదని పల్కి రెంతయుఁ గినుకన్. ౪౦౨.

క. తనయులఁ గని శునకములం
దినుచు న్వేయేండ్లు మీరు దీనత నొందుం
డని శపియించి శునశ్శే
ఫునిఁ జేరం బిలిచి పల్కె భూరికరుణచేన్. ౪౦౩.

గీ. మునికుమార నీకు ముఖ్యమంత్రద్వయం
బొసఁగెద నుపఠించుచుండు మదియు
నృపుని యధ్వరమున నీదు ప్రాణంబును
గాచు మనుచుఁ గల్లగాదు వినుము. ౪౦౪.

మ. అని గాధేయుఁడు మంత్రయుగ్మముఁ బ్రియుం బొరంగ నమ్మౌనినం
దనునిం జేరి యొసంగె నంతటఁ బ్రభాతంబౌట నయ్యంబరీ

మనరేంద్రుండుప్రయాణమైమునితనూజాతుండుదోఁరాఁగవేఁ
జనినైజాధ్వరవాటిఁజేరిపశుపూజంజేసిబంధింపఁగాన్. ౪౦౫.

క. ధీయుతుఁడుశునశ్శేఫుం
డాయూపస్తంభబద్ధుఁడైయప్పుడుగా
ధేయుఁడొసంగినమంత్రము
లాయతమతితోజపింపనాసమయమునన్. ౪౦౬.

గీ. వాసవుండుత్రిదశవర్యులుఁగొల్వన
య్యంబరీషుపాలికరుగుదెంచి
భూపనీమఖంబుపూర్ణమైఫలియించె
మానుమనుచుఁబల్కిమఱలిచనియె. ౪౦౭.

క. ఆవేళనంబరీషుం
డావిమలస్వాంతయుక్తుఁడగురుచికసుతు
న్వేవేగబంధముక్తునిఁ
గావించియయోధ్యకరిగెఁగడుముదమలరన్. ౪౦౮.

వ. అంత. ౪౦౯.

క. అలపుష్కరాశ్రమంబునఁ
జలమునఁగౌశికుఁడువేయుసంవత్సరము
ల్నిలిచితపమాచరింపఁగ
నలినజుఁడరుదెంచిఋషితనమొసఁగిచనియెన్. ౪౧౦.

గీ. ఆఋషిత్వంబునేనొల్లననుచుమఱియుఁ
దవిలికౌశికుఁడతిఘోరతపమొనర్చు
చున్నతఱిఁగాంచివాసవుండోర్వలేమి
నటకుమేనకయనునాతిననుచుటయును. ౪౧౧.

విశ్వామిత్రుని తపస్సుఁ జెఱుప మేనక వచ్చుట.

క. కాముని యరవిరిశరమీ
భూమిని నప్సరసగాఁ గఁబుట్టెనొ యనఁగ
న్కామిని యొయ్యారంబున
నామునియాశ్రమముఁ జేరియస్ఫుటలీలన్. ౪౧౨.

క. అందియలు గల్లుగల్లనఁ
జిందులుద్రొక్కుచును మిగులఁజిన్నారి నడ
ల్గ్రిందుకొన వీర మోహిని
చందంబునఁ దిరుగుచున్న సమయమునందున్. ౪౧౩.

సీ. అలయింతిముఖకాంతిఁ బలుదొంతిఁ జనుబంతిఁ
గను ఱెప్ప వేయక కాంచికాంచి
సఖమోవి బలుకావి జడతీవి మైతావిఁ
బోలుపొందగ గణుతించి పొగడిపొగడి
చెలియూరుఁ గటితీరుఁ జెలువారు నూఁగారు
మిగులంగఁ బలుమాఱు మెచ్చిమెచ్చి
చెవినాటఁ దగు పాటఁ జెలియాట బిగిమాట
నెలమి వేడ్కలొనర్ప నెంచి యెంచి
తపముఁ బోఁ జేసి మానంబుఁ దరలఁద్రోసి
నెట్టన నుసిష్ఠలను మూటగట్టి పెట్టి
మమత రెట్టించి యంతంత మరులు మించి
గాధిసూనుండు మరుని చేఁ గట్టువడియె. ౪౧౪.

వ. ఇట్లు విశ్వామిత్రుం డమ్మేనకం గాంచి తద్రూపరేఖావిలాసంబులకు విభ్రమం బంది మోహపరిభ్రాంతుండై నిజస్వాంతంబున నిట్లని తలంపం దొడంగె. ౪౧౫.

క. వనములలో నొంటిగనీ
వనజేక్షణ దిరుగఁ గాంచి వానప్రస్థు
ల్ఘనతపముల విడనాడియు
వెనుదగులుటలరుదె యిట్టి వెలఁది యుఁగలదే. ౪౧౬.

క. ఈమగువ ముద్దుమొగమెం
తే మహిఁ బొడగాన నట్టిదిన మొకదినమే
కామినిఁ గేళిం బెనఁగిన
యామనుజుఁ డెసుమ్మ తలఁప నతిపుణ్యుఁ డిలన్. ౪౧౭.

సీ. అతితృప్తిగను దీనియధరమానినఁగదా
దేవామృతంబు సిద్ధించినట్లు
కడుమోహమున దీనిఁ గౌఁగలించినఁగదా
సురలోకపదవినిఁ జూచినట్లు
కొమరుమీఱిన దీనికుబ్బ లంటినఁగదా
బహుయాగఫలములఁ బడసినట్లు
కళలూరఁగా దీనిఁ గదిసి కూడినఁగదా
బృందారకత్వంబుఁ జెందినట్లు
చతురత నన్ను నీసతి హితవుఁ బూని
మారుకేళిఁ దనియించి మనుపకున్న
నిమ్మహామోహతాపంబు లెట్లు మాను
ననుచుఁ జింతించి కౌశికుం డతివ కనియె. ౪౧౮.

క. ఎచ్చోటనుండి వచ్చితి
విచ్చోటికి నీవు కొమ్మ యిట్లొంటిగ నా
పచ్చవిలుకాఁడు పంచెనో
మచ్చుపొడిం జల్లి నాకు మదిఁ గరఁగింపన్. ౪౧౯.

వ. అనిన మేనక యిట్లనియె. ౪౨౦.

క. ఏనప్సరసననుదినం
బూనిన వేడ్క స్వనంబులోఁగి విహరింతు
న్మానీంద్రచంద్రవినుమా
మేనక యనుపేరిదాన మెలఁతలమిన్నన్. ౪౨౧.

చ. అనవిని యిమ్మహాత్ముఁడపుడయ్యతివన్దిలకించి యిట్లనె
న్వనరుహనేత్ర నీపయిన వారిత మోహముఁజెందినాతపం
బును వ్రతనిష్ఠలున్విడిచి పుచ్చితి మాయని చేతఁజిక్కితి
న్ననుభవదాశ్రితుం బ్రియమునం గని ప్రోవఁగ చేతలోనరీ. ౪౨౨.

క. అని ముని వేఁడఁగ మేనక
తన రాకఫలించెననుచుఁ దద్దయు మోదం
బునననవిల్తుని కేళిం
దినదినమును మించి యితనిఁ దేల్చుచునుండెన్. ౪౨౩

వ. ఇట్లు విశ్వామిత్రుండనంగ సంగర క్రీడలం జెలంగుచు నుత్సంగుండై దశాబ్దంబులు మెలంగి యాతటం దెలివిఁ గాంచి యత్యంత విషాదంబు నొంది నిజతపోభంగంబునకుఁ బురందరుండు కారణంబ కానెఱింగి మేనక న్విడిచి పుచ్చి యచ్చోటువాసి హిమవన్నగంబుఁ జేరం జని కౌశికీనదీప్రాంతంబునఁ బెక్కువర్షంబు లతిఘోరతపం బొనరించు చున్నంత. ౪౨౪.

గీ. నలినభవుఁడు మునిగణంబులతోఁ గూడి
తరలివచ్చి వానితపముఁ గాంచి
హర్షమంది యిఁక మహర్షివైతివి నీవ
టంచుఁ బల్కి చనియె నంచితముగ. ౪౨౫.

వ. అంత విశ్వామిత్రుండు. ౪౨౬.

క. తనివిసనక యెటులైనం
బనివడి బ్రహ్మర్షితనముఁ బడయుదు ననుచు
న్దనకరములూర్ధ్వముగ నిడి
యనిలాశనుఁ డగుచు నియమ మడరఁగ నపుడున్. ౪౨౭.

క. నిండిన వానను బయలున
నెండను బంచాగ్ని నడుమ హిమమున నీటం
బెండువడక నిలిచి మహో
ద్దండంబుగఁ దపము సల్పెఁ దత్ఫలనిష్ఠన్. ౪౨౮.

గీ. ఇట్టి దారుణమగు తపం బి మ్మహాత్ముఁ
డపుడు సేయఁ బురందరుం డాత్మ నెఱిఁగి
తత్తపోవిఘ్న మొనరింపఁ దగఁ దలంచి
రంభతోఁ బల్కె సత్యాదరంబు దోఁప. ౪౨౯.

క. ఓమగువ సురహితంబుగ
భూమిన్ స్థలికరిగి గాధిపుత్రుని చెంతం
బ్రేమను జేరియ తని తప
మేమఱకయ చెఱుపవలయు నిందునిభాస్యా. ౪౩౦.

విశ్వామిత్రుని తపంబుఁ జెఱుప రంభ వచ్చుట.

వ. అనిన జంభాంతకుం గని కుంభీంద్రకుంభోపమానకుచకుంభ యగు రంభ యి ట్లనియె. ౪౩౧.

క. ఎడఁబడని తపోమహిమను
న్బడబాగ్ని యుఁబోలెఁ గానఁబడియెడు నెపుడున్
గడు మూర్ఖుఁ డమ్మునీంద్రుం
డోడఁబడియే నను గనుఁ బనూ త్రిదశేంద్రా. ౪౩౨.

క. ఎఱిఁగియెఱిఁగిబెబ్బులిక్రియ
వఱలెడునమ్మౌనికెదుటనంచనమతిచే
గుఱిఁగొనియరుగందగునే
కొఱవినిఁదలఁగోఁకికొనెడుకుమతులుగలరే. ౪౩౩.

వ. అని ఫల్కు రంభాకామినిం గని జంభారి యిట్లనియె. ౪౩౪.

చ. మదగజయానయిట్టియనుమానముమానుముమానసంబున
న్మదనునిఁదద్బలంబులనుమందసమీరునినీకుఁదోడుగా
నిదెపనుతున్మునీంద్రుకడకేగిమదింగరఁగించినిష్ఠల
న్వదలఁగఁజేసిరమ్ముత్రిదివమ్మునకుంగడుమోదమొప్పఁగాన్. ౪౩౫.

వ. అని యింద్రుం డివ్విధంబున నొడంబఱచి మన్మథమారుతంబుల సహాయుం బొనర్చి పుత్తెంచుటయు నక్కోమలి నిజమందిరంబున కరిగి మణిభూషణవస్త్రమాల్యాద్యలంకృతయును మృగమదచందన ఘనసారకుంకుమపంకసంకలితాంగియు నై మీనకేతనమలయసమీరులు దోడం జనుదేర మదమరాళమయూరశారికాకీరకలకంఠప్రముఖ పరిజనంబులం గూడి మందగమనంబునం జని చని గాధేయాశ్రమంబు డాసి మనోహరలాస్యంబున కారంభయారంభం బొనర్చి యప్పుడు. ౪౩౬.

చ. పదములఁగింకిణీరవముఁబాగుగ మ్రోయఁగఁదాళభేదము
లొప్పదలఁజతుర్విధాభినయపూరితమైతసరారునాట్యమిం
పొదవఘటించుచున్మకపికోన్నతగీతనినాదమెల్లచోఁ
గదియఁగరంభతద్వనముగానియొనర్చుచునుండనత్తఱిన్. ౪౩౭.

క. ప్రళయకాలాగ్నియనుబోలెఁబ్రజ్వరిల్లి
కౌశికుఁడురంభఁగనిరోషకలితుఁడగుచు

వనితపదివేలవర్షములు వసుధజాతి
రూపమునను౦డుమనుచు శాపమొసఁగె. ౪౩౮.

వ. అంత నగ్గణికాశిరోమణియును. ౪౩౯.

క. గడగడవడఁకుచుఁబుడమిం
బడిపొరలుచు మిగులదీనభావంబునఁదా
నడుగులపై వ్రాలియు నేఁ
గడఁగనుటెన్నఁడనియడుగఁ గౌశికుఁడనియెన్. ౪౪౦.

క. పదివేలేండ్లనుజనఁగాఁ
దుదఁగాకుత్స్థనరేంద్రువలనదోషరహితవై
పొదలుచు నిజరూపముఁగాం
చెదవనుటయు రంభ ఘోరశిలయైపడియెన్. ౪౪౧.

వ. అంత విశ్వామిత్రుండు తనమనంబున నిట్లనియె. ౪౪౨.

క. కామమునకపుడొసంగితిఁ
దామసగుణమమరి యిపుడు దఱిఁగెను దపమీ
కామక్రోధములణఁచియు
నీమహినిజితేంద్రియత్వమేఁ గాంచితగన్. ౪౪౩.

గీ. వనజజుఁడుమెచ్చ వేయుసంవత్సరములు
తపముఁగావించి బ్రహ్మర్షితనముఁ గొందు
ననుచు నచ్చోటు వాసి సిద్ధాశ్రమంబుఁ
జేరి గాధేయుఁడచలితచిత్తుఁడగుచు. ౪౪౪.

మ. అతినిష్ఠం దపమాచరించుచు నిరాహారత్వముం జెందియు
న్ధృతిమీఱంగ సహస్రహాయనములంతంబంద నాహారకాం
క్షితుఁడై పారణఁజేయఁబూనఁగ మదిం జింతించి విప్రాకృతి
న్నతమన్యుండరుదెంచి యన్నమడుగన్సంప్రీతితోఁ బెట్టుడున్. ౪౪౫.

గీ. అమరనాథుఁడ చటనన్నంబు శేషింప
కమరఁగుడిచినఁగనంతరోసి
గాధిసుతుఁడుమఱియుఁగదలకతపమ్ఢ్ర
వేయువత్సరములు చేయుటయును. ౪౪౬.

సీ. అప్పుడీమునివర్యునౌఁదలపైఁబెను
బొగలును శిఖశిఖల్మిగులఁగలిగి
పటుగతిదశదిశల్ప్రజ్వరిల్లి వెలుఁగ
ధరణీతల్లడి పెద్దికత్తులుగలఁగె
నగములువణఁకెఁబన్నగపతిగంపించె
నమరగంధర్వయక్షాదులెల్ల
భయమునుదిపరువిడిపరమేష్ఠికడఁజేరి
ప్రణమిల్లినుతియించిపలికిరిట్లు
దేవవాణీశవినుముగాధేయమౌని
మేనఁబొడమితపోవహ్ని మింటమంట
లెగసి కాల్పఁదొణఁగెనీవేమఱినను
లోకచయములుభస్మంబుగాకయున్నె. ౪౪౭.

క. కడువడిఁజనియకొశికుఁ
డడిగినవరమొసఁగిమనిచియతనితపంబీ
డొడనుడిపిమమ్ముఁగావుము
దడసినదివినిల్వమాకుఁదరమెయధీశా. ౪౪౮.

వ. అని యింద్రప్రముఖసకలామరులుఁ బితామహుసన్నిధి నత్యంతదీనా
లాపంబుల వేఁడుటయు నప్పుడు. ౪౪౯.

మ. మునిముఖ్యుల్కృతులుచ్చరించుచునుసమ్మోదంబునంగొల్వ దే
వనికాయంబులువాక్సుధామధురభావంబొప్పఁగావెన్బడిం

జనికీర్తింపఁగ సత్వరంబున ను విశ్వామిత్రుఁ జేరంగఁ దా
నను వృందం జను దెంచె నబ్జజుఁడు హంసారూఢుఁ డై యుత్తఱిన్. ౪౫౦.

సీ. ఇట్లు విచ్చేసి వాగీశుఁ డిచ్చ మెచ్చి
తాపసోత్తము యీ యుగ్రతపము మాను
మలర బ్రహ్మర్షి వైతి వీ వనిన గాధి
సుతుఁడు హర్షించి పూజించి నుతులొనర్చి. ౪౫౧.

మ. నలువాఁ గాంచి నమస్కరించి మది నానందంబునం బొంగుచుం
బలికెం దేవ వసిష్ఠసంయమి నను న్బ్రహ్మర్షి వైతంచుఁ దా
నలఘుప్రేమఁ జెలంగఁ దెల్పినఁగదా యస్మత్తపస్సిద్ధికిం
దలపోయ న్వరమీ వృసంగుటకు సార్థక్యంబు లోకేశ్వరా. ౪౫౨

క. అనుటయు నబ్జజుఁ డయ్యెడఁ
బనిపూని వసిష్ఠుఁ బిల్వఁ బనిచి ముదమున
న్మునిముఖ్యుం డికఁ గౌశికు
ననఘా బ్రహ్మర్షి వైతి వను మన నపుడున్. ౪౫౩.

క. బ్రహ్మణ్యుఁడగు వసిష్ఠ
బ్రహ్మర్షి యు గాధిసుతుని బ్రబలతపమున
న్బ్రహ్మర్షి వైతి వనుచు
న్బ్రహ్మాదులు మెచ్చఁ బలికెఁ బ్రమదము మీఱన్. ౪౫౪.

క. ఆవేళ నబ్జభవముఖ
దేవతలు న్మునిగణములు దీవించి చన
న్భావమునఁ దృప్తిఁ గైకొనె
నీ విశ్వామిత్రు మహిమ లెన్నం దరమే. ౪౫౫.

వ. అని యిట్లు శతానందుం డానతిచ్చుటయు రామలక్ష్మణులును జనకాదిసభాసదులును గౌశికుతపోవిభవంబున కత్యాశ్చర్యంబు నొంది కొనియాడి రంత. ౨౫౬.

చ. తనదుకులంబు రాఘవుఁడు తప్పక శౌర్యవిజృంభణంబున
న్జనకునియింటనున్న హరుచాపము నెల్లి యెత్తుంచి సీతఁ జే
కొనునని నాగలోకమునకున్ దగఁ దెల్పఁగఁ బోయెనో యన
న్వనరుహబాంధవుం డపరవారిధిఁ గ్రుంకె దినాంతవేళయున్. ౨౫౭.

క. జనకుని వీడ్కొని దశరథ
తనయులు సన్మునిగణములు దన వెనువెంటం
జనుదేరఁగ గాధేయుఁడు
చని యొక్కని వాసమునను సమ్మతి విడిసెన్. ౨౫౮.

వ. అంత నచ్చోట నా రాత్రిఁ బుచ్చి మరునాఁటిప్రభాతంబునం బ్రాతస్సంధ్యాదికృత్యంబులం దీర్చి మునిజనపరివృతుండై రామసౌమిత్రులం దోడ్కొని జనకాధ్వరవాటిం జేరి సత్కృతుండై యర్హాసనంబున న్వసియించి యమ్మనుజేంద్రుం గాంచి విశ్వామిత్రుం డిట్లనియె. ౨౫౯.

ఉ. రాజకులాగ్రగణ్యులగు రాఘవులిద్దఱు భవద్గృహంబున
న్రాజిలు భర్గుచాపమును రాగమునం గనఁ బూనియున్నవా
రో జగతీతలేశ యిటకొప్పఁగఁ దేరఁగఁ బంచు మన్ననా
రాజపురందరుండు మునిరాజవరుం గని పల్కె నెమ్మితోన్. ౨౬౦.

జనకుండు విశ్వామిత్రునకు శివధనుర్మాహాత్మ్యంబుఁ దెల్పుట.

క. వినవయ్య గాధినందన
ఘనుఁడగు భర్గునకు విశ్వకర్మ మును శరా

సనమొందర్పించినఁగాని
దనుజులనధియించిమదినిఁదనిసియుఁబిదపన్. ౪౬౧.

క. మూవంశకర్తయగునిమి
కీవలనాఅవతరముననిల యేలుబడి
న్గావించుదేవరాతున
కావిల్లొసఁగెన్గిరీశుఁడర్మిలిమీఱన్. ౪౬౨.

గీ. అంతనుండిమదీయనిశాంతమునను
దరతరంబుగఁబూజావిధానములను
భాసిలుచునుండుభర్గుబాణాసనంబు
వింటెమునిరాజచంద్రయావింటితెఱఁగు. ౪౬3.

క. ఏనధ్వరమునకుమహి
న్మానుగమున్నుటయుఁబైఁడిమందసమచట
న్గానఁబడెనందుశీతల
భానునిరేఖగతినొక్కబాలికదోఁచెన్. ౪౬౪.

ఉ. ఆసుతనెంతొప్రేమచెలువారఁగసీతయటంచునాహ్వయం
బాసనొనర్చిమద్గృహమునందునఁబెంపఁగనాటినాటికు
ద్భాసితదివ్యదేహమునబాలికయద్భుతభంగిఁదోఁచుచు
న్శ్రీసతిఁబోలుసీతనయసిద్ధముగాననియెంచిమించియున్. ౪౬౫.

క. భూతాధీశునిచాపము
ప్రీతిగనెక్కిడినయట్టిపృథివీశునకు
న్సీతనొసంగెదననిభువి
నాతతిఁజాటంబనిచితినఖిలదిశలలోన్. ౪౬౬.

వ. అంత. ౪౬౭.

చ. సకలవసుంధరాధిపులుసత్త్వరులై చనుదెంచిభూతనా
యకునిశరాసనంబునుమహాద్భుతమందుచుఁగాంచియెత్తఁజా
లకకడుసిగ్గునందమబలంబులఁగూడుకనేగియందఱో
క్కకడనుజేరినాపయినకారణవైరముఁబూనియయ్యెడన్. ౪౧౮.

గీ. కొండకైనడినుండుకోదండమొకటిఁ
గానిపించుచున్నృపులభంగంబొనర్చు
చున్నవాఁడాత్మజనొసంగకున్నవాఁడు
జనకుఁడనిచేసిసాధింతమనితలంచి. ౪౧౯.

ఉ. రాజకుమారులెల్లనుబరాక్రమమొప్పఁగనేగుదెంచిన
న్నాజికిఁబిల్వవారణరథాశ్వపదాతిముఖవ్రజంబుతో
వేఁజనివారలంగదిసివెన్కొనితోలిజయంబుఁగాంటినేఁ
డీజననాథసత్కులజతేర్పడఁగన్గొనునిమ్మువిల్లొగిన్. ౪౨౦.

క. అనిపల్కి జనకభూపతి
పనివడివిలుదేరనపుడుపదివేవురస
త్యనుపమబలులగుభటులను
బనిచినఁగొనివచ్చిరంతపటురభసమునన్. ౪౨౧.

వ. ఇట్లు హాటకాచలసహితంబజాండంబు దెచ్చుకరణి లోహమయం
బై యష్టచక్రయుతంబు నగు మంచసంబుతోడ మహాదేవచాపం
బతిప్రయాసంబున నీడ్చి తెచ్చి యునుచుటయును జనకుండు విశ్వా
మిత్రుం గనుంగొని యిట్లనియె. ౪౨౨.

గీ. అమరగంధర్వకిన్నరయక్షవిహగ
దనుజపన్నగముఖ్యులతరముగాని
హరశరాసనమెత్తంగనలవియగునె
నరులకిదియచ్చెరువుమునినాథవినుమ. ౪౨౩.

గీ. ఈశరాసనంబునీరాఘవుండెత్తి
యెక్కుబెట్టినేనినింపుగుల్క
సీతనిత్తుననినశ్రీరాముసటుగాంచి
కౌశికుండువల్కెఘనతమీఱ. ౪౭౪.

క. ఆదివరాహంబై యి
మ్మేదినినొకకోఱనిల్పి మెఱసిననీకీ
పేఁదయగుధనువునెత్తఁగ
రాదేయెక్కిడఁగదయ్యరాజీవాక్షా. ౪౭౫.

శ్రీరాముఁడు హరధనుర్భంగం బొనర్చుట.

క. అనవిని రాముఁడుమందస
మునఫణిపతిభంగిఁభీమముగవెల్గుశరా
సనమందిజనకభూవరుఁ
గనుఁగొనిదరహాసమొప్పఁగానిట్లనియెన్. ౪౭౬.

చ. నరవరయీపినాకివిలునాయెదుటంబొగడంగనేలొకో
కరమునఁబూనఁగాఁదృణముకైవడిఁదోఁచెడిబాహుశౌర్యవి
స్ఫురణముమీఱనెక్కిడుచుభూరిగుణంబురవంబొనర్చుచోఁ
గరమరుదారఁగాధనువుఖండములైపడునంచునెన్నదన్. ౪౭౭.

వ. అని పల్కి. ౪౭౮.

గీ. చక్కనగుకార్ముకంబవుడెక్కువెట్టి
యట్టహాసంబొనర్చుచునఖిలదిశల
మించినిజవిజయంబుసాటించుభంగి
వేగుణధ్వనిఁగావించివేడ్కమీఱ. ౪౭౯.

గీ. జనకజగుణంబుచెవిసోఁకెననఁగఁజేతి
వింటిగుణమునుదనచెవినంటఁదీసి

వసుమతీస్థలినిఖిల రాక్షసులపట్లు
    వదలెనన్నట్లుపిడిపట్టువదలుటయును. ౪౮౦.

క. కడువడిదశరథతనయుని
    పిడికిటనావిల్లువిఱిగి ఫెళ ఫెళమనుచు
న్బుడమియద్రువఁ బెనుగిరిక్రియఁ
    బడియెన్బ్రద్రవమజాండభాండమునిండెన్. ౪౮౧.

వ. ఇట్లమ్మహాధనుర్దండంబు ఖండం బగుటయుఁ దద్ధ్వండారావంబున దిగ్వేదండంబు లదరిపడ ధరణీమండలంబు గడగడ వణంక శేషుండు తల్లడం బంద నా ఖండలప్రముఖనిర్జరతండంబులు దండిమీఱ విరుల సోనలు గురియించుచు గంభీరధ్వనుల నగ్గించుచుండ నా రామ లక్ష్మణజనకవిశ్వామిత్రులుదక్కఁ దక్కినవార లుక్కుదక్కి బిట్టుల్కి మూర్ఛిల్లి రంత జనకుం డత్యంతసంతుష్టాంతరంగుండై రామభద్రుఁ గౌఁగలించుకొని గాధేయున కిట్లనియె. ౪౮౨.

గీ. అనఘశ్రీరామునకుసీతనర్థినిత్తు
    నిపుడె పెండ్లికిదశరథాధిపునితోడి
తేరఁబనిచెదననిపల్కి ధీయుతులగు
    మంత్రివర్యులకనియెఁదామంతనమున. ౪౮౩.

క. సాకేతపురవరంబున
    కేకతముననరిగిదశరథేశునకిపుడీ
కాకుత్స్థరాము పెండ్లిమ
    హాకౌతుకమలరఁదెల్పియమ్మనుజేంద్రున్. ౪౮౪.

వ. బంధుమిత్రామాత్యవర్గంబుతోడఁ దోడితెండని పల్కి యెక్కుడయగు కానుక లిచ్చి పుత్తెంచిన వారును జవనాశ్వంబు లెక్కి వేగంబునం జని యయోధ్యాపురంబుఁ జేరి దౌవారికులవలనఁ దమరాక నెఱిం

గించి దశరథభూపాలుఁ గాంచి జనకుం డొసంగిన కానుక లిడి
వినయవిధేయత్వంబు దోఁప ని ట్లనిరి. ౨౮౫.

సీ. మనుజేశమీకూర్మితనయుండురాముఁడా
కౌశికుయాగంబుఁగాఁచిపిదప
మారీచముఖదైత్యమర్దనంబొనరించి
గౌతమాంగనశాపగతివదల్చి
సురనరాభేద్యమైనాపట్టుహరువిల్లు
విపులశౌర్యంబునవిఱిచివైచి
జనకునిమెప్పింపసంభ్రమంబిగురొత్తఁ
దనపుత్త్రిసీతనిత్తఱినొసంగి
విశదయశముఁ బెండ్లిగావింపఁగోరి
మిమ్ముఁదోడ్తేరఁబనిచెనమ్మేదినీశుఁ
డనుచువినిపింపవినిమెచ్చిమనుకులుండు
మానసంబునసంతోషమగ్నుఁడగుచు. ౨౮౬.

వ. అయ్యమాత్యుల కమేయరత్నభూషణాంబరాదు లొసంగి తచ్ఛు
భంబు పురంబునం జాటింపం బంచి యంతఃపురంబునకుం జని.

క. తనసతులకుఁ దనహితులకుఁ
దనభృత్యామాత్యబంధుతతులకు నెల్ల
న్వినిపించిరాముపెండ్లికిఁ
బనిపూనియు నెల్లవారిఁ బయనమొనర్చెన్. ౨౮౭.

వ. ఇట్లు కృతకృత్యుం డగుటయు శ్రీరామవైవాహికశుభమహోత్స
వాలోకనసంభ్రమాయత్తచిత్తు లగుచు వసిష్ఠవామదేవాదిమహర్షు
లును బంధుహితామాత్యవర్గంబును దగువాహనంబులతోడ నడువఁ
బ్రభాకరమృగాంకప్రభాసమాను లగుభరతశత్రుఘ్నులు సకలశ్రం

గారం బొప్పఁ గై చేసి యుభయపార్శ్వంబుల మత్తమాతంగంబు లెక్క చనుదేర సఫలితమనోరథుండై దశరథుండు రథారోహణం బొనర్చి మౌక్తికచ్ఛత్రచామరధ్వజపతాకాద్యనేకబిరుదచిహ్నంబులు ప్రజ్వరిల్లి రథవారణాశ్వపదాతిసంఘంబులు సందడింప వందిమాగధ బృందంబులు కైవారంబు లొనర్ప భేరీమృదంగకాహళాది మంగళ వాద్యంబులు సెలంగ శుభముహూర్తంబున నయోధ్యాపురంబు వెడలి నాలవదినంబున మిథిలాపురంబు సేరం జనుదెంచునప్పుడు.

గీ. జనకభూపాలుఁ డెదురేగి ఘనతమీఱఁ
దగుతెఱంగులఁ బూజించి దశరథేంద్రు
నలవసిష్ఠాదిమౌనుల నర్హమైన
భవనముల విడియించె సంభ్రమముతోడ. ౪౮౯.

గీ. అటకు గాధిసూనుఁడు రామలక్ష్మణు
సహితముగను జని దశరథుఁ గాంచి
యతఁ డొసఁగు పూజలందియు నాసన
మునను వెలసి పలికె జనపుద్రోఁప. ౪౯౦.

క. ఇనవంశాధీశ భవ
త్తనయులు మత్క్రతు సురక్షిత మొనర్పఁగ నా
వెనువెంటఁ బనిచితివి గద
కనుఁగొనుమిదె వచ్చిరనిరి కడుముదమమరన్. ౪౯౧.

గీ. తనకు సత్రము లైన తనయుల వీక్షించి
కౌఁగిలించి మిగుల గారవించి
యంకపీఠి నునిచి యాత్మ సంతసమందె
విశదకీర్తిరతుఁడు దశరథుండు. ౪౯౨.

వ. అంత, ౪౯౩.

క. ఘనమగుసవనక్రియలం
    జనకుఁడుసాంగంబుగాఁగసలిపిముదమున
స్వనగరుఁజేరిహితపరి
    జనపరివృతుఁడగుచునుండిసచివులకనియెన్. ౪౯౪.

క. వినుఁడిక్షుమతీతీరం
    బునఁగలసాంకాశ్యపురవిభుఁడుమత్ప్రియుఁడౌ
ననుజుఁడుకుశధ్వజుండా
    తనినిటుదోడ్తెండు పంపఁదగఁగనుఁగొనఁగాన్. ౪౯౫.

క. అనిపల్కపనుపవారలు
    చనిసాంకాశ్యపురిఁగనికుశధ్వజుఁబిలువ
న్దనమదినతిహర్షంబునఁ
    జనుదెంచెన్నిజకుటుంబసహితముగాఁగన్. ౪౯౬.

వ. ఇట్లు కుశధ్వజుండు సహకుటుంబుండై యరుదెంచి యగ్రజుపాదం
బులకు నమ్రుండై యర్ధాసనంబున వసియించి రాఘవుప్రభావం
బును సీతాపరిణయమహోత్సవారంభంబును నెఱింగి సంతసించు
చుండె. అంత జనకభూపాలుండు తగుమంత్రులం జీరి దశరథనృపా
లుని సపుత్రబాంధవపురోహితయుక్తంబుగా విచ్చేయవలయు నని
విన్నవింపు మనుటయు వారలుం జని వందనపురస్సరంబుగాఁ దెల్ప
నప్పుడు. ౪౯౭.

గీ. బంధుహితసచివాదులుబలసికొల్వఁ
    దాలఁగకవసిష్ఠకౌశికుల్తోడనడువ
జనకనృపునినిజాస్థానసదనమునకు
    దశరథుండరుదెంచెసంతసమొలర్ప. ౪౯౮.

వ. ఇట్లు చనుదెంచిన వసిష్ఠవిశ్వామిత్రాదిమహర్షులకును దశరథప్రముఖనృపాలవర్గంబునకును జనకుండు దగుతెఱంగుల సత్కరించి యుచితాసనంబు లొసంగె. అంత వసిష్ఠుండు జనకభూవరుం గని యిట్లనియె. ౧౯౯.

క. జననాథవినుముదశరథ
  జనవరువంశక్రమంబుసాంగంబుగ నే
వినిపింతు నెఱిఁగినంతయు
  జననుతమైయొప్పునదియుఁజర్చింపంగన్. ౨౦౦.

వ. అది యెట్లంటేని. ౨౦౧.

సీ. పుడమిఁ బరమేష్ఠిపుత్రుఁడైనమరీచి
  కుదయించెఁ గశ్యపుఁడొప్పమీఱఁ
గశ్యపమునికిభాస్కరుఁడుజన్మించెనా
  తనికివైవస్వతమనువుగలిగె
వైవస్వతునకునిక్ష్వాకుండుసుతుఁడయ్యె
  నతనికిఁగుక్షినృపతిజనించెఁ
గుక్షిసూనుండువికుక్షియమ్మేటికి
  బాణుండనఁగనాత్మభవుఁడుపుట్టె
బాణునకునరణ్యభూభర్తపొడమె
  నమ్మహీనాథునకుఁబృథుండవతరించె
ఘనతమీఱంగఁబృథునకుఁదనయుఁడగుచు
  వినుతయశుఁడుత్రిశంకుఁడావిర్భవించె. ౨౦౨.

వ. అయ్యవనీశ్వరుం డగుత్రిశంకునకు హరిశ్చంద్రమహీపాలుం డుద్భవిల్లె. అతనికి లోహితాస్యుం డనుతనూజుం డుదయించె. ఆ సార్వభౌమునకు దుందుమారుండు నతనికి యువనాశ్వుండు నతనికి

మాంధాతయు నతనికి సుసంధియు నతనికి ధ్రువసంధియు నతనికిఁ బ్రసేనజిత్తు నతనికి భరతుండు నుద్భవిల్లి రా భరతున కసితుం డను భూవిభుండు జన్మించి పృథ్వీపాలనంబు సల్పునెడ నా రాజన్యునకు శత్రువు లైనహైహయులును దాళజంఘులును శశిబిందులును సంఘంబులై చనుదెంచి యుద్ధం బొనర్చి నిజరాజ్యం బాక్రమింపం బత్నీద్వయసహితుండై తుషారనగంబునకుం జని యందు మృతుం డౌటయు నా యసితభూపాలుని భార్యా యుగ్మంబునం గాళిందియను నొక్కతె గర్భిణియై యుండుటయు మఱియొక్కతె తద్గర్భవిచ్ఛేదనం బొనర్పం దలంచి గరళం బిడిన నెఱింగి కాళింది భార్గవకులజుం డగు చ్యవనునిఁ గని ప్రార్థింప నమ్మహానుభావుండు గరుణించి నీ గర్భంబున గరళంబుతోడుత మహాశూరుం డగుసుతుండు జన్మించి వంశకర్త యగు నరుగు మని యాశీర్వదించినం గాళింది నిజగృహంబునకుం జని సుకుమారుండైన కుమారునిం గనియె. అతండు గరంబుతోడం బుట్టం గావున సగరుం డనం బరఁగె. ఆ సగరున కసమంజసుండు నతనికి నంశుమంతుండు నతనికి దిలీపుండు నతనికి భగీరథుండు నతనికిఁ గకుత్థ్సుండు నతనికి రఘువు నతనికిఁ గల్మాషపాదుండు నతనికి సుదర్శనుండు నతని కగ్నివర్ణుండు నతనికి శీఘ్రగుండు నతనికి మరుండు నతనికిఁ బ్రశుశ్రుకుండు నతని కంబరీషుండు నతనికి యయాతియు నతనికి నాభాగుండు నతనికి నజుండును గ్రమంబున నుద్భవిల్లి రాయజునకు ని మ్మహాసార్వభౌముం డగుదశరథుండు ప్రభవించె. ఈ దశరథభూపాలునకు రామలక్ష్మణభరతశత్రుఘ్నులన నీ నల్వురుతనూజులు గల్గిరి. రాజేంద్రా! యీ రామభద్రునకు నీ సుతయగు సీత నిచ్చుటంజేసి నీవతిపావనుండ వైతి వని వసిష్ఠుండు జనకునకు రఘువంశంబు సాంగంబుగాఁ దెల్పుటయును

శతానందుండు జనకాన్వయంబు వక్కాణింపం బూని దశరథుం గాంచి యిట్లనియె. ౫౦౩.

క. దశరథభూవరవినుమా
విశదంబుగ జనకవంశవిస్తారంబు
న్దశదిశలందునుమిగులన్
యశమొప్పన్వెలయుచుండునదియెట్లనినన్. ౫౦౪.

వ. అఖిలసద్గుణగణ్యుం డగునిమిచక్రవర్తికి మిథియను రాజశేఖరుం డుద్భవించె. నమ్మిథికి జనకుం డా జనకున కుదావసుం డయ్యుదావసునకు నందివర్ధనుం డా నందివర్ధనునకు సుకేతుం డా సుకేతునకు దేవరాతుం డా దేవరాతునకుఁ బృహద్రథుం డా బృహద్రథునకు మహావీరుం డా మహావీరునకు సుధృతి యా సుధృతికి ధృష్టకేతుం డా ధృష్టకేతునకు హర్యశ్వుం డా హర్యశ్వునకు మరుం డా మరునకుఁ బ్రతింధకుం డా ప్రతింధకునకుఁ గీర్తిరథుం డా కీర్తిరథునకు దేవమీఢుం డా దేవమీఢునకు సువీరుం డా సువీరునకు మహీధ్రకుం డా మహీధ్రకునకుఁ గీర్తిరాతుం డా కీర్తిరాతునకు మహారోముఁ డా మహారోమునకు మహాబలుం డా మహాబలునకు స్వర్ణరోముఁ డా స్వర్ణరోమునకు హ్రస్వరోముఁ డనం గ్రమక్రమంబున నుదయించి రా హ్రస్వరోమునకు జనకుండునుం గుశధ్వజుండు నన నిమ్మహారాజేంద్రు లిరువురు నావిర్భవించుటయు నంత జనకభూవరుం బట్టంబు గట్టి హ్రస్వరోముండు దపం బొనర్ప వనంబునకుం జనియె నంత. ౫౦౫.

క. జనకక్ష్మావరుఁడవని
న్జనసుతముగనేలుతఱినిసమరంబునకుం

జనుదెంచి సుధన్యుఁడు నీ
తనుభర్గునిధనువుతోడఁ దానడుగుటయున్. ౫౦౬

గీ. అన్నృపాలుఁ ద్రుంచియతఁ డేలుసాంకాశ్య
పురిఁ గుశధ్వజునకుఁ బొసఁగ నొసఁగె
జనకభూవరుండు సత్సంప్రదాయకుం
డితని వియ్యమొప్పు నినకులేశ. ౫౦౭

క. వినుము ధరాస్థలిఁ బుట్టిన
జనకతనూజాత సీత జగదభినుత నీ
తనయుఁడగు రామచంద్రున
కొనర వివాహంబొనర్పు ముర్వీరమణా. ౫౦౮

వ. అని శతానందుండు పల్కుటయు దశరథుం డమందానందంబు
నొంది వసిష్ఠవిశ్వామిత్రులం గని యిట్లనియె. ౫౦౯

గీ. మీగలడుగుండు సీత నూర్మిళను రామ
చంద్రలక్ష్మణులకును గుశధ్వజునికొ
మూర్తైలగు మాండవీ శ్రుతకీర్తులఁ దగ
భరతశత్రుఘ్నులకును నేర్పడఁగ నిపుడు. ౫౧౦

క. అనవిని వారడుగఁగ జన
కనరేంద్రుఁడు సమ్మతించి ఘనశుభలగ్నం
బొనఁగూర్చి దశరథాదులఁ
బనిచి మహామోదమలరఁ బరువడి నంతన్. ౫౧౧

సీతాకల్యాణమహోత్సవము.

క. పరిణయమహోత్సవమునకు
సరసాలంకారములను సల్పుఁడనుచు నా

పురమునఁ జాటఁ బనిచి తాఁ
కరమరుదుగ నంతిపురముఁ గైసేయించెన్. ౫౧౨.

వ. అప్పు డప్పురవరంబు. ౫౧౩.

సీ. పచ్చఱాతిన్నెలు మచ్చటగాఁ దీర్చి
హెచ్చుగా వాకిళ్ల గచ్చు వేసి
నిగనిగమను జిగిసాగ సగు మరకత
ములతోరణమ్ములిమ్ముగ ఘటించి
మెఱుఁగారు గోడల మేల్మిగాఁ జిత్తరు
వులు వ్రాసి కస్తూరి సలికి ముత్య
ములముగ్గు లిడి మంచి వెలిపట్టు మేల్కట్లఁ
గీలించి యనఁటులఁ జాల నిలిపి
నీలముల కంబములను గఱాలపట్టె
లను బ్రవాళపు వాసములను ఘుమంఘు
మితములగు వట్టివేళ్ల నమితములైన
పందిరుల మింటి నొరయంగఁ బొందుపఱిచి. ౫౧౪.

వ. ఇట్లు నానావిధాలంకారములు గావించుటయు నంత నజ్జనకమహీపాలుండు వైవాహికశుభముహూర్తదినంబునందు సీతాదికన్యలకు మంగళస్నానాలంకారంబులు గావింపుఁ డని సువాసినీజనంబులం బంప వారలు కనకపీఠంబున జానకిం గూర్చుండఁ బెట్టి. ౫౧౫.

చ. కరములఁ గంకణావళులు గల్లని మ్రోయఁగఁ బైఁటదూలఁగా
వరమణిహారముల్ పెనఁగ వజ్రపుఁగమ్మలడాలు చెక్కులం
దొరసి నటింపఁ బైకురుల మోయనఁ జెల్లు స్వరంబుతోడ నొ
క్కరమణి నూనె యంటెఁ గులకాంతలు పాటలు బాడుచుండఁగాన్.

క. నలుఁగిడుచునొక్కజవ్వని
జిలుగుంబయ్యెదకులోనఁజేయిడనటఁదా
నులికిపడఁజూచికాని
మ్మిలపతిజేపునినువిడుచునేయనినగియెన్. ౨౧౭.

క. తలదువ్వెనొక్కభామిని
జలకంబాడించెనొక్కజలజాక్షియుదు
వ్వలువఁదడియొత్తెనొకరితె
లలితముగానొకతెవలువలలసకుఁగట్టెన్. ౨౧౮.

సీ. చిక్కంటఁజేపట్టిచిక్కంటకుండంగఁ
గుఱులుదీరిచెనొక్కగురుతరరుచ
కచములసద్వికచముతోమల్లెల
ముడిచెనొక్కతెనూనెముడిచెలంగఁ
జదలుకెంపుజిగినొంచఁదలఁచుఘుసనవ
మణిభూషలొక్కరమణిఘటించెఁ
గన్నుఁదామరలనొక్కన్నుదానిడియెనం
జనమునుదనుసఖీజనముఁబొగడఁ
దిలకమొకగజగామినీతిలకమిడియె
మించులనుగెల్చురుచిచేతమించుపట్టు
పుట్టమొక్కతెమోదముపుట్టఁగట్టె
అవికఁదొడఁగెనొకపొలంతిసవినయముగ. ౨౧౯.

వ. ఇట్లు కాంతామణి నలంకరించి యూర్మిళామాండవీశ్రుతకీర్తు లను వేర్వేఱ సత్కవులనిజకృతులరీతి సర్వాలంకృతియుతలం గావించు సమయంబున నట దశరథుండు పూర్ణమనోరథుండై కనదుదార లగుతనదుదారలతోడ మంగళస్నానంబు లాచరించి కైసేసికొని

కార్యార్థంబు భువి కరుగుదెంచు వివాహాకు లగుసుతులకు వివాహవేషంబుల నలంకరింపించి వారలకు స్నాతకగోదానవ్రతంబులు నిర్వర్తింపించి భూసురోత్తములకు లక్షలకొలందుల ధేనువులును గనకరజతకాంశ్యప్రముఖనిఖిలదానంబు లొసంగి సపరివారుండై నిజాత్మజుల నుత్తుంగతురంగసంగతంబు లగుకనకశతాంగంబుల నెక్కించి తానును రథారోహణం బొనర్చి పురోహితబంధుమిత్రామాత్యవర్గంబుతోడ మంగళవాద్యఘోషంబు సెలంగ వివాహమండపంబు దగ్గరి. ౫౨౦.

సీ. రంగారుజిగిమించుపొంగారుపఁగఁజాలు
  బంగారుగోడలుపదిలపఱిచి
వేలాతిగస్వచ్ఛభాఁగాలితంబునౌ
  నీలాలకంబముల్గీలుకొలిపి
తగుడాలుచేరవిజగడాలకునుబెల్చు
  పగడాలదూలముల్పాదుకొల్పి
యందమ్ములైకాంతిబృందమ్ములగుసురు
  పిందమ్ములగవాక్షలొందఁజేసి
వెండిచేద్వారబంధముల్వ్రేఁడియునుగ
  వాటములవజ్రములఁదీర్చివాటముగను
దంతెలిటికలుఘటియించిదంతములను
  గారనునుముత్తెములమెఱుఁగారఁబూసి. ౫౨౧.

గీ. మోదమలరఁగఁగల్యాణవేదికలను
  బుష్యరాగంబులనుదీర్చిపొసఁగఁబచ్చ
తోరణంబులుగట్టికస్తూరినలికి
  ముత్తియమ్ములచేతనుముగ్గులనిడి. ౫౨౨.

వ. మఱియుం బెఱరతనంబుల నానావిధంబు లగుపనుల నిగ్గులు దేరుచుఁ గర్పూరదీపికావిరాజమానంబును, గాలాగరుధూపఘుమఘుమితంబును, బరిణతఫలశుంభద్రంభాస్తంభశాతకుంభభద్రకుంభసంభాసమానంబును, గతాగతభూతలపతికేయూరజాతఘర్షణజాతజాతరూపరేణుశకలితంబును, పణవమర్దళభేరీముఖవాద్యధ్వానబధిరీకృతదిగంతదంతావళంబును, రసాలకిసలయకుశలాజాక్షతసమిధాజ్యాదిసహితంబును, పరిణయాశ్వస్తుపరంపరానయనతత్పరపురోధస్సమంచితంబును నగు వివాహమండపంబుఁ గని తన కెదురఁ జనుదెంచు జనకభూజానికరంబుఁ దనకరంబునం బట్టికొని బట్టులు కొనియాడ పుణ్యాంగనాదత్తసేరాజనంబుల గణికాజనంబుల యాటపాటలఁ దనశిరఃకంపనంబులచే నంగీకరించుచుఁ దన్మండపాభ్యంతరంబునం బ్రవేశించిన సజ్జనకుం డజ్జనపతి నుచితపీఠంబున సుఖాసీనుం జేసి రామలక్ష్మణభరతశత్రుఘ్నుల వివాహవేదికలఁ గనకపీఠంబులం గూర్చుండం బంచుటయుఁ దదనంతరంబున వసిష్ఠుండు జనకవసుధాపతితో సుధారసమధురంబులై సరసంబు లగువచనంబుల లగ్నంబు డగ్గరిలెఁ గన్నెకల రావింపుఁ డనుటయు నతం డచటిసువాసినీజనంబులను బెండ్లికూఁతులం దోడ్తెం డని పంచిన. ౫౨౩.

క. వారలతిరయముతోఁజని
యారామలఁదోడితెచ్చియచటనచటవే
ర్వేరనుగూర్చుండఁబనిచి
తీఁగుశ్రీరామునెదుటి తెరనెత్తుటయున్. ౫౨౪.

వ. అప్పుడా రామచంద్రుండు సీతం జూచి. ౫౨౫.

క. కమలాసనుండుత్రిజగ
త్కమలాస్యలసారభూతకాంతినిఁగొనియీ

కమలాక్షినొనర్చినలో
　　కమలఘుతరవిస్మయంబుఁగాంచి చెలంగన్. ౫౨౬.

సీ. అరుణాంబుజప్రపంచరణముల్చరణము
　　ల్హాస్త్యస్త్రీవాక్కులనడుమునడుము
పరికింపఁగందర్పుపాలిండ్లుపాలిండ్లు
　　తలసమత్రివళిసుందరముదరము
కంబుప్రభాపొపకంఠంబుకంఠంబు
　　పూర్ణేందుకాంతిప్రముఖముముఖము
వరపల్లవోల్లాసకరములుకరములు
　　హరినీలరుచిపెంపుతుఱుముతుఱుము
మించునీలేమమెయిజగిమించులకుళో
　　మించుట నొనర్చిహాటకమిందమ్మకైన
నెంచదననిఁకభువినుపమించుటకును
　　మంచితంబైనవస్తువేమంచుఁదలఁతు. ౫౨౭.

వ. అని రామచంద్రుండు దలంచునెడ నజ్జానకియు రాము నీక్షించి.

క. ఘననీలకాంతినగునప
　　ఘనరుచిసంపూర్ణచంద్రుఘనతనుగనిలం
ఘనమొనరించెడుమొగమును
　　ఘనుఁడగుసీతనికిఁగాకగలుగదొరలకున్. ౫౨౮.

సీ. ఈరసికుఁడుగదాయీరసంబునఁదన
　　శరములనణఁచెనాసురగణంబు
నీదాశరథిగదాయీఁదశరమునవేఁ
　　గడలిమారీచునుక్కడలఁద్రోచె

నీశుభాస్యుఁడుగదాయీశుభాస్వత్కీర్తి
  కముఁద్రుంచెనిఖిలలోకములువ్రేగడ
నీజేఁడుగదతొల్తనీరేఁడుజగముల
  రమణీయనిజకీర్తిరమణిఁగొనఁగ
నీనవమనోహరాకృతియీనగధృతి
  యీనతావనపటుమతియీనయయుతి
యెవరికైననుగలుగునేయీవిభునకు
  నీవిభుఁడెసాటియగుఁగాకయింకఁగలరె. ౧౩౦.

వ. అని యిట్లన్యోన్యం బగ్గించుకొనునెడఁ దత్కటాక్షంబు లయ్యిరువురినడుమఁ బుండరీకేందీవరదామషండంబు లై చెలంగె నాసమయంబున. ౧౩౧.

సీ. జనకనృపాలుండుదనకూర్మికూఁతును
  విమలచిత్తంబునవిష్ణురూప
రామలక్ష్మీస్వరూపామిమాంకన్యాంప్ర
  తీచ్ఛతుభ్యంప్రదదేయటంచు
ధారవోసినయెడసౌరదుందుభులధిం
  ధిన్నినాదంబులుదేజరిల్లె
సురలునుగుసుమంపుసోనలుగురియించి
  రచ్ఛములైదెసలతిశయిల్లె
నపుడుపుణ్యాంగనాజనంబతిముదమున
  ముత్తైసరితండులంబులుముత్తియములు
శాతకుంభంపుభాజనజాలములను
  నించికొనితెచ్చియచ్చోటనిలుపుటయును. ౧౩౨.

మ. చిలువంబోలినయారుబైటఁబడఁ గాంచీఘంటికాధ్వానము
ల్విలసత్కంకణఘల్లుఘల్లుధ్వనులతో వియ్యంబునందంగఁ గ
న్నులలౌల్యంబు జెలంగఁగా బటువుచన్నుల్ ద్రోయిడిం జెందఁగా
లలనారత్నము సీత రాముతలపైఁ బ్రాల్పోసె మోదంబునన్. ౫౩౩.

క. జనకతనూభవచిత్తం
బును గన్నులు రాముమోముఁ బొందించియుఁ బ్రా
లనెటులఁ దప్పక యెత్తెను
కనులుంగలవే మొగమొకకరయుగమునకున్. ౫౩౪.

వ. అట్టియెడ. ౫౩౫.

చ. చిరతరకాంతులొప్పఁగను జెంపలముత్యపు టొంట్లు దూఁగఁగా
నురమున హారముల్ పెనఁగి యొక్కటఁ జిందులు ద్రొక్కుచుండఁగాఁ
గరమణికంకణప్రభలు గామినికమ్మలడాలుతో మత
స్ఫురమొనరింపఁగా విభుఁడు దొయ్యలి యాదలపైనఁ బ్రాలిడెన్. ౫౩౬.

క. మంగళవాద్యధ్వనులును
మంగలుల మనోజ్ఞగీత మహితరవములు
ప్పొంగఁగ రాఘవుఁ డప్పుడు
మంగళసూత్రంబుఁ గట్టె మహిజకు వేడ్కన్. ౫౩౭.

గీ. అట్టియెడ రాముకరమున నవనితనయ
పాణిపద్మంబునొక లేమ వట్టి నిలిపె
నిదియె గద యదననుచును మదనుఁ డపుడు
విరిశరంబుల నిరువుర నరసి వేసె. ౫౩౮.

గీ. మరుని కెదిరించి యాతని మఱల నొంచి
కొనఁదలఁచి యిరువురు నెత్తుకోలలనఁగ

సంగసీమలఁబులకలెసంగెఁగఁజెము
    లుంగరంబులుపట్టవయ్యెంగరముల. ౫౩౯.

వ. తత్సమయంబున శమధనవరిష్ఠుం డగువసిష్ఠుం డగ్నిం బ్రతిష్ఠితుం జేసి మహర్షిసంఘంబులతోడ సమంత్రకంబుగా నాహుతు లొసంగెఁ దదనంతరంబున. ౫౪౦.

గీ. వనితపదకమలంబునుదనదుహస్త
    పద్మమునఁబట్టిచిఱునవ్వుపరఁగనంది
యలఘుఘల్ఘుల్నాదంబులొలయనన్నె
    కల్లుఁద్రొక్కించెరాముఁడుగాంతచేత. ౫౪౧.

గీ. హరిణలోచనచూడ్కులవరునిగుంజె
    జల్లనఁగఁగంకణంబులుగల్లనంగ
లేనడుముఁదీగెకుచములతోనటింప
    లాజలగ్నినిముదముచెలంగఁ వ్రేల్చె. ౫౪౨.

ఉ. మేరుధరాధరేంద్రమునుమిత్రుఁడుఛాయయుఁజుట్టురీతిగా
సారములైనమంత్రములసారెకుసారెకుఁబ్రేల్వవెల్గునా
భూరితరాగ్నికిన్వరునుబూర్ణమతిందగినట్టిభక్తితోఁ
జేరిప్రదక్షిణంబులనుజేసినమస్కృతులాచరింపఁగాన్. ౫౪౩.

క. ముత్తైదువలచటిజను
    ల్చిత్తమువిస్మయరసంబుఁజెందికసంగ
న్జిత్తరువుపల్లెరంబున
    నెత్తిరియారతులుగీతమింపైచెలఁగన్. ౫౪౪.

క. భరతుండునుసౌమిత్రుల
    లరమాండవినూర్తికాఖ్యలలనల్ శ్రుతకీ

ర్త్యయుగాధరిఁ బొడిలియై
రరుదగు నానందరసమహాబ్ధి మునుఁగుచున్. ౫౪౫.

సీ. తరువాత నుద్యానతరువాతములు వీవ
విరిసోనసురులు వావిరిఁ గురియఁగ
రామాదినృపసుతుల్ రామలతో స్వని
వేశము ల్సేరి ప్రవేశహోమ
ములఁ జేసి మునిజనములతోడఁ గూడుక
ధ్రువకీర్తియై మించు ధ్రువునిఁ గాంచి
చనువారికోర్కు లొసఁగు నరుంధతిఁ గద
ద్వయునకు నానతుల్ పరఁగఁ జేసి
కడమపెద్దలకును మ్రొక్కి కౌఁగలించు
కీర్తిరంజిల్లి సజ్జనకీర్తితులయి
సంభ్రమాడంబరమ్ము లెసంగ నుండి
రొనర నాల్గుదినంబులు సనఁగ నపుడు. ౫౪౬.

క. రాముని ధూర్తసుబాహువి
రాముని మానితగుణాభిరాముని సుషమా
రాముని సతతత్రాతధ
రాముని నాశీర్వదించి రాముని పిదపన్. ౫౪౭

గీ. సకలశోభనములు సంతోషమునఁ గాంచి
జనకదశరథాదిమనుజపతుల
వినుతులందివారి వీడ్కొని ముదమున
నరిగెఁ గౌశికుఁడు హిమాద్రి కపుడు. ౫౪౮.

క. వైవాహికోత్సవంబును
వా వైభవ మొప్పఁ బూర్ణమగుటయు నానా

భూవర్యులరిగిరటునఁగ
రీవరములకాత్తసంభరితకుతుకముల౯. ౪౮౯.

సీ. అప్పుడుమిథిలేశుఁడానందముప్పొంగఁ
గరమర్థినల్వురుకన్యలకును
వరరత్నభూషణావళులువిచిత్రమౌ
చిత్రాంబరములుదాసీజనములు
నొసఁగియల్లుండ్రకుసమానమగురథ
గజవాజిసుభటవర్గంబమేయ
ముగనిచ్చిదశరథజగతీరమణునివ
సిష్ఠునిమిగులఁబూజించిపనుప
సుతులఁగోడండ్రఁదోడ్కొనిశుభదినమున
నమితమంగళవాద్యఘోషములుసెలఁగ
సకలమునులునమాత్యులుసరసఁగొల్వ
ఁ నర్కకులజుండయోధ్యకుసరుగుచుండ. ౪౯౦.

క. ప్రతికూలమారుతంబుల
మితముగవీవందొడంగెమింటనుభూరే
ణుతతుల్పొఁగెదెసలనం
ధతమసములుగప్పజనులుతల్లడమంద౯. ౪౯౧.

వ. ఇవ్విధంబున. ౪౯౨.

గీ. బలిసిదుర్నిమిత్తములుపెక్కుతోఁచుడుఁ
గలఁగిదశరథుండుకడుభయంబు
గమరనవ్వసిష్ఠుఁగాంచియిత్తెఱఁగేమి
తెలుపుమనఁగనతఁడువలికెనిట్లు. ౪౯౩.

క. ముందటనొక్కమహాభయ
మందఁజనున్నలిగితొలఁగునంతకుమదిలో
నందలఁకవలదటంచును
సందేహముఁబొందుచున్న సమయమునందున్. ౧౫౪.

పరశురాముఁడు వచ్చుట.

క. పరశువుమూపుననిడికొ
ద్రరసంబుప్పొంగరోషతామ్రాక్షుండై
ధరగంపింపమహోగ్ర
కరముగభృగురాముఁడెదురుగాఁజనుదెంచెన్. ౧౫౫.

వ. ఇట్లు మహోగ్రానలాకంబు ప్రజ్వరిల్ల శూలంబుఁ గేలం బూని విజృంభించుప్రళయకాలరుద్రుం డన రోషభీషణాకారంబునం బఱతెంచు పరశురామునిం గాంచి సకలజనసంఘంబులు కలంగి దొలంగుటయు దశరథవసిష్ఠాదులు గడగడ వడంకి భయనివారణమంత్రంబు లుచ్చరించుచుఁ బ్రత్యుత్థానంబు లొనర్పం గిపఁద్రోసి రాముని కెదుట నగ్నిశిఖయుంబోలె నతండు నిల్చుటయును. ౧౫౬.

గీ. రామభద్రుండు భార్గవరామునకును
గరము సంప్రీతి నెదురేగి కరయుగములు
మోడ్చి సద్వినయంబున మ్రొక్కి నిలువ
నతఁడు గైకొనకిట్లనె నాగ్రహమున. ౧౫౭.

క. మ్రొక్కఁబోకు నెయిరువది
యొక్కపరి రాజవరుల నుర్వీస్థలిపై
నుక్కణఁచిన నన్నెఱుఁగక
యక్కట యిట్లేలతోఁచె నర్భక నీకున్. ౧౫౮.

వ. అనిన రామచంద్రుం డిట్లనియె. ౧౫౯.

గీ. రవికులంబునదశరథరాజవర్య
తనయుఁడైపుట్టిరామాఖ్యుఁదనరు నేను
వెఱతు నేయొరులకునీకువిప్రుఁడవని
మ్రొక్కుటలుగాఁదలంపుమునివరేణ్య. ౫౬౦.

వ. అనినఁ బరశురాముం డిట్లనియె. ౫౬౧.

క. రాజన్యసైఁపననుచో
రాజవరాత్మజుఁడవగుచు రామాహ్వయతన్
రాజిల్లుచున్న విడుతునె
రాఁజనునాతోడనీకురణమొనరింపన్. ౫౬౨.

వ. అదియునుంగాక. ౫౬౩.

క. వినుమునుహరిహరులబలం
బనువొందఁగఁదెలియఁగోరియమరులజుండు
న్ననిపూనివిశ్వకర్మవ
లనఁగోదండద్వయంబులనుగొనియంతన్. ౫౬౪.

క. హరిహరులకొసఁగ వారలు
దురమొనరించుటయుఁగాంచిదోర్బలమెన్న
న్హరికెక్కుఁడనుచుమెచ్చుచు
సురలాసంగరముమాన్పశూలివిఫలుఁడై. ౫౬౫.

గీ. చేతివిల్లుదేవరాతునకొసఁగెనా
ధనువుజనకునింటఁదరతరముగ
శిథిలమగుచునుండశ్రీరామవిఱిచితౌ
దీననీబలంబుఁదెలియనగునె. ౫౬౬.

క. వనరుహనాభుండుశరా
సనమత్తఱిఋచికునకునొసంగినమఱియు

మ్మునిజమదగ్నికినిచ్చె
    న్ననివడియాఘనునివలనఁబడసితినేనుర్. ౫౬౭.

క. వినుమీవిలుఁగొనియనిలో
    వెనుదివియకపోరికార్తవీర్యార్జునము
ఖ్యనరాధీశులశోణిత
    మునఁబితృతర్పణమొనర్చిముదితుఁడనైతిన్. ౫౬౮.

క. ఈవిల్లువిష్ణుదేవుని
    చేవిలసిల్లినదిగానసిద్ధముగాఁగ
న్నీవెక్కువెట్టితేనియు
    భావించిరణంబొనర్తుబాలకనీతోన్. ౫౬౯.

చ. అనితనచేతివిల్లొసఁగనర్కకులుండదిపుచ్చిచివ్వనం
గొనయము నెక్కువెట్టికడుఘోరశరంబరిపోసిపల్కెనో
యనఘధరామరుండవనియాత్మసహించితిపీపదద్వయి
న్ననిమెదనన్నభీతిధృతిదూలిభృగూద్వహుఁడప్పుడిట్లనున్. ౫౭౦.

క. నీవాదివిష్ణుఁడవనుచు
    భావంబునఁదెలిసినాఁడభవహరనాకు
న్నీవలననోడుటయునీ
    భూవలయంబుననునిందవైరయదుసుమ్మీ. ౫౭౧.

గీ. ధరణిమునుగశ్యపునకేనుధారపోసి
    యుండుకతమునరాత్రులనుండఁగూడ
దనుదినంబుమహేంద్రాద్రికరుగుచుందుఁ
    గానఁబదములువలయునుగమలనాభ. ౫౭౨.

క. నాపుణ్యలోకమార్గం
    బేపారఁగ సేయుమనుఁడునినకులవర్యం

డాపగిదిఁ జేయఁ బొగడుచు

నాపరశుధరుండుసనియెనతిహర్షమునన్. ౫౭౩.

వ. ఇట్లు పరశురాముని భంగం బొనర్చి విడిచి పుచ్చి మహానుభావుం
డై యొప్పురాముపరాక్రమంబునకు నత్యంతసంతుష్టాంతరంగుండై
దశరథుండు సకలపరివారసమేతంబుగాఁ దోడ్కొని సాకేతనగరంబుఁ
జొచ్చి మంగళతూర్యనినాదంబులతోడ రాజమార్గంబున నేతెంచు
తఱిఁ బురంధ్రీజనంబులు హాటకసౌధాగ్రంబుల నిల్చి సంభ్రమంబున
లాజాక్షతాదులు సేసలు చల్లుచుం గాంచుచుండ నగరు ప్రవేశిం
చుటయును గౌసల్యాకైకేయీసుమిత్రాద్యంతఃపురకాంత లరుదెంచి
కొడుకులుఁ గోడండ్రును జేయువందనంబులు గైకొని యాశీర్వదించినఁ
దదాశీర్వాదంబులం గొని రామలక్ష్మణభరతశత్రుఘ్నులు దమతమ
యోషారత్నంబులతోడ నిజనివాసంబు లగురత్నఖచితభర్మహర్మ్యం
బుల సుఖం బుండు నయ్యవసరంబున. ౫౭౪.

క. కేకయనరవసుపనుపున

కైకసహోదరుఁడుసుభటగణములతోడన్

సాకేతనగరమునకుం

తేకడఁకన్వచ్చికొన్నిదినములుసనఁగాన్. ౫౭౫.

క. భరతునిశత్రుఘ్ననిఁదన

పురమునకున్వేడ్కఁగానపుడుదశరథభూ

వరుననుమతిఁదోడ్కొనిచని

నిరతంబుసుగారవంబునెఱపుచునుండెన్. ౫౭౬.

వ. అంత. ౫౭౭.

సీ. రామచంద్రుఁడుయౌవరాజ్యాభిషిక్తుఁడై

యెంతయుఁబ్రియమునవెల్లవారి

నేకరీతిగఁ గాంచి యేప్రొద్దు మన్నించి
 విశదకీర్తుల దిశల్వేలయఁ జేసి
హితబంధుజనపురోహితపరిచారక
 సముదయంబులకును సుముఖుఁడగుచుఁ
దనతండ్రిఁ గొలిచి సద్ధర్మ ప్రపాలన
 మునమించి సంతతామోదమంది
సీతతోఁ గూడి రత్నఖచితవిమాన
 రాజినలచంద్రకాంతవిరాజమాన
వేదికలభర్మసౌధాగ్రవీథులందు
 నిండువేడుకఁ గ్రీడించుచుండెనంత. ౫౭౮.

క. అంభోధిరాట్సుతాహృద
 యాంభోజవిహార మనుజహరిరూపధరా
జంభాసురారినుతవి
 శ్వంభర నగధీర సర్వజగదాధారా. ౫౭౯.

మత్తకోకిల. సారసాక్ష పురారివందిత సర్వలోకశరణ్య బృం
 దారకార్చిత పాదపద్మ సుధాసముద్రసుసద్మ సం
 సారఘోరఘనప్రభంజన సంతతోత్సవ మందరో
 ద్ధార దానవగర్వభంజన దంతిరాట్పరిరంజనా. ౫౮౦.

గద్యము. ఇది శ్రీమదుత్తరరంగనాథకరుణాకటాక్షవీక్షాసమాగత సరస కవితావైదుషీప్రవీణ పరమవైష్ణవకులకలశజలనిధిసుధాకర రామానుజదేశికగర్భశుక్తిముక్తాఫలాయమాన శృంగారసారసంగ్రహాభిఖ్య లక్షణగ్రంథనిర్మాణధురీణ ప్రహ్లాదచరితయక్షగానవిధాననిధాన గానవిద్యానూనపాండితీస్థాన రంగయాభిధాన ప్రణీతంబైన శ్రీమద్రామోదయం బను మహాపురాణంబునందు బాలకాండం బన్నది ప్రథమాశ్వాసము.

# అయోధ్యాకాండము.

క. శ్రీరమణీమణినిజహృ
త్సారససారంగకృష్ణశరదనిభాంగా
ఘోరాసురసందోహవి
దారోత్తరరంగభవ్యతార్క్ష్యతురంగా. ౧.

వ. అవధరింపుము. ౨.

క. శ్రీలలరదశరథోర్వీ
పాలుఁడునిజభుజసమగ్రబలమునధరణీ
పాలనమొనర్చిసద్గుణ
శీలుండనిపొగడనెంచుఁజిరయశమందెన్. ౩.

వ. ఇవ్విధంబున నిఖిలధరామండలాధీశులు కప్పంబు లిడి నిజానుజ్ఞానుసరణంబున వర్తింప సకలమహీతలంబును జిరకాలంబు నేలుచుండి దశరథుం డొక్కనాఁడు. ౪.

దశరథుండు శ్రీరామునకుఁ బట్టాభిషేకము సేయఁ బ్రయత్నించుట.

సీ. నల్వురుసుతులలోనంబెద్దయగువాని
బహుళయశస్సిద్ధిఁబడయువానిఁ
బరహితాచారతఁబరిఢవిల్లెడువాని
మహితసత్యోక్తిచేమలయువాని
నిద్ధతేజంబుననినునిఁబోలినవాని
నార్తరక్షణపరుండైనవాని
గురుబంధుజనకోటినరసిప్రోచెడువాని
సర్వసమత్వంబునలుపువాని

విజయలక్ష్మీసమేతుఁడై వెలయువాని
నఖిలశస్త్రాస్త్రకోవిదుండైనవాని
రమణజగదభిరాముఁ శ్రీరాముఁబట్ట
భద్రుఁగావింపఁదలఁచియప్పార్థివుండు. ౫.

వ. ఇట్లత్యంతోత్సాహసమన్వితుండై వసిష్ఠవామదేవప్రముఖమహర్షులను సుమంత్రాదిమంత్రివర్గంబులను సకలదేశనృపాలసంఘంబులను బంధుమిత్రపౌరజనజానపదులను రావించి యాసీనులం జేసి యిట్లనియె. ౬.

మ. వినుఁడేనఱ్వదివేలవత్సరములుర్వీభారముంబూనిది
గ్వినుతుల్గాంచితినింతకాలమరిగెన్వచ్చె వార్ధక్యమీ
ఘనసామ్రాజ్యరమాప్రపాలనమొగింగావింపఁగానిష్టనా
తనయుండారఘురాముఁబూన్తునిదియుక్తంబేనిఁదెల్పుండగున్. ౭.

వ. అని దశరథుండు నిజాభిప్రాయం బెఱింగించిన నందఱు నానందం బంది యిట్లనిరి. ౮.

క. రాముఁడురాజై వెలసిన
భూమహిళయొనర్చినట్టిపుణ్యముగాదే
యేమెప్పుడిదియెకోరుదు
మీమహిగాదెల్లజగము లేలునతండున్. ౯.

వ. కావున రామభద్రు నఖిలవిశ్వంభరాభారధౌరేయుఁగాఁ జేయం దగు నని ప్రార్థించుటయు దశరథుండు సంపూర్ణమనోరథుండై యభిషేకయోగ్యంబైన శుభలగ్నం బిడి రామచంద్రు రావించి తద్వృత్తాంతంబుఁ దెలియంజేసి వసిష్ఠానుమతంబునఁ బుణ్యాహవాచనోపవాసక్రమం బొనర్ప నియమించి పుచ్చి తన్మహోత్సవంబునకుఁ బురం బలంకరింపం బంచిన. ౧౦.

సీ. విపులగేహములందువిపణిమార్గములందు
　　భర్మహర్మ్యములఁజప్పరములందుఁ
గస్తూరిరేఖలొక్కటఁగ్రమంబునఁదీర్చి
　　యలరముత్తెములముగ్గులునమర్చి
మణితోరణములురమ్భాస్తంభములునిల్పి
　　యమితమహాధ్వజపతాకాదులెత్తి
ప్రతిమందిరములనుబందిళ్లువేయించి
　　కలరీతిశృంగారములనొనర్చి
తవిలినిస్సాణభేరీమృదంగతాళ
　　శంఖముఖమంగళారావసమితిమిగులఁ
జెలఁగఁగాఁజేసిరామాభిషేకలగ్న
　　సమయమరయుచునుండిరిసకలజనులు. ౧౧.

క. ఈవిధముననప్పురినిమ
　　హావిభవంబొప్పుచుండనక్కలకలముం
దావినిమంథరదలఁచె
　　న్భావంబునరామకార్యభంగమొనర్పన్. ౧౨.

వ. ఇట్లమ్మంథర తన్ను రామభద్రుండు బాల్యంబునఁ బాదభంగం బొనర్చుకారణంబునం జేసి తత్ప్రతీకారంబుగా రాజ్యభంగం బొనర్తు నని తలంచి వేగంబునం గైకేయీమందిరంబుఁ జేరి కనకరత్నప్రభాభాసమానం బగుమంచముపై హంసతూలికాతల్పంబునఁ బవ్వళించి యున్న యన్నాతిం గాంచి యిట్లనియె. ౧౩.

సీ. అమ్మలెమ్ముసతతమవనీశుప్రేమంబు
　　నమ్మియుందువీవునెమ్మనమున

నింకనెట్లుగూడునిమ్మహాభోగంబు
చేలవగుచునెఱుఁగఁజాలవకట. ౧౪.

వ. అనిన దిగ్గన లేచి యమ్మంథర నీక్షించి కైక యి ట్లనియె. ౧౫.

క. ఏమేమంథరయిటువలె
భ్రామకమగుమాటలాడిపరిపరిగతుల
న్నాముందిట్లునటించెదు
గామునకగపడితో తెల్పఁగాఁగదెయిపుడున్. ౧౬.

క. అనవినిమంథరయిట్లనుఁ
గనకాంగీనీదువిభుఁడుగారుణ్యమున
న్నినుమనుచుననుచునుందువు
వినవేరవుమీఁదనడచువృత్తాంతంబుల్. ౧౭.

క. భూమీశుఁడుభరతునిఁబర
భూములకుంబనిచిసకలభూవిభుఁగాఁగ
న్రామునిబట్టముగట్టఁగ
నేమించెఁగలగ్నమెల్లినియతంబుసుమీ. ౧౮.

క. పురినెల్లెడలమహోవై
ఖరిగనలంకారమిపుడుగావించెదరే
నరుదందికాంచివచ్చితి
నిరవుగనీకెఱుకపఱుపనిందునిభాస్య. ౧౯.

మ. అనినంగైకమహానురాగయుతచిత్తాంభోజయైపొంగియి
ట్లనియెన్రామధరాధిపత్యమిటుకర్ణానందమైయొప్పఁగా
వనితానీవలననవ్వినంగలిగెభవ్యంబయ్యెనేఁడంచుఁదా
ఘనహామౌక్తికహారమిచ్చుటయుఁదాఁగైకోకయయ్యెంతియున్. ౨౦.

గీ. ఏమిభాగ్యమొదవెనెలనాగనీమది
మెచ్చిపసదనంబులిచ్చుటకును
దస్కరునకుమూలధనముదొంగిలుటకై
దీపకళికనిడిన తెఱఁగుగాదె. ౨౧.

సీ. రాముఁడుధరణికిరాజైనఁగౌసల్య
రాజమాతయసంగరహివహించు
నీవాసఖీమణిసేవఁజేయఁగనుప్పు
నీముస్దుకోడలాభూమిజకును
బగిచర్యలొసరెంచుఁబడఁతియింతియెగాక
సకలభాగ్యంబులుసవతికొడుకు
స్వాధీనముగుటభూజనులుఁదదాజ్ఞను
వస్తులెక్కొలువనీవరసుతుండు
భటునికైవడిమెలఁగనేపగిదినీకు
నోర్వఁగావచ్చునేనిపుడోర్వనోపఁ
గానభరతునిఁబట్టంబుగట్టుటకును
దగునుపాయంబుఁజింతింపుతలఁపులోన. ౨౨

వ. అనిన మంథరతోడఁ గైక యి ట్లనియె. ౨౩.

గీ. రాముఁడగ్రజుండురాజయోగ్యుఁడుగల్గ
భరతుఁడవనినేల్లుపడయనేర్చు
నందరానిపదవికాశింపుమనియెద
వింతిసుంతయైననెఱుకలేక. ౨౪

వ. అనిన మంథర యి ట్లనియె. ౨౫

సీ. శతమన్యుకొలకునైశంబరాసురునిపై
దశరథుండరుగువోఁదగుణినిన్నుఁ

దనతోడఁగొనిపోవధవునిపైదనుజుండు
    మాయఁగప్పంగనమ్మాయనీవు
ధవళాంగుఁడనుమానిదయఁగన్నమాయ చే
    మాయించుటయుమెచ్చిమనుజవిభుఁడు
వరయుగంబొసఁగఁడేవనితగోమఱచితే
    యావరద్వయమిప్పుడడుగవలదె
యొకటరామునడవినుండఁగాఁబదునాల్గు
    వత్సరములుపనుపవలయునొకట
నన్ని యేండ్లుభరతునవనిఁబాలింపఁగాఁ
    జేయుమిదియతగునుపాయమతివ. ౨౬.

క. అనవిని పెనుగూర్కిడిమే
    లోకను తెఱఁగునలేచికైకగొబ్బునఁదనదా
సినిఁగౌఁగిటనిడిప్రియమున
    వినుతించుచుఁదొడవులొసఁగివీడ్కొల్పెవడిన్. ౨౭.

క. ఒడమెలనటుపుచ్చివయిచి
    కడుమాసినవలువఁగట్టికస్తురితలప
ట్టిడికైకయలుకదోఁపం
    బుడమింబవళించివగలఁబొగులుచునుండెన్. ౨౮.

వ. అంత. ౨౯.

సీ. రామరాజ్యాభిషేకసంభ్రమముఁగైక
    కెంతొప్రియమునవెఱఁగింపనిచ్ఛఁదలఁచి
దశరథోర్వీశుఁడారాత్రితద్గృహమున
    కరిగియమ్మానినీమణినరసికాంచి. 30.

క. తలఁకుచుఁ బల్కె నుదరుణీ
    తలపట్టిడి మోము వాఁడి తాలిమి దూల
న్మలినాంబరంబుఁ గట్టుక
    నిలపైఁ బవళింప నేల నెఱిఁగింపఁగదే. 3౧.

సీ. రాకేందుబింబంబు రహిమించు నీమోము
    కన్నె నేఁ డేలొకో చిన్నవోయె
సౌదామనీరేఖ సరిపోలు నీకాంతి
    కాంత నేఁ డేలొకో కందువాఱె
బెళుకు బేడిసమీలఁ బెనఁగు నీకన్నుల
    నెలఁత నేఁ డేలొకో నీరు గ్రమ్మె
మృదుపల్లవంబుల మెఱుఁగాఁగు నీమేనఁ
    దొయ్యలి నేఁ డేల ధూళి గప్పె
నిట్టిదీనదశల నేటికిఁ బొరలెద
    వెవ్వ రెగ్గుసేసి రెఱుఁగఁ బల్కు
వారివారినారివారింతు దోరింతు
    నింతి యింత వింత చింత వలదు. 3౨.

వ. అని పెక్కుభంగుల నూరార్చుచుఁ గరపల్లవంబున మేనుఁ దడవుచు దశరథుండు మఱియు నిట్లనియె. 33.

చ. పలుకవిదేల నే చెలియ పల్కుము నేనిను వేఁడుచుండఁగాఁ
గులుకుమిటారి నాపయినిఁ గోపము రాఁగ తమేమి నీకుఁ గో
ర్కులు నెఱిఁగింపు మింతి తిలకింప నొనర్చెద నీమనంబు రా
మెలఁగెద లెమ్ము సమ్మదము మీఱఁగ నవ్యపయోరుహాననా. 3౪.

గీ. అడుగు మెద్దియైన నబల యేనొసఁగెద
    ననినఁ గైక మోదితాత్మ యగుచుఁ

దిన్నఁదనముదోఁపసన్నయెలుంగున
భానుకులునిఁజూచిపలికెనిట్లు. ౩౫.

క. దేవానాదగుకోర్కెల
నీవొసఁగెదనన్నమాటనిక్కముఁజేనిం
భావంబలరఁగనమ్మికఁ
గావించినఁగానినమ్మఁగానేనోపన్. ౩౬.

వ. అనిన దశరథుం డిట్లనియె. ౩౭.

క. ఎవ్వనినిమిషంబేనియు
నివ్వసుధంబాసిప్రాణమేనిల్వఁగలే
నవ్విమలురామసాక్షిగ
జవ్వనినీకోర్కెయిపుడొసంగెదఁజెపుమా. ౩౮.

వ. అనినఁ గైక మనంబున నపరిమితానందంబు నొంది యమరహితార్థం బబ్జనాభుం డగురాఘవుండు దశకంఠకంఠలుంఠనం బొనర్ప నిదియ మూలం బనుతెఱంగున దశరథుం గాంచి యిట్లనియె. ౩౯.

సీ. మునుసురాసురయుద్ధమున నొక్కతఱినన్ను
మెచ్చివరద్వయమిచ్చిమనిచి
తనఘతద్వరములనడిగెదనిప్పుడు
సత్యంబుదప్పకొసంగదేని
రామునిఁగాంతారభూములేలింపుము
పదునాల్గువర్షముల్పరఁగనొకట
భరతునిసామ్రాజ్యపదవిఁబాలింపఁగాఁ
బంపుమొక్కటికినిఁదెంపుమీఱ
ననినగుండెఝల్లుమనఁజెనుమూర్ఛను
మునిఁగిధరణిపైనిమ్రొగ్గిలేచి

కైకఁ గాంచి మదిఁ గలఁగి నృపాలుండు
ధృతిఁ దొలంగి పలికె దీనుఁ డగుచు. ౪౦.

గీ. కటకటా రామచంద్రునిఁ గాననముల
పాలొనర్చు మటంచు నేర్పడ వచింప
నెట్లు నోరాడె నీకు నెగ్గే మొనర్చె
నింత పాపపుఁ జింతనం బేల కైక. ౪౧.

క. నీతనుజన్ముఁడు భరతుఁడు
నీతియుతుం డెట్లు నీపనికి నొడఁబడునో
పాతకి యుప్పగిది నప
ఖ్యాతికిఁ బాల్పడఁగ నేల కడుఁ గ్రూరమతిన్. ౪౨.

క. తనజననికంటె నెక్కుడు
గను నిను భావించి సేవ గావించెడియ
త్యనఘు రఘువంశతిలకుని
మనమున నమన్నింప రాదె మదగజగమనా. ౪౩.

క. రాముని సద్గుణధాముని
గోమలి యే నెట్లు వాసి కుందుచు నుందు
న్నా మనవిఁ జిత్తగించి యిఁ
కేమైనను వేఁడు మెడయ కిచ్చెద నీకున్. ౪౪.

క. విను మీ సర్వమహీతల
మును భరతున కొసఁగి నిక్కముగ నేలింతు
న్ఘనుఁడగు రాముని నా చెం
తనె యునుపుము దయఁ దలంచి తామరసాక్షీ. ౪౫.

సీ. రత్నసౌధంబుల రాజిల్లు సుకుమారుఁ
డడవులలో నెట్టు లడల నేర్చు

బంతినిష్టాన్న మేర్పడభుజించెడిపుణ్యుఁ
డాకులుగాయ లెట్లారగించు
బంధుమిత్రామాత్యపరివృతుండగుధీరుఁ
డలమృగావళి నెట్లుకలసిమెలఁగుఁ
బలుమృదుశయ్యలఁబవ్వళించెడిభోగి
తృణశయ్య నెట్లునిద్రింపఁదొడఁగుఁ
గాంచనాచ్ఛాదనముఁగట్టుఘనుఁడునార
చీర లెటుపూనిమునివృత్తిఁ జెందియుండుఁ
బ్రాణపదమైనరామునిఁబాయఁజాల
నీకు మ్రొక్కెదఁగరుణింపునీరజాక్షి. ౪౬.

వ. అని యిట్లు శోకదందహ్యమానమానసుండై పాదంబులపయిం బడి యనేకభంగులఁ బ్రార్థించెడు దశరథుం గడద్రోసి కోపోద్దీపితమానసయై కైక యిట్లనియె. ౪౭.

క. మునునాకొసఁగినవరములఁ
బనివడి వేఁడినను మొగులఁబరితాపమునం
బెనఁగెదవిపుడిచ్చుటలే
దన రాదేయింత యేలనవనీనాథా. ౪౮.

గీ. పెద్దభార్యసుతునిఁ బెద్దచేసియొసీవు
నతఁడు నేలుచుండుఁ డఖిలరాష్ట్ర
మేనునాతనూజుఁ డిప్పుడె ప్రాణము
ల్బాసిపోదుమూర్ధ్వపదవిఁ జెంద. ౪౯.

వ. అని యిట్లు కర్ణకఠోరంపుఁబలుకులం బలుకు కైక కెదు రాడ నోపక మనంబునం గుంది దుఃఖార్ణవంబున మునింగి దశరథుం డవనీతలంబునం బ్రజ్ఞామగ్నత్వం బంది యుండె నంత. ౫౦.

క. అరుణోదయమగుటయుఁదూ
ర్యరవంబుల మేలుకాంచి రాముఁడుసీతా
తరుణీమణిసహితమ్ముగఁ
బరిమళజలములనుగ్రుంకిపరమోత్సుకుఁడై. ౫౧.

గీ. కనకచేలంబులనుగట్టిఘనవిభూష
ణములుగైసేసిభూసురసమితికెల్లఁ
గ్రమమునీఁజంగ నిఖిలదానములుదగనొ
సంగికృతకృత్యుఁడైయున్న సమయమునను. ౫౨.

సీ. అభిషేకమండపాభ్యంతరమునకువ
సిష్ఠాదిమునులుసచివులుబంధు
వర్గంబులునుజక్రవర్తులుఁబౌరులుఁ
జనుదెంచిగంగాదిసలిలములును
మంగళవస్తుసామగ్రులఁదెప్పించి
తగహోమజపశాంతితతులొనర్చి
యనుపమంబగులగ్నమాసన్నమగుటయు
మనుజేంద్రుఁబిల్వసుమంత్రుఁబనుప
నయ్యమాత్యుఁడుకైకగేహమునకరిగి
తత్క్రమం బెఱిఁగింపనత్యంతశోక
పరవశత్వంబునొందియప్పార్థివుండు
మాఱుపలుకకచింతాసముద్రుఁడయ్యె. ౫౩.

వ. అయ్యవసరంబునఁ గైక సుమంత్రునిం గాంచి రామునితోడ భూపా లుండు పిల్వం బంచె నని పల్క తోడ్తెమ్మన నతం డతిత్వరితగతిం జని కక్ష్యాంతరంబులు గడచి మహావిభవసంపన్నం బై యొప్పు

తన్మందిరంబుఁ జేరి రామచంద్రునకు నుచితప్రకారంబుల నమస్క
రించి తద్వృత్తాంతం బెఱింగించి విచ్చేయుం డనుటయును. ౫౪.

సీ. అతిముదంబలరార నారఘూద్వహుఁడుల
క్ష్మణసహితముగ నాక్షణమునందె
యరదంబు పైనెక్కి ద్విరదఘోటకభట
వ్రాతంబులును గొల్వ వందిజనుల
కైవారరవములు కాహళమురజశం
ఖాడంబరములు మిన్నందిమ్రోయ
సౌధాగ్రములనుండి సకలపుణ్యాంగన
లేసలుచల్లి యాశీర్వదింపఁ
బురజనంబులు నందందఁ బొదలుచుండ
రాజమార్గంబున నుగడు రాజసమున
నరిగి తన్మందిరముఁ జొచ్చి యచటనున్న
జనకునకు మ్రొక్కి కైకకంజలి యొనర్చి. ౫౫.

క. వదనమటువంచి పైఁ బైఁ
బొదలెడు కన్నీటితోడఁ బొక్కుచుఁ గడుశో
కదవాగ్నిఁ బెనఁగు నృపుఁ గని
యదరున రాఘవుఁడు గైకకపు డిట్లనియెన్. ౫౬.

క. ఓ దేవి భూపవర్యుఁడు
నా దెసఁ గన నోపఁడే నొనర్చెడు మ్రొక్కు
ల్మోదమునఁ గైకొనఁడు నా
మీఁదం గలకోప మేమొ మిహిరకులునకున్. ౫౭.

క. ఇటువలె మజ్జనకుఁడుదు
ర్ఘటమగు శోకంబు నొందఁగత మెయ్యది యో

తటుకునఁ దెల్పుముపాపెద
    నెటులైనందడయకిప్పుడేని దెబాలనీ. ౫౮.

వ. అనినఁ గైక యి ట్లనియె. ౫౯.

మ. మునుదేవాసురసంగరస్థలినినామోదించినాకిచ్చెనీ
మనుజేశుండువరద్వయంబుమఱియమ్మాటన్మదిన్నమ్మినా
తనయున్భూతలమెల్లనేలుటకుఁగాంతారావనిన్నిన్నుఁబా
లనఁజేయంబదునాలుగేండ్లనుపఁజాలన్వేఁడితిన్ బాలకా. ౬౦.

క. ఇచ్చెదనని నిన్నిచటికిఁ
    జెచ్చెరఁబిలిపించియటులఁజేయుమనఁగఁదా
నిచ్చసరిరాక నృపవరుఁ
    డెచ్చినశోకంబువొందెనింతియెసుమ్మీ. ౬౧.

క. కావునఁబితృవాక్యంబిపు
    డేవగనైనంఘటింపనెంచెదవేనిం
భూవరుఁడూఱటఁజెందఁగ
    నీవరుగుమరణ్యమునకునిప్పుడెవత్సా. ౬౨.

క. అనినంగైకేయికిని
    ట్లనియెరఘువరుఁడుమందహాసంబొప్ప
న్ననుఁబిలిచితెలుపరాదే
    జనవిభునకుఁజింతఁగూర్పఁజనునేజననీ. ౬౩.

క. ధరనేలువాఁడునాసో
    దరుఁడఁటపితృవాక్యసరణిఁదగఁబాలింప
న్నిరమఁటయింతటికంటెం
    బరమానందంబుగలదెపరికింపంగన్. ౬౪.

క. జననికినిసుమిత్రకునా
జనకతనూజకును దెల్పి చయ్యనవత్తు
న్జననాథుఁడూఱడిల్లఁగ
నొనరింపుముకాఱులాడనోడుముతల్లీ. ౬౫.

వ. అని కైకతోడం బల్కి రాఘవుండు లక్ష్మణసహితుండై నిజమంది రంబునకుం జనుదెంచునప్పుడు జనకనందన యెదుర్కొని రామ చంద్రుం గనుంగొని రాజచిహ్నంబు లేమియుం గానక నివ్వెఱఁ గంది యి ట్లనియె. ౬౬.

ఉ. పట్టముగట్టనేనృపతిబంధుహితాదులమాత్యవర్గము
ల్చుట్టునఁగొల్చిరారుకడుశోభనమంగళవాద్యఘోషమే
పట్టునఁగానమిప్పనికపాయముగొండొకశేవఁగల్గెనో
పెట్టినలగ్నమెట్లుచనెఁ జేర్కొనుమిప్పుడుప్రాణవల్లభా. ౬౭.

క. సోమునిఁదెగడెడియానన
మేమొకొకడువాఁడువాఱియేర్పడఁదోఁచె
న్నామదిఁగలఁకదొలంగఁగ
స్వామీయెఱుగంగఁబల్కఁజనునాతోడన్. ౬౮.

వ. అని యిట్లు డోలాయమానమానసయై యడిగిన జానకిం గాంచి రామచంద్రుం డి ట్లనియె. ౬౯.

చ. అవనిపుచేవరద్వయమునర్థిగమున్వరియించెఁగైకయం
దవనికిరాజుఁగాఁగఁదనయాత్మజునొక్కటికిన్ననున్మహా
టవిఁబదునాలుగేండ్లనుపుట్నతియొక్కటిగాఁగఁగోరెమా
నవపతివాక్యపాలనమొనర్పఁగఁబోయెదనింతిపంపుమా. ౭౦.

క. అనిరాఘవుండుపల్కినఁ
దనమదిశోకాగ్నిమిగులదరిగొల్పటయు

జ్జనకతనూభవ ప్రమాన్వడి
    ఘనమగునిట్టూర్పునిగుడఁగానిట్లనియెన్. ౨౧.

మ. నినుమార్తాండకులప్రదీప్తనిమహానీతిజ్ఞనింద్రాజ్ఞనిం
ఘనకాంతారమునంజరింపుమనఁగాఁగైకేయికెట్లోప్పెనె
మ్మనమాహావిధికేమొనర్పనగునిమ్మాటిక్కన్నిజంబైనచో
ననుఁదోడంగొనిపొమ్ము వచ్చెదనిటన్నాయున్కిసైరింతునే. ౨౨.

సీ. అడవులయందునీవడలుచువిహరింప
    మందిరంబుననెటులుందు నేను
గందమూలాదులోక్కటనీవుగొనుచుండ
    నిష్టాన్న మెటుభుజియింతు నేను
దృణతల్పమునసీవుదీనుఁడైపవళింప
    గురుశయ్యనెటునిద్రగొందు నేను
ఘనమృగంబులనీవుగలసియుండఁగమను
    జులలోననెట్లుఁవర్తిలుదు నేను
నారచీరలుధరియించినయముదక్కి
    పేదతనమునసీవుండమోదమలరఁ
జిత్రచేలంబులనుగట్టిచెల్వుదోఁపఁ
    నేనిచటనొంటినెట్లుండనేర్తుఁజెపుమా. ౨౩.

వ. అనిన రామచంద్రుం డి ట్లనియె. ౨౪.

చ. వనముల ఘోరదుర్గములవన్నె మెకంబులనేఱుల న్మహా
మునిజనసంఘమందకటముద్దియనీవెటులుండనేర్తువీ
దినములతిత్వరంగడపిధీరతతోఁజనుదెంతుఁబోయిర
మ్మని సెలవిమ్మనన్రఘుకులాగ్రణికప్పుడుసీతయిట్లనున్. ౨౫.

క. నినుఁబాసియొకనిమిషమై
నను దాళఁగఁజాలనట్టినన్ను విడిచికా
ననమునకు నొంటినరుగఁగ
మనమున నైరించి తెట్లుమనుకులతిలకా. ౨౬.

క. నీవున్న వనముపురమగు
నీవును లేనట్టియూరునిక్కముడవియగాఁ
గావునభవదాశ్రితనై
యేవచ్చిననేమికొదవయినవంశనిధీ. ౨౭.

క. కలఁకంబాఱెడినామది
జలజాతహితాన్వయాబ్ధిచంద్రవినుముకా
నలకునినుఁగూడివత్తు
న్వలదనినంజత్తునొండువార్తలిఁకేలా. ౨౮.

వ. అని కృతనిశ్చయయై పాదంబులపయిం బడి సంతాపించు జానకి
నూరార్చి తదాగమనంబునకు సమ్మతించి లక్ష్మణునిం గాంచి రాఘవుం
డి ట్లనియె. ౨౯.

ఉ. తమ్ముఁడ కాననంబునకుఁదప్పకపోయిబిఱానవచ్చెద
న్సమ్మతిమీఱఁగానృపతిసత్తమునూఱడిలంగఁజేసిహ
ర్షమ్మొనవింపుచున్నదివిషాదమునొందఁగనియ్యకెప్పుడీ
విమ్ముగఁగాచియుండఁదగునేమఱకేనరుదెంచునంతకున్. ౩౦.

వ. అనిన లక్ష్మణుం డగ్రజున కంజలీబద్ధకరకమలుండై యి ట్లనియె.

క. కలనైనభవచ్చరణకి
సలయము లేమఱకకొల్వఁజాలెదునన్ను
న్వలదనియిట్లువదలికా
నలకేగందగునెనీకనఘయీవేళన్. ౩౧.

చ. జనకునినొల్లనన్ననినసాధ్విసుమిత్ర నెదందలంపన
య్యనుజునిఁగోరభోగవిభవాదులసంస్మరణంబొనర్పన
త్యనఘములౌభవత్పదయుగాబ్జములే శరణంబులంచునె
మ్మనమున నెన్ను నన్ను బలుమన్నన చేయఁగదయ్య రాఘవా. ౮౩

మ. వనదుర్గంబులమిమ్మునిత్యమునుగొల్వంగందమూలాదులే
పునన ర్పింపఁగఁబర్ణశాలలచటంబొంకంబుగాఁగట్టనెం
దునసేమాఱకకార్ముకంబులులసత్తూణీరముల్గొంచురా
ననువెంటంగొనిపొమ్మువత్తువలదన్నంజత్తునిక్కంబుగాఁ. ౮౪

వ. అని యిట్లు చలితమనస్కుండగు ననుజన్మునిరాక కామోదించి నిజ భండారంబునం గల సర్వధనంబు లవనీసురుల కవారిగా నొసంగి శరశరాసనగదాఖడ్గతూణీరాదినిఖిలసాధనంబులం గైకొని గమనో న్ముఖుం డగుటయుఁ దద్వృత్తాంతం బంతిపురంబునం బురంబునం దెల్లెడలం బ్రసిద్ధినొందిన సకలజనంబులు పరితాపం బంది రంత రామభద్రుండు సీతాలక్ష్మణసహితుండై కౌసల్యామందిరంబు డా యం జని. ౮౫

క. తనసుతునకుభూలాభం
బనువొందఘటింపఁగోరియతినియమములో
డనువిప్రులకమితంబగు
ధనములుభోజనములొసఁగుతల్లింగనియెఁ. ౮౬

గీ. ఇట్లుపొడగనివలగొనిహెచ్చుభక్తిఁ
బదములకుమ్రొక్కెఁగౌసల్యపట్టినీవు
పట్టభద్రుండవగుముభూభారమూన
ననుచుదీవింపరాముఁడిట్లనియెనపుడు. ౮౭

క. జననీనివంతఃపుర
మున వెలయు మ వెట్టి కార్యము నెఱుంగవునీ
మనమునకు ఖేద మొదవెడు
పని గల్గ దెల్లముగ నుబ లెక్కదవినుమా. ౮౮.

గీ. శంబరుండను దనుజు పైత్యో వరుండు
సనఁగ నొక యెడ రుసఁ గైక సంతరింప
నయ్యెడను మెచ్చి వరయుగంబర్థి తోడ
నిచ్చి యుండిన కతమున నింతి యిపుడు. ౮౯.

క. అట్టి వరద్వయమునకు
న్నట్టడవి కినన్నుఁ బదియు నాల్గేండ్లుండన్
దిట్టముగ ననుప భరతునిఁ
బట్టముగట్టంగ వేఁడెఁ బార్థివుఁడొసఁగెన్. ౯౦.

గీ. కానఁ గానలకును గడు వేగఁ బితృవాక్య
పాలనంబొనర్పఁ బ్రజ్ఞ మెఱసి
యేను లక్ష్మణుండు నీ సీతయును గూడి
యరిగి వత్తుమమ్మ యానతిమ్ము. ౯౧.

వ. అని రామభద్రుండు పలుకుపలుకులు పెనుములుకులవలె హృద
యంబు భేదిల్లం జేయుటయు మహావాతూలహతిం ద్రెళ్లు మహీ
జంబు కైవడి ధరణీతలంబునం బడి మూర్ఛిల్లిన రామలక్ష్మణులు
శైత్యోపచారంబులం దేర్పం దెలివొంది నిజాత్మజుం గాంచి శోక
పరీతచిత్తయై యిట్లనియె. ౯౨.

సీ. కటకటా కట్టిఁడి కైక నోరెట్లాడె
నినుఁ గానలకును బొమ్మనఁగ నిపుడు

దానిమాటకుజవదాటక భూవిభుం
డిట్టిపాపంబొడిగట్టఁజను నె
యిలువ దేనేండ్లుని న్నెలమిఁబోషించి నేఁ
డెడఁబాయ నామనం బెటుల సైఁచు
నానోములఫలంబ నాముద్దులయ్యనీ
మోముఁజూడక ప్రాణ మేమి నిలుచుఁ
బట్టి నేటిదినంబునఁ బట్టభద్రుఁ
డగుచు ననుఁగాంతు ననిన మ్మియలరుచున్న
నాకుతూహలమెల్లఁ గాననముఁ జేరె
నహహ విధికృతమిట్లౌటనరయనైతి. ౯౩.

ఉ. పుట్టినయప్డు భూసురులు పొందుగనీకరపాదరేఖలం
బట్టి మహీతలంబితఁడు పట్టముగట్టుకభాగ్యసంపద
న్నిట్టముగాఁగ నేలునని తెల్పెఁ దొణంగిరిగానిమానియై
నట్టడవింజరించు ననినాకెఱిఁగింపక పోయిరక్కటా. ౯౪.

గీ. అన్న నిన్నుఁ జూడకున్న నేనిచ్చోట
నెట్లు దుఃఖవార్ధి నీఁదుచుందు
నన్ను విడిచి కాననమునకేపరిగిన
నిమిషమైన బ్రతుక నేరఁ జుమ్ము. ౯౫.

వ. అని పెక్కుభంగుల విలపించుచున్న కౌసల్య నూరార్చుచు రాఘవుం డిట్లనియె. ౯౬.

చ. కులపతి పైనిఁ బ్రేమమునఁ గోర్కెలొసంగఁగ రాదె భూవిభుం
డలవరమున్ని జంబనుచు నాయమ వేఁడఁగ రాదె నేను గే
వలదృఢభక్తిఁ బెంచి పితృవాక్యమొనర్పఁగ రాదె యెవ్వరిం
దలఁచెద వెగ్గుగానిపుడు తల్లి మదిం దలపోసి చూడుమా. ౯౭.

గీ. సత్యసంధుఁడైనజనకునాజ్ఞఁజతుర్ద
శాబ్దములునరణ్యయాత్రసల్పి
సంతసమునవత్తుఁజయ్యనఁబంపుమీ
తల్లియొల్లనసకతాల్మిమీఱ. ౯౮.

వ. అనినఁ గౌసల్య యిట్లనియె. ౯౯.

క. ధారుణినీకొసఁగెదనని
ధారాళముగాఁగఁబల్కి ధరణీశుఁడునేఁ
డారడిపుచ్చిమహాటవి
కీరీతింబనిచెసత్యమెక్కడనిలిచెన్. ౧౦౦.

గీ. కైకరాజ్యమెల్లఁగైకొనిసుతునకు
నొసఁగనిమ్మునీవునొండుదక్క
నన్నుఁగొలిచియుండుమన్నయింతయెచాలు
నడవికరుగనేలజడునిభంగి. ౧౦౧.

వ. అని యిట్లు కౌసల్య దీనోక్తులం బ్రలాపించుచుఁ బల్కుచుండునెడ
నడ్డంబై లక్ష్మణుండు రామభద్రున కిట్లనియె. ౧౦౨.

గీ. అన్నశ్రీరామనీదురాజ్యాధిపత్య
మొరునకర్పించిమునివృత్తినుగ్రగహన
సీమకరుగంగనేటికిసిద్ధముగను
బాహుబలశౌర్యశస్త్రసంపదలమఱచి. ౧౦౩.

క. మగటిమిమానముయశమును
దగనుత్తమమైనరాజధర్మంబెల్లం
దిగవిడిచిపేదకైవడిఁ
దగునేదీనోక్తులాడధైర్యమువలదే. ౧౦౪.

క. నీతివిహీనుఁడుమఱికా
  మాతురుఁడుఁగృపారహితుఁడునయిభూపాలుం
 డీతఱినిట్లనిపల్కెడు
  నేతీరునఁజేయనొప్పునినకులతిలకా. ౧౦౫.

గీ. మునులసన్నిధినీరాజ్యమొసరనీకు
  నొసఁగితోడనెయడవికిమసలకేగు
 మనియెఁదనయాలిమాటకైయవనిలోన
  నిట్టిక్రూరాత్ముఁడెందైననెన్నఁగలఁడె. ౧౦౬.

క. ఎక్కడిదశరథభూవరుఁ
  డెక్కడికైకేయిభరతుఁడెక్కడియనుజుం
 డుక్కడఁచిరాజ్యసంపద
  లక్కజముగఁగొనఁదలంపుమతివేగమునన్. ౧౦౭.

మ. అటుగాదేనియుమద్భుజాబలసమగ్రాటోపముప్పొంగనా
 ర్భటవృత్తిన్భరతాదిదుర్మతులవేభస్మంబుగాఁజేసిదు
 ర్ఘటమారాజ్యరమావిభూతికినినుంగట్టింతుఁబట్టంబునేఁ
 డిటుచింతిల్లెడుతల్లియుల్లమునునీవింపొందఁగాఁజేయుమా. ౧౦౮.

వ. అని యత్యంతకోపాటోపసమన్వితుండై సౌమిత్రి పల్కుచున్నసమ
 యంబునఁ గౌసల్య రాఘవునకిట్లనియె. ౧౦౯.

గీ. వింటె రాఘవలక్ష్మణువిమలవాక్య
  సరణిసీమదినీవట్టిజాలిమాని
 రాజ్యపదవులనెల్లసంపూజ్యుఁడవయి
  పాలనముసేయఁగదవయ్యప్రజ్ఞమెఱయ. ౧౧౦.

క. జనకునియానతిఁగైకొని
  వనమునకరుగంగఁగోరువాఁడవుమదిలో

జననియగునాదువాక్యము
    వినరాదేయిదియుధర్మవిధియనఁదగదే. ౧౧౧.

వ. అనిన రామభద్రుండు కౌసల్య కిట్లనియె. ౧౧౨.

క. అమ్మాభూపతియానతి
    సమ్మదమునసీవునేనుసలుపవలయుట
న్నెమ్మదినెఱిఁగియెఱింగియు
    నిమ్మాడ్కిన్వగలఁబొగులనేలొకోచెప్పుమా. ౧౧౩.

క. ధర్మములకెల్లమున్నగు
    ధర్మముగదజనకునాజ్ఞఁదగఁజేయుటయు
న్నిర్మలచిత్తవునీవి
    ధర్మవిరుద్ధములుపల్కఁదగునేజననీ. ౧౧౪.

క. మునుజనకునివచనంబునఁ
    బనివడిభృగురాముఁడొండుపలుకకజననిం
ఘనఖడ్గధారఁదునుముట
    వినమేయీతెఱఁగుభువనవిఖ్యాతముగాన్. ౧౧౫.

గీ. నిఖిలధర్మవిదుఁడునిరతవ్రతాచార
    మహితుఁడైనకండుమౌనివరుఁడుఁ
దండ్రియాజ్ఞనెఱపఁదానొకగోవును
    జంపినాఁడటంచుజననివినవె. ౧౧౬.

క. ఈలక్ష్మణుండుబాలకుఁ
    డేలీలనెఱుంగనేరఁడింతైనను వీ
రాలాపంబులుపల్కెడు
    జాలింబడివినఁగవలదుజననీవానిన్. ౧౧౭.

వ. అని కౌసల్య నూరార్చుచు లక్ష్మణుం గాంచి రాఘవుం డిట్లనియె.

క. సౌమిత్రియిదియెన్నాపైఁ
ప్రేమాతిశయంబుభక్తిపెంపునుమఱినీ
వేమనిబుద్ధులుగఱపితి
వేమిప్రతాపములునుడివితెమందునిన్నున్. ౧౧౯.

క. అడిగినదిత్తల్లివరముల
నుడుగకమఱియొసఁగెఁదండ్రియుర్వీస్థలినే
లెడువాఁడుసహోదరుఁడీ
య్యెడనెవ్వరిపైనినలిగెదెలుఁగంజెపుమా. ౧౨౦.

వ. అని యడిగిన లక్ష్మణుండు శిరంబు వాంచి యూరకున్న రాఘవుండు కౌసల్యతోడ మఱియు నిట్లనియె. ౧౨౧.

చ. జనకుననుజ్ఞకైదహనజాలముఁజొత్తుహాలాహలంబునై
ననుగబళించిమ్రింగుదుమనంబుననొండుదలంపనన్నచో
వనమునకేగుటెంతపనివారకయిప్పుడెపోయివచ్చెద
న్ననునఁబంపుమీప్రజననీవగపేటికిమాటిమాటికిన్. ౧౨౨.

వ. అని యిట్లు రాఘవుండు నానాప్రకారంబులం బ్రబోధించుచు వనంబున కరుగ నిశ్చయించియుండుట విలోకించి కౌసల్య తనమనంబునఁ గుందుచు మఱియు నిట్లనియె. ౧౨3.

గీ. నన్నుఁగన్నతండ్రినాయన్ననినుఁబాసి
మానసంబునిల్పిమనఁగఁగలనె
యేనుకాననమునకేమఱకరుదెంతు
నీవరంబొసంగుమింతెచాలు. ౧౨౪.

చ. భరతుఁడురాజ్యసంపదలఁబ్రాభవమొప్పఁజరింపఁగాంచిను
ర్భరతరవైభవోన్నతినిఁబాతకికైకసెలంగుచుండఁగా

గురుగహనాంతరంబునకుఁగూర్చిసుతుండగునిన్నుఁబంచియి
ప్పురమున ఘోరదుఃఖములఁబొందుచు నెట్లువసింతు రాఘవా. ౧౨౫.

వ. అని శోకదందహ్యమానమానసయై దీనాలాపంబులు పల్కుచున్న కౌసల్య నూఱార్చుచు రామచంద్రుం డి ట్లనియె. ౧౨౬.

గీ. పతియె దైవంబు చుట్టంబు పడఁతులకును
బతియె ప్రాణపదంబట్టిపతినిఁ బాసి
తల్లి నావెంటఁజను దేరధర్మమగునె
నీతిమార్గంబుఁదలఁపుము నీమనమున. ౧౨౭.

వ. అదియునుంగాక. ౧౨౮.

శా. కాంతారంబునకేనుబోవఁగధరాకాంతుండుచింతాసమా
క్రాంతుండై విలపించుఁగావుననటుల్ గానీకయెల్లప్పుడున్
శ్రాంతింజెందఁగనూఱడించుచుమదిన్సంతోషముంబెంపుచు
న్వాంతంగుందకయుండుమీవ్రుచని సేవత్తున్విళంబింపకే. ౧౨౯.

గీ. భరతుఁడెప్పుడునిన్నుసద్భక్తిఁగొలుచు
నతఁడుసుగుణవిధేయుఁడొండాడనోడు
నలిగికైకేయి నెగ్గుగాఁబలుకఁజనదు
పోయివచ్చెదమప్పణసేయుమమ్మ. ౧౩౦.

వ. అని పలికి కృతనిశ్చయుం డై మ్రొక్కి నిలిచినతనూజుని తెగువకుం బొక్కుచుఁ గన్నీరుమున్నీరు లై పాఱ వగచుచుఁ జెక్కులపయిం జిందు బాష్పజలకణంబులఁ గరంబునం దుడిచికొని డెందంబున నొక్కభంగి తెగువఁ బెంచి శుద్ధోదకంబులం బ్రక్షాళితపాణిపాదవదన యై పుణ్యాహవాచనం బొనర్చి గ్రహదేవతల నారాధించి శుభరక్షలిడి యనేకభంగుల నా రామభద్రుని లక్ష్మణుని వేర్వేఱ నాశీర్వదించి జానకిం గాంచి దుఃఖించి కౌసల్య యి ట్లనియె. ౧౩౧.

క. ఇతఁడుమహారాజేంద్రుని
సుతుఁడనిమునునిన్నొసంగెఁజూచివిదేహ
క్షితినాథుఁడీవ్రవనమున
వెతలంబడవలసెనిట్టివిధికేమందుౕ. ౧౩౨.

గీ. దైవఘటనంబుఁదప్పింపఁదరముగాదు
నీవెఱుంగనిసద్ధర్మనియతిగలదె
పతినిఁబాయకయెపుడుసద్భక్తిఁగొలిచి
పోయిరావమ్మశుభములుపొందునిన్ను. ౧౩౩.

వ. అని పల్కి జానకిం గౌఁగలించికొని మోముమోమునం జేర్చి తదాననంబుఁ గన్నీటం గడిగి దీవించి పుచ్చుటయు నంత రామభద్రుండు సీతాలక్ష్మణసహితుం డై కౌసల్యాదేవిపాదపద్మంబులకుం బునఃపునఃప్రణామంబు లాచరించి యనుజ్ఞాతుం డై వలగొని యచ్చోటువాసి సుమిత్రాదేవిమందిరంబుఁ జేరి యమ్ముద్దియపాదంబులకుం బ్రణమిల్లి వనంబున కరుగు కారణంబు సవిస్తరంబుగా నెఱింగించినఁ బెద్దయుం బ్రొద్దు చింతించి యమ్మానిని యిట్లనియె. ౧౩౪.

ఉ. పాపపుఁగైకరాజ్యపథభగ్నమొనర్చివనంబులోనని
న్గాపురమొప్పసల్పుమనికట్టడసేయఁగనీధరావరుం
డీపనికెట్టులొప్పనగునేమనఁజాలుదునామనంబుసం
తాపముఁజెందెడిన్విధికృతంబిటులుండెనెనీకుఁబుత్రకా ౧౩౫.

వ. అని యత్యంతవిషాదంబు నొంది శోకపరవశ యగుచు రామచంద్రునిం గౌఁగలించి యరణ్యంబున కరిగెదే యనుచుం దుఃఖించి మాఱుపల్కరామికిం జింతించి యనేకభంగులం దీవించి సీత నూఱడించి సాంత్వనవచనంబుల బుద్ధులు గఱపి లక్ష్మణునిం గాంచి సుమిత్ర యిట్లనియె. ౧౩౬.

కం. రామునిదశరథుఁగానీ
భూమిజననుఁగానరణ్యభూమియయోధ్యా
సీమగనీమదిఁదలఁచుచు
నేమఱకయెకొలిచియుండుమినకులతిలకా. ౧౩౭.

వ. అని కఱపి యాశీర్వదించి పనిచిన నంత రాఘవుండు జానకీసౌమిత్రులం గూడి కైకగేహంబున కరిగి యందు. ౧౩౮.

కం. ఉన్మత్తునిచందంబునఁ
దన్మయుఁడగుయోగికరణిఁదలఁగనిబలుచిం
తన్మదిఁగరఁగుచుఁబరవశ
తన్మహిఁబవళించియున్నతండ్రికిమ్రొక్కెన్. ౧౩౯.

గీ. ఇటులునతుఁడైనసుతునిఁగౌఁగిటనమర్పఁ
దలఁచియెదురేఁగిబడలియాదశరథుండు
పుడమిపైఁబడిపెనుమూర్ఛపోవరాముఁ
డొగ్గియాకులపైనిడియుపచరించె. ౧౪౦.

కం. ఆసమయమునసుమంత్రుఁడు
కౌసల్యాద్యఖిలరాజకాంతలనటకు
న్దాసరగునఁదోడ్తేరమ
హాసంకులరోదనంబులాకసమంటెన్. ౧౪౧.

వ. ఇట్లంతఃపురాంగనల దుఃఖారావంబులు సీతారామలక్ష్మణులయర ణ్యయాత్రయుం గాంచి శోకించి యటమున్న చ్చోటి కరుదెంచి యాసీనుం డైయున్న వసిష్ఠమహర్షితోడ నరుంధతి యి ట్లనియె.

గీ. అకటయిక్ష్వాకుకులజులిట్లాబడిపడ
నరయుచుండంగఁదగునెమహాత్మనీకుఁ

బాపఁగారాదెయనవుడుభావికార్య
మొనరఁజింతించిసుదతితోననియెనతఁడు. ౧౪౩.

క. ఇది దైవకృతముగావున
మదిరాక్షిరోదీనిమాన్పమనతరమగునే
తుదనెట్లుచనునోచూతము
పదరకుమని తెలిపెఁబద్మభవసుతుఁడపుడున్. ౧౪౪.

వ. అంత. ౧౪౫.

గీ. బిసకరాస్యయుండుదిగ్గనఁదెలివొంది
తనకునుపచరించుతనయుఁగాంచి
కౌఁగలించి మేనిఁగన్నీటఁగడుగుభూ
రమణుతోడననియెరాముఁడపుడు. ౧౪౬.

క. భవదాజ్ఞసేవనమునకు
సవరణతోఁజనుటయెఱిఁగిసౌమిత్రియునీ
యవనిజయుఁదోడవచ్చుట
కవిరళమతినున్నవారలర్కకులేశా. ౧౪౭.

ఉ. కావుననేముమువ్వురముకాననభూములసంచరింపఁగా
భూవరపోయివచ్చెదముపోవననుజ్ఞయొసంగుమెప్పుడు
న్భావమునందునేమఱకభక్తిమిముంభరతుండుగాచుచు
న్సేవలొనర్చునెంతయునుజింతిలకేధృతిఁబూనియుండుమా. ౧౪౮.

వ. అని పల్కుటయు నత్యంతదురంతదుఃఖార్ణవమగ్నుం డగుచు దశర థుండు రామచంద్రున కిట్లనియె. ౧౪౯.

ఉ. నాసుకుమారరత్నమయనాథుక్రియన్ననుఁజేసికానకు
న్వేసరకీవుపోవఁదగవేనినుసద్గుణశౌర్యధుర్యనేఁ

బోసిని మేమ మైనమఱి ప్రాణము లెట్లు భరింప నేర్తునీ
తోసరిగాఁగ నన్ని పుడె తోడ్కొని పొమ్ము నిజమ్ము పుత్రకా. ౧౫౦.

గీ. కాననమున నిన్నుఁ గలసి సేవర్తింపఁ
బురజనంబు లచట నెరసియుందు
రడవి పట్టణంబు వడుపున నొప్పనీ
పాడు వీటఁ గైక బ్రతుకుఁ గాక. ౧౫౧.

వ. అని దశరథుండు రామభద్రునితోఁ బల్కుటయుఁ గైక యత్యం
తాగ్రహోదగ్ర యై యిట్లనియె. ౧౫౨.

క. మునివేషంబున రాముని
వనమున కరుగంగఁ బంచిన వసుధాస్థలినా
తనయునకొసఁగ నీవి
చ్చిన వరము లునిక్కములని చెప్పందగునే. ౧౫౩.

క. కాదేని వరము లొసఁగుట
లేదను చుం బొంకి సౌఖ్యలీలల నుండక్
రాదే యననడ్డంబై
యాదశరథరాముఁడని యెనాయమతోడక్. ౧౫౪.

క. భూనాథు నీవిధంబునఁ
బోనాడందగునె నీకుఁ బూనికి మీఱం
గాననమున వసియించుట
కే నరిగెద నారచీరలిమ్మా జననీ. ౧౫౫.

వ. అని రాఘవుండు పల్కుటయు సంభ్రమాయత్తచిత్తయై యప్పుడు.

గీ. కైక నారచీరలా కుమారులకు సం
ప్రీతిఁ దెచ్చియిడిన జోతఁ జేసి

యవిధరించిరంతనయ్యవనిజకున
ట్లంశుకములొసంగనందికొనుచు. ౧౫౭.

క. తలవాంచియూరకుండఁగఁ
గలకలమనియచటిరాజకాంతలు నేడ్వ
న్వలదనిమాన్చివసిష్ఠుం
డలకైకం గాంచిపల్కెనత్యాగ్రహుఁ ౧౫౮.

క. కేకయరాజాన్వయమున
నీకున్సరిపోల్పఁదగిననెలఁతలుగలరే
లోకులబ్రమింగఁజాలెదు
రాకాసివిగాకనీవు మణివెతలఁపక. ౧౫౯.

క. భూమీశు మోసపుచ్చియు
రామునిమునివేషమునసరణ్యమునకుఁబో
నేమించితివీజనకజ
కీమాడ్కి న్నారచీరలీయందగునే. ౧౬౦.

వ. అని కోపోద్రేకంబునం గైక న్వీడనాడి వసిష్ఠుండు జనకినందన కమేయ వస్త్రభూషణాదుల నొసంగె నంత మునివేషధారి యైనరామునిం గాంచి దశరథుఁడు మనంబునం గ్రాఁగులుచుఁ గన్నీరు నించుచు నిట్లనియె. ౧౬౧.

చ. ప్రవిమలసౌధపఙ్క్తులనుభాసిలిసర్వధరాధినాథసం
స్తవములమించిరాజ్యపదసంపదలందఁగఁగల్గునిన్ను నీ
భువిఁగలపేదమానవునిపోల్కిఁజరింపఘటించినట్టిపా
పవిధికి నే మొనర్తునగుబాటొనఁగూడెఁగదయ్యరాఘవా. ౧౬౨.

చ. మనుకులసంభవుండగుచుమానుగసర్వదివేలవర్షము
ల్ఘనతరరాష్ట్రపాలనముఁగాంచితుదన్నినుసద్గుణాన్వితుం

దనయునిఁ గాఁగఁ గంటిఁ బ్రమదంబునఁ బట్టము గట్టి కన్నులం
గనుఁగొన నేరనైతిఁ గడుఁ గష్టచరిత్రుఁడ నైతి రాఘవా. ౧౬౩.

క. అన్నా నీముఖపద్మం
బెన్నఁడు పొడగందు నొంటి నేగతి నుందున్
నిన్నుం బాయుని మేషం
బెన్నఁగ యుగ మగుచుఁ దోఁప నెట్లు భరింతున్. ౧౬౪.

క. ననువిడిచి యీతెఱంగున
వనమునకరుగంగవలదు వదలక నా చెం
తనెయుండు మెల్లసంపద
లనుగైకొని కైక తా వెలయ నిమ్మిలసె. ౧౬౫.

వ. అని యత్యంతసంతాపంబున దీనాలాపంబు లాడుచు దుఃఖించుచున్న జనకునిం గాంచి రామచంద్రుం డనునయించుచు నిట్లనియె.

సీ. వనజాప్తకులుఁడ విక్ష్వాకువంశజుఁడవి
వన్నృతమాడఁగ నోప వనవరతము
సత్యసంధుండని సకలరాజన్యులు
నలరారఁ గొనియాడ నఖిలరాజ్య
భారధౌరేయతఁ బరఁగి యశస్సిద్ధిఁ
బడసితి వసమాన బాహుబలము
నీవంటి సద్ధర్మనిరతుఁడీ క్రియ వరం
బొసఁగిన సదిరిత్తఁ బోసఁగఁ జనునె
కానఁ గానకు భవదాజ్ఞఁ బూని యేను
బోయివచ్చుటచేఁ గీర్తిఁ బొందుమనన్నుఁ
బంపు మొందుడలంపక పార్థివేంద్ర
సుంతపనికింత బహుళంపు రంతులేల. ౧౬౬.

క. పదునాల్గువత్సరంబులు
పదునాల్గుదినములుగాఁ గఁబటువేగముతో
నిదెపోయికడపివచ్చెద
మదినూఱటఁ జెందుమీవుమనుజాధీశా. ౧౬౮.

శ్రీరామభద్రుండు సీతాలక్ష్మణసహితుండై వనంబున కరుగుట.

వ. అని పెక్కుభంగుల నూఱడిలం బల్కి కృతనిశ్చయుండైయున్న రామచంద్రుని వారింప నోపమి నంతరంగంబున నంతంత నిగుడు శోకదవానలంబువం బొగులుచు దశరథుం డొక్కభంగి ధైర్యం బవలంబించి మంగళాశీర్వాదంబు లొనరించి యరణ్యంబున కరిగి రమ్మని యనుజ్ఞ నొసంగి సుమంత్రునిం గాంచి సకలశస్త్రాస్త్రసహితంబుగా రథం బాయత్తం బొనరించి తెచ్చి కుమారుల నారోహితులం జేసి చతుర్దశాబ్దంబులు తోడం జను మని యాజ్ఞాపించుటయు నతం డట్ల కావింప రామలక్ష్మణులు జానకీసహితంబుగా నజ్జననాథునకు వలగొని మ్రొక్కి తదనుజ్ఞఁ గైకొని వసిష్ఠాది మునిగణంబులకు వందనంబు లొనర్చి కైక స్వీడ్కొని తన్మందిరంబున కరుదెంచి శోకించుచున్న కౌసల్యాదిమాతృవర్గంబులకు నమ్రులై రథం బెక్కి రాజమార్గంబునం జనుచున్నయెడ. ౧౬౯.

క. పురజనులెల్లనుగుములై
పరితాపమునొందిరామభద్రునివెనుకం
జిరకాలముచరియింపఁగ
స్థిరమతులైచనిరిభక్తిదీపితబుద్ధిన్. ౧౭౦.

వ. అంత నప్పుడు. ౧౭౧.

గీ. రాముఁడచ్చోటువాయధరావరుండు
నంతకంతకుశోకదవానలమునఁ

బాగులుచును గైక నివసించు నగరు వెడలి
యరద మేగినజాడల నరిగి యరిగి. ౧౭౨.

గీ. ఓసుమంత్ర రథము నొక్కింత నిలుపు మిం
కొక్కసారి నాముచక్కనయ్య
మోముఁ గాంతు ననుచు మొఱవెట్టి రాఁగని
సచివుతోడ రామచంద్రుఁ డనియె. ౧౭౩.

క. అదె నృపవరుఁ డరుదెంచెడుఁ
బదపడి రథ మరుగనిమ్ము పరువడి నందా
మది నెఱిఁగి పురము వెలువడ
నదలించుచుఁ గడపె నాతఁ డతివేగమునన్. ౧౭౪.

వ. అంత. ౧౭౫.

గీ. రథము పోవడిఁ గానక రాజవర్యుఁ
డొక్కచో నిల్చి నిజకాంతలుపచరింప
హితతనూజాత సీతా సమేతనన్నుఁ
బాసి తేయని శోకించి పరితపించె. ౧౭౬.

వ. అప్పుడు. ౧౭౭.

క. మునినాథుండు వసిష్ఠుఁడు
జననాథునిఁ గాంచి పలికె జగతీవరసీ
తనయుల వనమునకు ననిచి
వెనుక న్శోకింప నిద్ది వేళయె చెప్పుమా. ౧౭౮.

చ. వనమునకేగి వచ్చెదర వారితసత్త్వులు రామలక్ష్మణు
ల్ధనువుకరంబునం గలుగ ధాతకునైనఁ గిరీశుకైన మా
రొక్కనఁ దరమా నె వారి నిటు కుందఁగ నేల ధృతి న్వహించి వేఁ
జనుము గృహాంతరంబునకు సారసనేత్రలతోడ భూవరా. ౧౭౯

వ. అని వసిష్ఠుఁడు పలుదెఱంగుల ననునయించి మఱల్చుటయును దశరథుండు మఱలి పదంబులు దడఁబడ నడవరామిఁ జేసి కౌసల్యాసుమిత్రులకైదండఁ గొని కన్నీరు మున్నీరులై పాఱ వగచుచు మెల్లమెల్లనఁ బఱతేర నుభయపార్శ్వంబులం జనుదెంచు కాంతాసముదయంబులనడుమ మృత్యువుకైవడిం దోఁచు కైకం గాంచి రోషారుణలోచనుండై భూవరుం డిట్లనియె. ౧౮౦.

క. ఓపెనుభూతమ నీమో
మేపగిదిం గాననగునొ యెన్నటికైనం
బాపాత్మురాలనీకై
నాపట్టిం బాసి యిట్లు నాథుఁడనైతిన్. ౧౮౧.

క. నినుముట్టరాదు నీతోఁ
బనివడి భాషింపఁదగదు బల్గతి నీచే
జననిందఁ బొందిరఘుకుల
మునకపకీర్తియొడఁగూర్చ మొనసితివకటా. ౧౮౨.

వ. అని పరిపరివిధంబుల దూషించుటయుఁ దోడ నగుదెంచు వధూజనంబులు గరంబులు సాఁచి తిట్టుటయు విననేరమిం దల వాంచి కైక నిజగృహంబునకుం జనియె నంత దశరథుఁడు శోకపరవశుండై కౌసల్యాగేహంబున కరిగి సెజ్జపయిం బవళించి యిట్టట్టుఁ బొరలుచుఁ గన్నీరు దొఱంగించుచు నిట్టూర్పు నిగిడించుచు హా రాఘవా యని మూర్ఛిల్లి తెలివొంది యిట్లని పలవింపం దొడంగె.

ఉ. నన్నెడఁ బాసి యిప్పగిది నాప్రియసూనులు నాదుకోడలు
న్వన్నెమెకంబులం గలసి వర్తిలఁ గానల కేగి రింక నే
నెన్నఁడు గాంతు దుఃఖభర మెట్లు తరింతు నిరంతరంబు నా
కన్నుల శోకబాష్పములు గ్రమ్మఁగఁ జేసె విధాతృఁడక్కటా. ౧౮౩.

ఉ. ఇంతకు నెంత దవ్వరిగి యేక్రియఁ గ్రుమ్మరుచున్న వారొ వి
భ్రాంత మతిస్థరాతనయ పాయని కంటక భూమిఁ ద్రొక్కి యిం
తంతనరాని వేదనల నాత్మ సహింపక నన్నుఁ గూర్చి తా
నెంతలు తూలనాడునొకొ యే గతి సైఁపఁగ నేర్తు దైవమా. ౧౮౫.

వ. అని యత్యంత దురంత చింతా సమాక్రాంతుండై దశరథుండు విల
పించుచుండె నంత రాఘవుం డయోధ్యానగరంబు వెలువడి పౌరులం
గూడి కొంత దవ్వరిగి యందఱం గాంచి యిట్లనియె. ౧౮౬.

ఉ. ప్రాకట భక్తియుక్తి మెయి భవ్యగతిన్ భరతాజ్ఞఁ బూని మీ
రేకమనస్కులై పాలిచి యెయ్యెడ మాకు శుభంబుఁ గోరుచు
న్నేకువ నుండుఁ డే మరిగి తీవ్రగతిం జను దెంతు మన్న నా
రాఘవుఁ గనుంగొని తిరంబుగఁ బల్కిరి పౌరులత్తఱిన్. ౧౮౭.

గీ. భరతునొల్లమెల్ల భాగ్యంబులను గోర
మెపుడు సుతహితాళి నిచ్చఁ దలఁప
మయ్య రామ మీ పదాంభోజములఁ గొల్చి
వత్తుమందఱము నువనములకును. ౧౮౮.

వ. అని యిట్లు విప్రభూపాలకవైశ్య శూద్రాది పురజనంబు లేక గ్రీవంబుగ
విన్నవించుటయు వారల చిత్తంబు లెఱింగి రామభద్రుండు వారింప
నోపమి నందఱం గూడి మెల్ల మెల్లనఁ జని చని సాయాహ్న సమ
యంబునఁ దమసానదీ తీరంబున విడిసి యందు. ౧౮౯.

సీ. సాంధ్యక్రియలఁ దీర్చి సైకతస్థలమున
రమణీయుఁ డాను నురాఘవుండు
శయనించుటయుఁ బురజనములు దమతమ
సతులఁ జుట్టంబుల సుతుల హితుల

మఱచి రామునిఁగొల్చి మహాదటవులకేగు
  తెగువతోనన్నదీతీరభూమి
నందఱునిద్రింపనమ్మధ్యరాత్రంబు
  ననుసుమంత్రునిఁజీరియనకులుండు
తవిలిపౌరులవంచించుతలఁపుఁదెలిపి
  రథముపైనెక్కి మువ్వురురయముమీఱఁ
బురముజాడ నెనొక్కంతపోయిమఱలి
  వేఱుమార్గంబుననుజనివేగమునను. ౧౯౦.

మ. తమసాభిఖ్యానదిందరించిఘనకాంతారంబులుంబల్లెలు
స్గ్రామమొప్పంగ్రమియించివేదవతివేగందాఁటిపోఁబోవసం
ద్రముభంగింబెనుఘోషణంబులెసఁగంధారాళమైసత్వసం
ఘములుప్పొంగఁజెలంగుగంగనఘభంగన్గాంచిరింపారఁగాన్. ౧౯౧.

గీ. ఇట్లుభాగీరథినిఁగనియిచ్చమెచ్చి
  రామభద్రుండుసీతయులక్ష్మణుండు
రథముడిగిమ్రొక్కి నిజమనోరథములలర
  నొక్కచోటనువిశ్రాంతినొందిరంత. ౧౯౨.

క. తమసానదీతటంబున
  నమితంబగునిద్రఁజెందియప్పౌరజను
ల్గ్రమమునమేల్కనియటరా
  ఘవులలేమికినివగచికుందుచునపుడున్. ౧౯౩.

గీ. అరదమేగినజాడలనందఱరిగి
  పురముఁజేరంగఁజనిరఘుపుంగవులను
నచటఁగానకసంతాపమందివారి
  రాకఁగోరుచునందుండిరేకతమున. ౧౯౪.

ఉ. అంతసురాపగాతటమునందురఘూద్వహులేగుదెంచివి
శ్రాంతియొనర్చుచుండుటయుఁజాపలుదెల్ప నెఱింగిపొంగియా
చెంతనుశృంగిబేరపురిచెంచులరాజుగుహుండుచెచ్చెర
న్వింతఫలావళుల్గొనియువేడ్కఁ బెలంగఁగవచ్చినమ్రుఁడై. ౧౯౫.

క. ఫలములుకానుకలిడిరఘు
కులజానిమునివేషమునకుఁగుందుచునని యొ
న్జలజహితాన్వయనీకుం
గలకలుములఁబాసితపసిగానేమిటికిన్. ౧౯౬.

క. నీరాజ్యసంపదలఁగొని
ఘోరాటవిలోననిన్నుఁగ్రుమ్మరుమనుచు
న్ధారాళంబుగఁబంచిన
క్రూరాత్ములఁదెల్పుమిపుడుకువలయనాథా. ౧౯౭.

క. నావంటిబంటుగల్గఁగ
నేవెంటంగొదవగలదెయిదెచూడుము నేఁ
డీవింటరిపులఁద్రుంచెద
నావెంటన్నమ్మురామనరపాలమణీ. ౧౯౮.

వ. అని యిట్లత్యంతకోపసంరంభుం డై పల్కు గుహునిభక్తికి సంతసించి కౌఁగలించి రామభద్రుండు పితృవాక్యపరిపాలనం బొనర్పఁ బదు నాలుగేండ్లు వనంబున కరుగుటం దెల్పిన విని గుహుం డంతరంగం బునం జింతించుచు నుండె నంత. ౧౯౯.

సీ. అయ్యెడనపరాహ్ణమగుటయురాఘవుం
డలరాగసాంధ్యకృత్యములుదీర్చి
ఫలములజలములఁబరితృప్తిఁ బెంపొంది
తెఱవయుఁదానుఁదత్తీరమునను

శయనింపసౌమిత్రిశరచాపహస్తుఁడై
యగ్రజుసంరక్షణార్థమపుడు
పదునాలుగేండ్లన్నపాననిద్రాదులఁ
బరిహరింతునటంచుఁ బ్రతినఁ జేసి
గుహునితోఁ గైకపైఁ గలకోదవలెల్ల
మందలించుచునన్న నేమఱక కొల్చి
భటునిగతినుండె నంతఁ బ్రభాతమునను
రామచంద్రుండు మేల్కని నేమమలర. ౨౦౦.

క. క్రమమున నిత్యానుష్ఠా
నము లెల్ల నొనర్చి మించి న్యగ్రోధక్షీ
రముఁ గడు వేగమె గుహుచే
సమితంబుగఁ దేరఁ బంచి యనుజుఁడుఁ దానున్. ౨౦౧.

మ. సుకుమారంబుగ నొప్పుసోగకురులన్ సాటింజడల్ చన్నియ
త్యకలంకస్థితి రామభద్రుఁడు సుమంత్రామాత్యునిం జీరి మే
మిఁక మీఁద న్రథ మెక్కఁ బోలదనఘా యీప్రొద్దె మా రాజధా
నికి వేగం జని తెల్పుమీ వు నృపుతో నిక్కంబు మా సేమముల్. ౨౦౨.

వ. అని రాఘవుండు పల్కుటయు లక్ష్మణుండు సుమంత్రునిం గాంచి
యిట్లనియె. ౨౦౩.

క. ప్రియురాలిమాటఁ దప్పక
భయదాటవులకు నమ్ముఁ బంచితివిఁక స
త్ప్రియ మొందుమనుచుఁ గడుఁ బా
పయుతుండగు తండ్రికేను బల్కితి ననుమీ. ౨౦౪.

చ. అనవుఁడు రాఘవుండనుజునాగ్రహ మెల్ల నణంచి సూతునిం
గనుఁగొని పల్కె లక్ష్మణుఁడు కార్యగతుల్ దెలియంగఁ జాలఁడి

ట్లనవలదీవహర్నిశమున్స్మరిలిభూవిభునూఱడించుచు
న్బనివడిఁగొల్చియుండఁదగుభావమునంగడుభక్తిదోఁపఁగన్. ౨౦౫.

వ. అనిన సుమంత్రుండు వినయావనతుండై యి ట్లనియె. ౨౦౬.

ఉ. ఏనిటమిమ్ముడించిపురికేఁగఁగఁబౌరులుమంత్రులున్హితు
ల్మానసమందుఁబొక్కనుమాటికితూలఁగనాడకుందు రే
భానుకులుండుఁదత్సుతులుపాయనిశోకములందికుందఁగాఁ
గానఁగనోపనిక్కముగఁగానలకేనరుదెంతురాఘవా. ౨౦౭.

వ. అని సుమంత్రుండు దీనాననుండై విన్నవించుటయు రాఘవుం డి
ట్లనియె. ౨౦౮.

క. నీవరిగిమ్మునడవులఁ
బోవిడిచితినంచును దెలుపుము లేనియెడన్
భావమునఁగైకనమ్మదు
కావుననెటులైనఁబోవఁగావలయుఁజుమీ. ౨౦౯.

వ. అని బహుభంగులం బ్రబోధించి సుమంత్రుని వీడ్కొని సీతాలక్ష్మణ
సహితుం డయి రాఘవుండు గుహుం డొనరించిననావపై నెక్కి
జాహ్నవి నుత్తరించి యతని వీడ్కొల్పి యవ్వలఁ జని చని. ౨౧౦.

క. ఇనవంశజులపుడుసుద
ర్శనసరసీతీరముననుసంధ్యాసమయం
బుననిలిచితమదుర్దశ
లనుదలఁచుచురాత్రిఁబుచ్చిరవిషాదముటయున్. ౨౧౧.

క. క్రమముననచ్చోఁగదలుచు
నమితంబుగనదులువనములద్రులువరుస
న్గ్రమియించిచనుచుగంగా
యమునాసంగమమునంబ్రయాగంగనియున్. ౨౧౨.

వ. అందు. ౨౧౩.

గీ. వరతపోధనుఁడగుభరద్వాజమౌని
యాశ్రమముఁజేరియమ్మునివ్వరధికభక్తి
నమ్రులగుచునుదమవర్తనములనెల్ల
విన్నవింపఁగనన్నియువినియెతండు. ౨౧౪.

క. రామునినిజతత్త్వంబును
భూమినిమనుజాకృతిగనుబుట్టుటలెల్లం
దామదిభావించిపరం
ధాముఁడితండనుచుఁబ్రియమొదవఁబూజించెన్. ౨౧౫.

వ. ఇట్లమ్మహర్షివలనం బూజితుం డై రామభద్రుండు సీతాలక్ష్మణసహితంబుగా న య్యాశ్రమంబున నివసించి తన్నిశాంతంబునం దనుష్ఠానంబు లొనర్చి భరద్వాజునివలనం జిత్రకూటంబు నివాసయోగ్యం బని యెఱింగి యట కేగుమార్గంబుఁ దెలిసి యనుజ్ఞ వడసి యప్పుడు.

గీ. దాశరథులయ్యెడనుబాసిత్వరితమొప్ప
నడచుచోసీతపదములుదడఁబడంగ
నడుముగడగడవడఁకనాననము వాఁడ
బడలియడుగిడఁజాలకనడలుచుండ. ౨౧౬.

సీ. రామచంద్రుఁడుధరారమణీతనూజాత
నటుకాంచిశోకించిదిటవువెంచి
వరనగంబులుఁదరువల్లనేకంబులు
బహుపుణ్యనదులునుబక్షిగములుఁ
జూపుచుశ్రమములఁబాపుచుఁగందమూ
లములొసంగుచునాదరమున

మధురప్రసంగముల్మది మెచ్చఁ దెల్పుచుఁ
బరిపరివిధముల భావమలర
లాలనముఁ జేయుచును ముందు లక్ష్మణుండు
వెనుకఁ దా సీత యును మధ్యమున నునడువ
జంట బాయక భూరుహచ్ఛాయలందు
నక్కడక్కడ నిలుచుచు నరిగి యరిగి. ౨౧౮.

గీ. కనియె రాఘవుఁ డతిఘోర ఖడ్గ గవయ
వారణప్రముఖానేక వన్యమృగ వి
హారతలముఁ గపిత్థచూతాది కలిత
కూటసంయుతమగు చిత్రకూటనగము. ౨౧౯.

చ. అటుపొడగాంచి తద్గిరిమహాత్మ్యము లాత్మ నెఱింగి మెచ్చుచు
న్నిటవుగఁ బైకి నెక్కి శ్రమఁ దీర్పఁగ నిట్టటు సంచరించి య
చ్చటఁ గల మౌనివర్గముల సఖ్యముఁ గైకొని మోదమందుచుం
బటుతరమైతనర్చు నొక పర్ణకుటీరముఁ గట్టి నెట్టనన్. ౨౨౦.

గీ. జనకజను గూడి యాపర్ణశాలయందు
రామభద్రుండు నివసింప నేమ మొప్ప
లక్ష్మణుఁడు గందమూలఫలములు దెచ్చి
యనుదినంబొసఁగుచునుండె నధికభక్తి. ౨౨౧.

సీ. ఒకనాఁడు రాఘవుండుర్వీతనూజాత
యూరుస్థలిని నిద్రనూఁది యున్న
తఱినొక్క కాకంబు దరశాక్షి యురమున
జీరరక్తము పైనఁ జిందుటయును
మేల్కనియల్కతోఁ జుల్కనౌ నిషీకంబు
పరపినదది ఘోర బాణమగుచుఁ

దత్కాకమునుజేరితఁబమముల్లోకము
ల్దిరిగిపాలనమొందు తెరువులేక
మగిడిచనుదెంచి శ్రీరాముమఱుఁగుఁజొచ్చి
కావుమనియెక్కకనువుచ్చి కాండమునకు
నొసఁగమన్నించిపనిచిసంతసమెసంగ
నుండెనచ్చోటరఘువంశమండనుండు. ౨౨౨.

వ. అంత నక్కడ సుమంత్రుండు గుహునితోడం గూడి శృంగిబేరంబున దినత్రయంబు వసియించి వనచారులవలన రాఘవుండు చిత్రకూటనివాసి యగుటం దెలిసి రథంబుఁ గొని యయోధ్యాపురంబుఁ జేరి రాజమార్గంబునం జనుదేరం గాంచి పౌరసంఘంబులు దాశరథులు మఱల వచ్చుటగాఁ దలంచి సంభ్రమంబునం డాసి రిక్తరథంబగుటయు నిద్దురాత్ముండు రాకొమారుల వనంబున విడిచి వచ్చెనెంత క్రూరకర్ముండొకో యనుచు దూషింప వినుచు నతండు శిరంబు వంచి మొగసాలం దాఁటి కౌసల్యాదేవిమందిరంబున కరిగి యందు. ౨౨౩.

క. తడఁబడునడుగులతోడను
నడలుచునన్నంబునీరునన్నియునటుపో
విడిచిపుడమిపైఁబొరలుచుఁ
గడుదుఃఖమునొందునృపతిఁగనెనిపల్కెన్. ౨౨౪.

మ. కమలాప్తాన్వయతావకాత్మజులుగంగాతీరమందున్వడ
ల్గ్రిమమొప్పన్ధరియించిమించిరథమెక్కంగూడదీవేగుమ
న్నమదింజింతిలివచ్చినాఁడమిముఁగానన్వారలాచిత్రకూ
టమహాశైలమునన్నివాసముగనుంటన్వింటినిక్కంబుగాన్. ౨౨౫.

కం. అనుపలుకులుదనచెవులకుఁ
బెనుములుకులభంగినాటఁబృథివీరమణుం
డెనలేనిశోకసాగర
మునమునుఁగుచునెడరుగొననిమూర్ఛంబొందెన్. ౨౨౬.

వ. ఇట్లప్రబోధం బగుపెనుమూర్ఛ నొంది యున్నదశరథుం గాంచి యత్యంతవిషాదంబునఁ గౌసల్యాదికాంత లంతంత ననేకశైత్యోప చారంబుల సేద దీర్చినం దెలి వొంది రామచంద్రుం దలంచి బహు ప్రకారంబులం బ్రలాపించుచు ని ట్లనియె. ౨౨౭.

కం. హా రామభద్రనన్నిప్పు
డాఅడివిపోఁబుచ్చినీవునడవులనిటులం
జేరిననాదగుప్రాణము
లేరీతిభరింపనేర్తునీయెడలనిఁకన్. ౨౨౮.

గీ. నన్నుఁగన్నతండ్రినావంశదీపక
నాతపఃఫలంబనాకుమార
యకటనిన్నుఁబాసియరనిమిషంబేని
నిల్వనోపఁజుమ్మునిక్కముగను. ౨౨౯.

వ. అని ప్రలాపించుచు సుమంత్రునిం గని యి ట్లనియె. ౨౩౦.

మ. అనఘానిన్నుమఱల్చుచోఁదనయులేమైనన్వ్రతల్వల్కిరో
వనితారత్నముసీతతామనసునొవ్వన్మించిదుఃఖంచెనో
వనవాసశ్రమలందికుందియెటులన్వర్తింతురోకానల
న్ననుఁగొంపొమ్మురదెంతునిక్కువముగానాపుత్రులంజూడఁగాన్.

వ. అని శోకబాష్పపూరితలోచనుం డై పల్కుభూపాలునకు సుమం త్రుం డి ట్లనియె. ౨౩౧.

శా. దేవానీవతిసత్యచేతసుఁడవీతెంపొప్పనేకైకకు
న్భావంబందునసమ్మికల్గ్వడమునేభావింపఁగానీదుకాం
తానారంబులువెంబడింపకయవంతన్నిల్తురేకావునం
బోవంజెల్లనుకాననంబునకునోభూపాలయూహింపుమా. ౨౩౩.

వ. అని యనేకభంగుల నూఱడిలం బల్కి సుమంత్రుండు నిజగృహం బునకుం జనియె నంత దశరథుండు రామభద్రునిఁ బేర్కొని శోక దందహ్యమానమానసుండై ప్రలాపింపం గని కౌసల్య దుఃఖావేశం బున ని ట్లనియె. ౨౩౪.

క. లోకులనిందకువెఱచియ
కైకకుబోధించిరాజ్యగరిమంబెల్ల
న్జ్యేష్ఠునుమనియెసఁగితివిఁక
నీకెక్కడిసత్యమొప్పనిక్కంబరయన్. ౨౩౫.

గీ. సవతికోర్కెల్లసఫలంబొనర్చినా
తనయునడవులందుఁదల్లడిల్లఁ
జేసినాఁడవిపుడుచెల్లునేశోకింప
భూతలేశవట్టిబూమెలేల. ౨౩౬.

క. బహుదానములువ్రతంబులు
బహుపూజలుసలిపిసుతునిఁబడసితినతనిం
గహనములఁదిరుగఁబంచితి
వహహాయెట్లోర్తునిచటనవనీనాథా. ౨౩౭.

వ. అని యత్యంతసంతాపంబునం దూఱి పలుకుచున్నకౌసల్యం గని దశరథుం డి ట్లనియె. ౨౩౮.

చ. వనితరొనీవుపల్కినటువంటిదురాత్ముఁడఁబాపచిత్తుఁడ
న్ననమునసత్యధర్మములమార్గములేనెఱుఁగంగనేరన

న్బనివడి కాఱులాడకుము భావమునందలపోయనాపురా
తనకలుషంబుసుంతయునఁదప్పక నేఁడొనఁగూడెనిక్కమై. ౨౩౯.

గీ. ఏ తెఱఁగుననైన నే కాలముననైన
నోసరించి తాము చేసినట్టి
కర్మసంచయంబుఁ గడవంగఁ దరమౌనె
నరులకైనఁ ద్రిదశవరులకైన. ౨౪౦.

వ. అది యెట్లంటేని మున్ను నా యౌవనకాలంబునం దేను మృగయా
వినోదార్థం బడవికిం జని వేఁటలాడుచుం దనివిసనక నొక్కనాఁటి
రాత్రి సరయూనదీతీరంబున మృగంబులు నీటికై యరుదెంచినం
దునుముదు నని పొదలం డాఁగియున్న యెడ యజ్ఞదత్తుం డను నొక
మునికుమారుం డయ్యేటియందు. ౨౪౧.

క. ఘుమఘుమనినదంబుసఁగల
శముసీటస్ముంపనదిగజంబనుచును వే
గమె శబ్దవేది బాణము
రముఁ దూఱనేసినాఁడ రమణిరొవించే. ౨౪౨.

క. ఆయమ్మునకానితనయుని
కాయమ్మున నాటిరక్తకణములతోఁడం
గాయమ్మెనర్చనాతం
డోయమ్మాయనుచు బెదరియుర్విం గూలెన్. ౨౪౩.

గీ. ఇట్లు యజ్ఞదత్తుఁ డిలపైనిఁ బొరలుచుఁ
గటకటాయటంచుఁ గళవళించి
తనువునందు రక్తధారలు దొఱఁగుటఁ
గాంచి భీతిఁ బలవరించె నపుడు. ౨౪౪.

క. ఉడుగనితపముననడవిం
బడియుండెడునన్ను నెట్టిపాపాత్ముఁడో యీ
నడురేయి వేళఁబుడమిం
బడ నేసెన్ఘోరవిశిఖపాతము చేతన్. ౨౪౫.

క. పండినఫలములకైవడి
నుండెడుతలిదండ్రులంధులుగ్రాటవి నె
ట్లుండఁగ నేర్తురొ వారికి
నిండెన్నాతోడ బ్రతుకునిక్కంబరయన్. ౨౪౬.

సీ. జలములుగొనిపోవఁజనుదెంచిమడిసితి
నారాకఁగోరుచునన్నుఁజేరి
తారెంతవగుతురో తల్లిదండ్రులు వారి
నెవ్వరుపోషింతురెఱుఁగ రాను
గురులశుశ్రూష నేకోరి సేయుచునుండఁ
బాపపువిధినన్ను రూపుమాపె
ననియాత్మఁజింతించియతిదుఃఖమందెడు
మునిసూనుఁగనఁబోయిముదముదక్కి
కటకటా యిట్టికలుషంబుఁగట్టికొంటి
ననుచుఁబదములువణఁకవదనము వాడఁ
దలఁపునను దిగులొందితత్తఱముఁజెంది
యమ్మహాత్మునిఁగాంచియిట్లంటినపుడు. ౨౪౭.

క. మునినాథ యేనుసాకే
తనగరవర మేలుదశరథక్ష్మావరుఁడ
న్వనమునకు వేటలాడఁగఁ
జనుదెంచితినిచటుఁగలుషసంగుఁడనైతిన్. ౨౪౮.

క. నీవీజలములఁగొనురవ
  మీవినిగజమనుచుఁబాంచియేసితిశరముల్
ఈవిప్రవథయొనర్పఁగ
  నావిధిదోఁడ్తెచ్చెనిటకునన్నేమందుల్. ౨౪౯.

క. నీవంటిమరితదూరుని
  భావింపకతునిమినట్టిపాపంబుననే
నేవెంటఁబోవనేర్తును
  దైవికమిట్లుండెఁగాదెతాపసవర్యా. ౨౫౦.

వ. అని యివ్విధంబునం బరితపించుచు నమ్మునికుమారుం దొడలం దిడి
కొని శుద్ధజలంబుల మేను దుడుచుచు దుఃఖించుచున్న నన్నుం గను
విచ్చి కాంచి నా వెఱపు భావించి యమ్మునివరుం డిట్లనియె.

గీ అయ్యదశరథభూపాలయడలనేల
  నీవలనదోషమెన్న నేనిక్కువముగఁ
గావలయుకార్యగతులెల్లఁగాకచనునె
  దైవఘటనంబుఁదప్పింపఁదరమెచెపుము. ౨౫౨.

క. ఇనవంశోత్తమనేవై
  శ్యునకున్శూద్రాంగనకునుసూనుఁడనగుచు
జ్జననంబందితిఁగావున
  ననఘాయిదిబ్రహ్మహత్యయనరాదుసుమీ. ౨౫౩.

క. తలిదండ్రులంధులతివృ
  ద్ధులునాకైపలవరింపుదురువారలకీ
జలములుగొనియేగిమొసఁగి
  తెలియఁగనాతెఱఁగునీవుదెలుపుమధీశా. ౨౫౪.

గీ. అట్లుచేయవేనినతితపోనిష్ఠుఁడొ
మగ్గురుండుయోగమార్గమునను
దెలిసిక్రోధమునను దెగఁజూచునిన్నట్లు
కానఁగానఁబొమ్ముమానవేశా. ౨౫౪.

క. అనిపల్కి మునిసుతుండీ
ల్గినసేనతిచింతనొందికీలాలంబు
ల్గొనియాతనిదలిదండ్రుల
ననఘాత్ములఁగాంచిచేరనరుగుచునుండన్. ౨౫౫.

గీ. కాలిచప్పుడప్పుడాలించిసుతుఁడంచు
నాత్మ నెంచియమ్మహాత్ములనిరి
యడవియందునొంటినంధులముముడించి
కొడుకయేలయింతతడసితయ్య. ౨౫౬.

వ. అని పల్కుచున్నయప్పురాతనదంపతులకు నమస్కరించి యో మహాత్ములారా యేను మీ యాత్మజుండఁ గాను. అయోధ్యాపురాధీశుం డగుదశరథుండ. ఈ యరణ్యంబునకు వేఁటలాడఁ జనుదెంచి రాత్రియందు మృగంబులు నీటికై వచ్చునప్పుడు త్రుంపంగోరి డాఁగి యున్నయెడ మీ తనయుం డగుయజ్ఞదత్తుండు సరయూనదియందు జలంబులకై కలశంబు ముంచుటయుఁ దద్రవంబు భద్రేభంబు నీరు ద్రావుటగాఁ దలంచి శబ్దవేదిబాణంబుఁ బ్రయోగింప నా శరం బతనియురంబు గాఁడిన నెట్టొంగి పరువునం జని దుఃఖించుచుండు నన్నుం గాంచి యమ్మునిశ్రేష్ఠుండు నా యెఱుఁగరామిం దలంచి మన్నించి మీ కుదకం బొసంగి తెలియం జేయు మని యాజ్ఞాపించి దివంబున కరిగె నని తెల్పుటయు నప్పుడు. ౨౫౭.

క. హాపుత్రరత్నమా యిఁకఁ
ప్రాపెవ్వరు మాకటంచుఁ బరిపరిగతుల
న్వాపోవుచు నెదనడలుచు
నాపుణ్యులు మూర్ఛనొందియవనింబడఁగాన్. ౨౫౯.

గీ. ఏనుధృతిదూలివారల నెత్తిసేద
దేర్పఁదెలివొందిమిగులనిట్టూర్పువుచ్చి
ధరణిపైఁబడిపొరలుచుఁదగముగాని
దుఃఖమునమించియిట్లునాతోడననిరి. ౨౬౦.

గీ. ఏలయయ్యదశరథేశ మాసుతునిని
ష్కారణముగఁదునిమిగాసిచేసి
తడవియందునుందునక్కటాసీకు మే
మెగ్గొనర్చియెఱుఁగమెన్నఁడైన. ౨౬౧.

ఉ. కన్నులుగానరావుబలుకంపమునొందెడు మేను నెప్పుడాఁ
కొన్నను గందమూలములు గూర్చినొసంగుచుఁ బ్రోచుచున్న మా
కన్నకుమారునిం దునిమి కాఱడవిం బడఁద్రోసివచ్చితో
మన్నన మీఱఁ బ్రోవఁగను మాకిఁక నెవ్వరు దిక్కు భూవరా. ౨౬౨.

క. తావకబాణానలమున
భూవలయమునందుఁబడినపుత్రునికడకు
న్వేవేగమ్ముఁగొనిచను
మోవసుధాధీశ యనుచు నోడకయంతన్. ౨౬౩.

వ. ఏ నమ్మహాత్ముల మోచికొని చని వీఁడె మీసుతుం డని విడిచి తెల్పుటయు వార లక్కుమారుని కళేబరంబుపయిం బడి మూర్ఛిల్లి తెలివొంది మహాదుఃఖపరవశులై పలవింపఁ దొణంగి రప్పుడు.

క. మాయయ్యయజ్ఞదత్తుఁడ
    యీయడవినిమమ్ముడించియెట్లరిగితివీ
వేయెడలనున్న వాఁడవు
    మాయపుదైవంబునిన్ను మాయించెనొకో. ౨౬౫.

క. ఫలములుజలములొసంగుచుఁ
    గలకాలముభక్తిఁగొలిచికడనీగతిమ
మ్మలయించిత్రివిష్టపమున
    కలరుచునీవెక్కఁడరుగనర్హమెతనయా. ౨౬౬.

ఉ. ఎవ్వరుమాకుదిక్కుమఱియెవ్వరుమమ్మరయంగనేర్తురిం
కెవ్వరుతోయముల్ఫలములేమఱకర్పణసేయువారలే
మెవ్వరిగోముమోముఁగనుఁగొంచునుగముద్దిడుచుందుమయ్యయో
యెవ్వగనోర్చువారమిపుడేగతిఁబ్రాణములుండుఁబుత్రకా. ౨౬౭.

వ. అని యనేకప్రకారంబులం బ్రలాపించుచు నురంబులఁ గరంబుల మోఁదికొనుచు మహాశోకాక్రాంతు లగుచుఁ గొంతతడవునకు నూఱడిల్లి తత్పుత్రకళేబరంబునకు నిగమోక్తప్రకారంబున నగ్ని యొసంగి యుదకప్రదానంబు సేయుటయు నక్కుమారుండు దివ్యవిమానారూఢుండై యుపరితలంబున నిలిచి గురులం గని యిట్లనియె.

గీ. అనఘులారమిమ్మునర్చించుకతమున
    నాకపథముగల్గెనాకునిపుడు
పోవుచున్న వాఁడఁబుణ్యుఁడీదశరథుం
    డలుగవలదుమీరలాత్మలందు. ౨౬౮.

క. అనిపల్కిగురుసుతుఁడుదివ
    మునకరుగఁగదీనభావమునఁబొరలుచువా

రెనలేనిశోకమంచుచు
నను~గనియిట్లనిర్క్రోధనయనములలర౯. ౨౭౦.

గీ. ఇదె పుత్రశోకమున~బో
యెదమూర్ధ్వపదంబు~జెందనిలపైనికి
ట్లాదవునపల్కి తనువులు
వదలిదివంబునకు~జనిరి వారలునపుడు౯. ౨౭౧.

వ. అంత నే నావృద్ధదంపతుల కగ్నిసంస్కారంబు లొనర్చి శుచిస్నాతుండ నై పురంబున కరుగుదెంచితి నిప్పు డట్టిశాపఫలంబుసంజేసి పుత్రశోకాతురత్వంబు సంఘల్లె~ గావున. ౨౭౨.

క. ఒడలం బ్రాణములుండవు
కడుడస్సె న్నేనుమిగుల~గంపమునొంచె
న్వడివడినిశ్వాసంబులు
బొడమెన్దివమునకునిపు డెపోయెదనబలా. ౨౭౩.

గీ. అనుచు~బల్కి యపుడుహా రామహా రామ
యనురవంబుతోడ~దనువు~బాసి
విశదకీర్తిరతు~డుదశరథోర్వీశు~డు
త్రిదివమునకు~జనియెదిశలువెలు~గ. ౨౭౪.

వ. అంత~ గౌసల్యాసుమిత్రప్రముఖనిఖిలకామినీసందోహంబులు భూపాలు~ దలసి నిద్రించెం గా~బోలు నని యయ్యెయెడల శయనించి ప్రాతస్సమయంబున నందఱు మేల్కాంచి తూర్యనినదంబులం దెలివి నొందని రాజవర్యు శయ్యాతలంబు~ జేరియు శ్వాసనిశ్వాసంబులు లేమిం జేసి మృతుం డయ్యె నని తలంచి పయిం బడి యురంబులు మో~దికొనుచు మహారోదనంబు లొనర్పం గౌసల్య తద్విభుని మోము మోమునం జేర్చి ప్రలాపింపం దొడంగె. ౨౭౫.

సీ. హాకకుత్స్థకులామృతార్ణవద్విజరాజ
హాసర్వసర్వంసహాబిడౌజ
హాశతకోటియహర్పతిసమతేజ
హాదీనజననిర్జరావనీజ
హానిఖిలారాతిమానగర్వాపహ
హారమ్యతరసుకుమారదేహ
హామహోదారగుణాకరనగధీర
హారణరంగస్థలైకవీర
హాదయాసత్యసంశీలహానృపాల
హాదశరథక్ష్మాధీశహామదీశ
యెందుఁబోయితివహహాయేమందునింక
నిన్నుఁబాసినిమేషంబునిలువవశమె. ౨౭౬.

ఉ. భూతదయాళుఁడైపలికిబొంకకస్వర్గముఁగంటివీవుప్ర
ఖ్యాతిగవీయనుజ్ఞఁగొనికానకురాఘవుఁడేగెధన్యుఁడై
నీతివిశారదుండవగునీమదిఁగానకకాలులాడినేఁ
బాతకినైతినెప్పగిదిభావముగుందఁగనుందుభూవరా. ౨౭౭.

మ. అనికౌసల్యమహాదురంతతరచింతాక్రాంతయైయేడ్వన
వ్వనితావారముబోరుబోరుమనుచున్వాపోవఁదద్రావమె
ల్లనునల్దిక్కులఁబర్వఁగైకవినివెల్లంబోయివేగంబునం
గనులందోయకణంబులొల్కఁగనురాఁగౌసల్యదానిట్లనెన్. ౨౭౮.

శా. కైకానీమదిచల్లనయ్యెనుగదాకాకుత్స్థవంశంబుచీ
కాకైతల్లడమందఁజేసిధరణీకాంతున్వసన్మ్రింగితి
శోకంబందఁగనేలనీకునిఁకనీక్షోణీతలంబంతయున్
జేకూరెన్నతిసర్వసంపదలచేఁజెన్నొందిపాలింపుమా. ౨౭౯.

క. అని పెనుకాఱులుదనుఁబ
    ల్కినఁగైకశిరంబువాంచిక్రిందుమొగంబై
కనుఁగవనశ్రువులొలుకఁగ
    వనజహితాన్వయునిఁగాంచివగచుచునుండెన్. ౨౮౦.

వ. ఇట్లంతఃపురకాంతామణు లంతరంగంబున నడలుచు నత్యంతదుఃఖంబునం బొరలుచుఁ బెనుఘోషంబు లడర నేడ్చుచున్నంత నెఱింగి బంధుమిత్రమంత్రిసామంతభృత్యప్రభృతివర్గంబును వసిష్ఠాదిమహామునిగణంబునుం బఱతెంచి కౌసల్యాదికాంతాజనంబుల నూఱడిల్లంజేసి రా సమయంబున వసిష్ఠుండు దశరథుకళేబరంబుఁ దైలపక్వంబొనర్చి సింహాసనంబునం గొలువున్నతెఱంగున నునిచియుండ నియమించి మంత్రులం గని యిట్లనియె. ౨౮౧.

శా. రాజన్యుండమరావతీపురముఁ జేరంబోయెశ్రీరాముఁడీ
    రాజాజ్ఞన్వనభూమికేఁగెఁబిలువన్రానేరఁడెంతేనియుం
    బాఁజేయందగుపూన్కిఁదీర్పకయిఁక౦ధాత్రింబ్రపాలింపఁగాఁ
    రాజీవాప్తకులాబ్ధిచంద్రుభరతున్రప్పింపనొప్పున్వడిన్. ౨౮౨.

క. తురగములెక్కిగిరివ్రజ
    పురమునకుంజనిధరాధిపుని తెఱఁగుబయ
ల్పరుపకమద్వాక్యముగా
    భరతునిఁదోడ్తెండుపొండుపటువేగమునన్. ౨౮౩.

గీ. అనివసిష్ఠుండుసచివులననుపవార
    లరిగిభరతునిఁగనిమ్రొక్కియపుడుపిల్వ
మాతులునకెఱిఁగించిసమ్మతముమీఱ
    ననుజుఁడునుదానుదగినవాహనములెక్కి. ౨౮౪.

క. పరిజనయుతముగ నగరీ
వరములు విపినములు గడచి వరుస నయోధ్యా
పురిఁ జేరవచ్చుటయుఁ ద
త్పురి గడుఁ బాడడరియుండఁ బొక్కుచుఁ గనియెన్. ౧౮౫.

చ. కనియిది యేలొకో పురము కంటికి వింతగఁ గాననయ్యెడిన్
ననుఁగని చిన్నఁబోవు వదనంబులతోఁ దలవాంచి పౌరులుం
గనుఁగవలందుఁ దోయములు గ్రమ్మఁగ నేడ్చెద రెట్టి వార్తనే
వినఁగ ఘటించునో యనుచు వేమఱు నెన్నుచుఁ బోయి యంతటన్.

క. కైకం గని మ్రొక్కఁగ నప్పు
డా కాంతయు సుతుని రాకకలరుచుఁ బ్రీతిం
జేకొని దీవెనలొసఁగి మ
హాకౌతుకమంద భరతుఁ డపుడిట్లనియెన్. ౧౮౭

క. రామునకు లక్ష్మణునకు
న్నేమమొ దశరథనృపాలశేఖరుఁ డెపుడు
న్నామోదంబున నుండునె
నామదిఁ గలఁకల్డోలంగ నాతిరొ చెపుమా. ౧౮౮.

వ. అనినం గైకయి యిట్లనియె ౧౮౯.

క. మును దేవాసురసంగర
మున వరయుగ మొసఁగెనాకు మొనసి నృపాలుం
డను వొంద రాముని డవుల
కనుపదు నాల్గేండ్లు పనుపఁగోరితి నొకటన్. ౧౯౦.

క. ధరసీకొసఁగఁగ మఱి యొక
వరమడిగితి నంత నృపుఁడు వనమున కనుపన్

ధరణిజనుగూడి రాఘవుఁ
డరిగెన్లక్ష్మణుఁడువెంటనరుదేరంగన్. ౨౯౧

గీ. పుత్రశోకమునను బుడమిసొక్కఁడీల్గెను
నిఖిలభాగ్యములునుని న్నె పొందెఁ
గానసుర్వియెల్లఁగైకొని యేలుము
పట్టభద్రుఁడవయిపట్టినీవు. ౨౯౨

క. అనికైకపలుకుపలుకులు
పెనుములుకులభంగిహృదయభేదనమొనరిం
చినహాయనిమదిదూలఁగ
ఘనసాలముభంగిమూర్ఛగదురఁగఁబడియెన్. ౨౯౩

వ. ఇట్లు భరతుం డత్యంతసంతాపంబున మూర్ఛ నొంది తెలి వొంది కఠోరం బగుక్రూరవిలోకనంబులం గైకేయిం గాంచి యి ట్లనియె.

ఉ. అక్కట భానువంశమునకాఱడిఁదెచ్చి తెకైకరాముని
గక్కసమైనకాఱడవిఁగాఁపురమందఁగఁజేసిభూవిభు
నక్కకమింగియిప్పగిదిధారుణిఁగైకొనఁగోరితయ్యయో
రక్కసివౌదువింతేమఱిరాజసతీమణివేతలంపఁగాన్. ౨౯౪

క. అడలుచునవనీసుతన
ట్టడవులఁబడలంగఁగాంచియకటాయనిరా
ముఁడునన్నెటుమదిదూఱునొ
కడుఁబాపంబెల్లమూటగట్టితెనాకున్ ౨౯౫

గీ. ఈధరాధిపత్యమేనొల్లఁబురమొల్ల
భాగ్యమొల్లరాజభవనమొల్ల
మానివృత్తిఁబూనిమహిఁతాఁటవులయందు
రామచంద్రుఁగొల్చుటేమతంబు. ౨౯౬

వ. అని భరతుండు పెక్కుభంగులం దుఃఖించుచుం గైకం దూఱుచు రాముని దలంచి పలవింపుచున్నంతం దత్సమీపంబునం గ్రుమ్మరు దాసీజనంబులు నిక్కారణంబునకు నిదియె మూలం బని మంథరం గనుసన్నం జూపినం గని శత్రుఘ్నుండు కోపోద్దీపితమానసుండై దానిం బదంబు లొడిసి గిరగిరం ద్రిప్పి భూమిపయి నడిచి పోవైచి ఖడ్గంబుం గొని కైకం దునుమం గమకించుటయు భరతుండు వారించి యిట్లనియె. ౨౯౮.

గీ. మాతృహంతలనుచుమనలశ్రీరాముండు
రోయుఁగాననిట్లుచేయుటుడుగు
మనుచుఁబల్కియప్పుడనుజుండుఁదానుఁగౌ
సల్యకడకుఁజేరఁజనుచుసందు. ౨౯౯.

క. మినువిఱిగిపైఁబడినక్రియ
ఘనశోకదవాగ్నినడుమఁగనలుచుమఱియున్
దనుఁదామఱచినకౌస
ల్యనుగనిభరతుండుపదములకునమ్రుండై. 300.

క. కడుదుఃఖమందిపుడమిం
బడిపొరలుచునడలుచున్నభరతునిక్రోధం
బడరఁగఁగనికౌసల్యయు
నుడుగనికన్నీటితోడనుగ్రతఁబలికెన్. 30౧.

శా. నీకోర్కుల్సఫలంబులయ్యెభరతానిక్కంబుస్వాంతంబున
న్శోకంబుంగలవానిభంగినిటులన్శోకింపనింకేలస్వ
ర్లోకంబుందెవిభుండుకాఱడవికిన్బోనైచనెరాముఁడా
కైకాదేవిమనంబురంజిలఁగభూకాంతుండవైయుండుమా. 30౨.

గీ. అనుచుఁగౌసల్య పెనుకాఱులాడుటయును
    వినిమనంబునఁగడుఁజింత బెనఁగుచుండఁ
బదములనువ్రాలియంజలిబద్ధుఁడగుచు
    భరతుఁడిట్లనియెనుశోకపరతదోఁప. ౩౦౩.

గీ. రామచంద్రునకును నామనోవాక్కాయ
    కర్మములను నెగ్గుగలుగఁజేయఁ
దలఁచియుంటినేనిధర్మేతరుండేగు
    గతికిఁబోవువాఁడఁగనుముజనని. ౩౦౪.

వ. అదియునుంగాక. ౩౦౫.

మ. గురుదారాపహుభంగిజాసునిక్రియంగోహంతభాతిన్ధరా
మరసంహారకురీతినీతిరహితత్స్వానాథుపోల్కిన్స్వయం
కరమామగ్గతిఁబొందువాఁడమత్కైకాదేవిశ్రీరామభూ
వరునిట్లాజడిపుచ్చిపంచుటలునావాక్యోక్తిగాఁగల్గినన్. ౩౦౬.

క. ఇనవంశంబునసగ్రజుఁ
    డనుపమయోగ్యుండుగల్గనవనికిరాజై
మనఁగఁగనిష్ఠుఁడుగోరుట
    జననీవినియెఱుఁగమింతజడుఁడనెచెప్పుమా. ౩౦౭.

వ. అని యనేకప్రకారంబుల విన్నవించుచున్న నిర్మలచిత్తుండగుభరతుం గని కౌసల్య మనంబున విశ్వాసంబు దోఁపఁ గౌఁగలించుకొని తోడ్కొని చని మరణంబు నొందియున్న దశరథుకళేబరంబుఁ గాన్పించుటయు హా యని మహారోదనంబునం బ్రచండవాతాహతిం గూలు భూజాతంబుకైవడి మహీతలంబునం బడి మూర్ఛిల్లి క్రమ్మఱం దెలివొంది యిట్లనియె. ౩౦౮.

ఉ. అక్కటనన్నుఁగాంచిహృదయంబునవర్తిలిమీఱనెల్లనాఁ
డక్కునఁజేర్చుచున్నప్రియమాఱడివుచ్చిశిరంబువాంచియే
దిక్కునఁజూడరున్కిఁగనిదిక్కుదొలంగికలంగియింకనే
నెక్కడఁజొత్తుశోకభరమెట్లుభరింతుధరాధినాయకా. ౩౦౯.

క. నీవంటిసత్యసంధుని
భావింపఁగలేకకైకపటుశోకమునం
బోవఁగఁజేసెనెదివికి
న్భూవరయీదుఃఖమెట్లుపొందిచరింతున్. ౩౧౦.

క. భూనాథయిపుడుననుఁగై
కానందనుఁడనుచురోసికడగంటఁగనం
గానొల్లవీసుమిత్రా
సూనునిమన్నించికరుణఁజూడఁగరాదే. ౩౧౧.

వ. అని యపారం బగుదుఃఖపరవశత్వంబునం భరతుండు మహాక్రంద
నంబు సేయుచున్నంత నయ్యెడకు సుమంత్రజయంతప్రముఖమంత్రి
వర్గంబును హితబంధురాజసముదయంబును నిఖిలమునిగణసందో
హంబును సమస్తవందిమాగధపౌరజననివహంబునుం బఱతెంచి
యాఖండిలం బలికి శోకోపశమనం బొనర్చుచుండ వసిష్ఠుండు భరతు
ననునయించుచు నిట్లనియె. ౩౧౨.

క. పరరాజన్యులుగొలువఁగ
ధరనఱువదివేలయేండ్లుతగనేలిమము
న్వరతనయులుగాఁగఁబడసి
పరమందినన్నృపునకేలపరితపియింపన్. ౩౧౩.

గీ. వేగముననగ్నిసంస్కారవిధులొనర్పు
మనినభరతుండుదెలివొందియాప్తబంధు

జనులతోఁగూడిమృతుఁడైనజనకునకును
గ్రమముమీఱంగఁబుణ్యోదకములనార్చి. ౩౧౪.
చ. అమలమణీవిభూషణచయంబులలంకృతిచేసిసద్విమా
నముననమర్చిబాంధవజనంబులతోసరయూనదీసమీ
పమునకుఁగొంచునేగిక్రమభంగులనగ్నియొసంగియాగమో
క్తముగఁదిలోదకాదివిధిఁదప్పకతీర్చియనంతరంబునన్. ౩౧౫.
క. దినదినకర్మంబులఁబెం
పుననడపుచుద్వాదశాహమునసర్వంబు
న్దనివారసలిపిగోభూ
కనకాదులుమిగులవిప్రగణములకొసఁగెన్. ౩౧౬.
వ. ఇట్లనేకదానంబు లొసంగి సకలకర్మంబులు సాంగంబులుగా నిర్వర్తించి సంతుష్టుండై యున్న భరతునిం గాంచి వసిష్ఠుం డిట్లనియె.
గీ. దశరథోర్వీశుఁడరిగెఁద్రిదశపురమున
కలజనకునాజ్ఞఁజెల్లింపననుజుఁగూడి
రామచంద్రుండుసనియెనరణ్యమునకుఁ
దేటవడనిట్టివర్తనలైసలునిండె. ౩౧౭.
క. ధరణియరాజకమైనం
బురజనులకుఁగలఁతగలుగుఁబోఁగదుసఖ్యం
బరులుదలలెత్తియాడుదు
రరయంబట్టంబుఁబూననగునీకనఘా. ౩౧౮.
క. అనిమౌనిపలుకుపలుకులు
వినిభరతుఁడుశోకరోషవిహ్వలమతిని
ట్లనియెన్మునివరకైకా
తనయుఁడననిశాదెనన్నుఁదలఁచిపలుకుటల్. ౩౨౦.

క. మున్నిక్ష్వాకుకులజాలం
దెన్నండగ్రజుఁడుదక్కనిట్లుకనిష్ఠుం
డున్నతపదవిం జెందుటఁ
గన్నారంగంటి వీవుఘనమునిచంద్రా. ౩౨౧.

క. అదిగానరామభద్రుని
పదములకే నెఱఁగిభువనభారంబౌన
స్పదలకతోడ్తెచ్చెదనా
మదినొండుఁదలంపఁజొప్పునఁగానివరేణ్యా. ౩౨౨.

చ. అనికృతనిశ్చయుండగుచునప్పుడునాఁడరుణోదయంబున
న్సుతులునమాత్యులున్హితులుముఖ్యనృపాలురుఁగొల్వఁదల్లులు
న్వెసకొనిరానసేకగజవీరభటాశ్వరథాళియుక్తుఁడై
యనుజునిఁగూడితానరిగెనగ్రజుఁదోడ్కొనితేరనుబ్బుచున్. ౩౨౩.

వ. ఇట్లు భరతుం డనేకభటపరిచారకాదిజనంబులు సంభ్రమాయత్త
చిత్తులై పఱతేర ఛత్రచామరాలవట్టధ్వజపతాకాములు వెలుంగ
వందిమాగధులకైవారంబులు చెలంగ భేరీమృదంగకాహళాదిమం
గళవాద్యారావంబులు బోరుకొలుపఁ జని చని గంగాతీరంబున
విడిసియున్నయెడ. ౩౨౪.

క. బలములుగొలువఁగఁజెలఁగుచు
నలజాహ్నవియందువిడియుటాప్తులవలనం
దెలిసిగుహుండాగ్రహుఁడై
బలములతోనరుగుదెంచిభరతునకనియెన్. ౩౨౫.

చ. గురుతరరాజ్యసంపదలుగొమ్మనినీకునొసంగిరాఘవుం
డురుగహనాంతరంబులనునుండఁగఁబోయిననంతఁబోకయీ

కరిరథఘోటకావలులునుగాల్బలముల్గొనియిట్లునీవుసం
గరమునకేఁగఁగాఁదగునెకిట్టిఁడివైభరతామదోద్ధతా. 3౨౬.

క. నేరామునిభృత్యుఁడనా
తోరణమొనరించిగెలిచితుదనాతనిపైఁ
బోరాటమికింజనుమిఁక
ధారాళముగాఁగలెమ్ముదర్పమెలర్పన్. 3౨౭.

క. అనియార్భటించిపల్కుగు
హునిఁగనిభరతుండెడందనుప్పొంగుచుఁజెం
తనుజేరికౌఁగలించివ
దనమునదరహాసమొప్పఁదానిట్లనియెన్. 3౨౮.

క. ధరణికిరాజవుగమ్మని
పరమదయాళుఁడగురామభద్రునిచరణాం
బుజములకెఱఁగివేగమె
పురికిందోడ్తెచ్చుటకునుబోయెదనసఖా. 3౨౯.

క. నీవెందుమదిఁదలంపకు
మేవిధముననైనరామునిటఁదోడ్తేరం
గావలయుఁగానమాతో
నీవుంజనుదెమ్ముకూడినెక్కముగాఁగన్. 330.

చ. అనిపలుకంగుహుండలరియత్యనురాగమునొంది తేనియ
ల్ఘనతరమాఫలంబులునుగానుకలిచ్చినమస్కరించియి
ట్లనియెనధీశనీహృదయమారయకేనుదుక్తులాడితి
న్ననుమదివేఱుగాఁగొనకనాయపరాధముల్క్షమింపుమా. 33౧.

వ. అని గుహుండు వినయావనతుండై విన్నవించిన భరతుండు సంతసం
బంది సాయాహ్నసమయం బగుటయు మందాకినియందు సంధ్యాది